

**డా. తాడేపల్లి పతంజలి బయోడేటా**

| | |
|---|---|
| పుట్టిన తేదీ | 15-07-1963 |
| తల్లిదండ్రులు | తాడేపల్లి సుశీల, పార్వతీశశాస్త్రి |
| భార్యాపిల్లలు | తాడేపల్లి మీనాక్షి,(అర్ధాంగి) దీప్తి, కావ్య(పిల్లలు) |
| ప్రస్తుత ఉద్యోగం | ప్రిన్సిపాల్, ప్రభుత్వడిగ్రీ కళాశాల, సదాశివపేట , సంగారెడ్డి జిల్లా |
| ముద్రిత రచనలు | 1.అన్నమయ్యఅన్నమాట,(2012) 2.అన్నమయ్యగీతోపదేశాలు,(2011) 3.భవిష్యపురాణము,(2010) 4.శ్రీమన్నారాయణీయము(2006), 5.భావనలు,(2004) 6.మామాకలాపం,(1997)7.నాటి భారతంలో నేటి సమాజం,(1996) 8.ప్రాచీనప్రబంధం, ఆధునిక సంతకం(2014), 9. అన్నమయ్య కౌముది (2015)10.శ్రీశివ మంగళాచరణ సురభి (2016) 11.అన్నమయ్య పదం పరమార్థం(2016) 12. నమక చమకాలు అర్థతాత్పర్య విశేషాలు(2016) 13. చెరువు సత్యనారాయణ శాస్త్రి లింగోద్భవ స్తుతి(2017),శ్రీ విష్ణుదేవ కర్మామృతం. |
| ప్రభుత్వ అవార్డులు | జాతీయ స్థాయిలో ఆకాశవాణి ఉత్తమ హాస్య రచయిత అవార్డు(1996) రాష్ట్ర స్థాయిలో ఉత్తమ అధ్యాపక అవార్డు(2010) |
| వివిధ సంస్థల అవార్డులు | సర్వవైదిక సంస్థానం, కరీంనగర్ వారి పురస్కారం(2018) నోరినరసింహశాస్త్రి సాహిత్య పీఠ పురస్కారం (2017)మొదలయినవి |
| బిరుదులు | అన్నమయ్య పదసేవక , ప్రవచన ప్రవీణ |
| అభిరుచి | వివిధ ప్రభుత్వ/ప్రైవేటు టీవీ చానల్లో శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్య,హరవిలాస శ్రీశివ మంగళాచరణ సురభి,అప్పయ్య దీక్షితుల ఆత్మార్పణ స్తుతి మొదలయిన ప్రసంగాలు/వ్యాఖ్యానాలు. రెండు తెలుగు రాష్ట్రాలలోని వివిధ సాహిత్య వేదికలపై కావ్యాలు, భగవద్గీత , ఉపనిషత్తులుమొదలైన వాటిపై ప్రసంగాలు, ఆకాశవాణిలో వివిధ సందర్భాల్లో అనేక ప్రసంగాలు, జాతీయ కవితానువాదాలు |
| అభిలాష | అడ్డుగోడలు లేకుండా ఆకాశంలా కనిపించే విశ్వ సాహిత్యాన్ని చేతనయినంతగా ఆస్వాదించటం, వీలయినంతగా అర్హులకు ఆ పరిమళాలని పంచిపెట్టడం |




పుస్తకం వెల : అమూల్యం




# భగవాన్ శ్రీ రమణ మహర్షి రచించిన

# శ్రీ అరుణాచల అక్షరమణమాల

## (తాత్పర్య విశేషాలతో)

**డా. తాడేపల్లి పతంజలి**

**Sree Arunachala Manamala**
by
**Dr. Tadepalli Patanjali**

First Edition: December, 2018



Address :
**Tadepalli Patanjali**
Flat No. 201, Sai keerthi Residency,
Satya Enclave, Chandanagar, Hyd.-500 050.
Mobile: 9866691587

ISBN No.: 978-93-5346-566-7

Copies: 500

Book Price: Amulyam

*Book Design & Production:*
**JV Publishers**
**Jyothi Valaboju,**
Mobile: 80963 10141

Published by:
**Smt. Pillalamarri Rajarajeswari**

Type Setting:
**K. Ravi Prabha**, Cell: 93999 32729

*Printed at:*
**Karshak Art Printers,** Vidyanagar, Hyd.44

*for Copies:*
**P.V. Ramana Murthy**
Flat No 31, Ramachandra Enclave,
Road No. 05, NMDC Colony, East Anandbagh,
Malakajigiri, Hyderabad-47

& All Major Book Shops

# సాగర రమణులు

**మా** మూడో అల్లుడు డా. తాడేపల్లి పతంజలి రచించిన 'అరుణాచల మణమాల' పుస్తకం ఈ రోజు ప్రచురణ వెలుగులోకి వస్తున్నందుకు చాలా ఆనందంగా ఉంది. ఈ సందర్భంలో శ్రీ అరుణాచల రమణులను, నా హృదయంలో సజీవులుగా ఉన్న శ్రీ సత్యసాగర్‌గారిని హృదయపూర్వకంగా స్మరిస్తున్నాను.

శ్రీ సాగర్‌గారు శ్రీ రమణుల గాఢభక్తులు. 'పురుషోత్తమ రమణ' పేరుతో పుస్తకం రచించి రమణుల అక్షరార్చన చేసిన ధన్యులు. వారు రమణులను తన జీవితంలో త్రికరణశుద్ధిగా నమ్మినవారు.

నాకు ఇప్పటికీ బాగా గుర్తు. మా మొదటి అబ్బాయి పురుడు రోజులు. ఇంట్లోనే పురుడు. పిల్లవాడు ఎదురు కాలు మొదటగా బయటకు వచ్చింది. అందరూ బెంబేలెత్తుతున్నారు. హాస్పిటల్‌కు తీసుకువెళదామని అందరూ చెబుతున్నారు. వ్యాను కూడా తీసుకువచ్చారు. రమణులను నమ్ముకున్న సాగర్‌గారు చలించలేదు. రమణులే కాపాడుతారని, ఎక్కడికి వెళ్లనక్కరలేదని నిరంతర రమణ జపం చేసారు. ఆ రమణ మంత్రవిభూతిని నా నోట్లో వేసారు. వారి నమ్మకమే గెలిచింది. సుఖప్రసవమయింది. రమణులు సాగరంలాంటి అనుగ్రహం చూపించారు. అబ్బాయికి 'వెంకటరమణ' అని రమణుల పేరు పెట్టుకొన్నాం.

ఈ నేపథ్యంలో మా అల్లుడు పతంజలి రమణులకు సభక్తిపూర్వకంగా రచించిన 'అరుణాచలమణమాల'ను ప్రచురించాలని నాకు 'సాగరరమణ' సంకల్పం కలిగింది. నా పెద్దకుమారుడు చి. వేంకటరమణ, రెండవ కుమారుడు చి. సాయిరాం ప్రసాద్ మంచిపని చేస్తున్నావని నన్ను ప్రోత్సహించారు. ఈ పుస్తకరచయిత చి. పతంజలికి ఆశీస్సులు. చక్కగా ప్రచురించిన ప్రింటర్స్ వారికి, ప్రచురణ బాధ్యత వహించిన శ్రీమతి వలబోజు జ్యోతిగారికి ధన్యవాదాలు.

.

**– పిల్లలమర్రి రాజరాజేశ్వరి.**

అరుణాచల శివ – అరుణాచల శివ
అరుణాచల శివ – అరుణాచలా!
అరుణాచలా శివ – అరుణాచల శివ
అరుణాచల శివ – అరుణాచలా!
ఓం నమో భగవతే శ్రీ రమణాయ

# నాంది

శ్రీ రమణ మహర్షి 'అక్షర మణమాల' జగత్ప్రసిద్ధమైనది. అక్షర మణమాల గురించి అనేక ప్రస్తావనలు, పుస్తకాలు, వీడియోలు, తెలుగు, ఆంగ్ల అనువాదాలు ఎక్కడ చూసినా మనకు అంతర్జాలంలో కనిపిస్తాయి. కాని తెలుగులో వ్యాఖ్యానం నాకు ఎక్కడా కనిపించలేదు. (ఒకవేళ తెలుగులో వ్యాఖ్యానం ఉన్న పుస్తకం ఉన్నదంటే మిత్రులు తెలియచేయ మనవి.) అది మొదలుపెట్టి నా ఆత్మను సంతోషపెట్టుకొందామని నాకు ఈ రోజు శివయ్య దయవలన ఆలోచన కలిగింది.

నాకు తమిళం రాదు. రమణుల తమిళ చరణాలను తెలుగులోకి మార్చినవారు శ్రీ గిద్దలూరు లక్ష్మీనరసింహంగారు. వారికి కృతజ్ఞతలు తెలియచేస్తూ వారి తెలుగు అనువాదాన్ని ఆధారం చేసుకొని ఈ ఆత్మ సంతోష వ్యాఖ్యాన కార్యక్రమం మొదలుపెడుతున్నాను. తప్పులు అనిపిస్తే తెలియచేయ మనవి. సరిదిద్దుకొంటాను.



తిరువణ్ణామలై పట్టణంలో ఆహారాన్ని యాచించడం కోసం రమణ మహర్షి భక్తులు వెళ్ళేవారు. తాము రమణ మహర్షి శిష్యులుగా గుర్తింపు పొందుట కొరకు అవి పాడుతూ యాచన చేద్దామని పద్యాలు వ్రాయమని రమణ మహర్షిని ప్రార్థించారు. వారి అభ్యర్ధనపై భగవాన్ రమణులు ఈ 'అరుణాచల మణమాల' వ్రాసారు. తనను వధువుగా, శివుని వరునిగా ఇందులో రమణులు భావించారు. తన ఆధ్యాత్మిక అనుభవాలను నెరవేర్చలేదని వధువుగా కొన్నిచోట్ల శివుని నిందా స్తుతి చేసారు. అరుణగిరి ప్రదక్షిణలో భగవాన్ రమణులు నోటి వెంట ఆశువుగా వెలువడిన వీటిని శిష్యులు అక్షరబద్ధం చేసారు.

'అక్షర' అనేది సంస్కృత పదం, ఇది నాశనం చేయలేని అక్షరం, తమిళ భాషలో 'మన' అంటే వివాహం, 'మలై' అంటే దండ. వధువు రమణ మహర్షి, వరుడు అరుణాచలేశ్వరుడు. అందువల్ల 'అక్షర మనామలై" అంటే రమణ మహర్షి చేత వ్రాయబడిన వివాహలేఖల (దండల) అలంకరణ. ఇంకొక రకంగా 'అక్షర మణమాల" అంటే 'సువాసన గల దండ' అని అర్థం.

భగవాన్ ఒక రోజు గిరి ప్రదక్షిణం చేస్తూ ఉండగా ఆశువుగా ఆయన నోటినుండి వచ్చిన అరుణాచలేశ్వరుని స్తుతి ఇది.

అరుణాచలమనేది సాధారణ జీవికి ఒక కొండ. భగవాన్ రమణుల అనుభవం మాత్రం భిన్నం. కరుణాసముద్రుడైన శివుడే ఘనీభవించిన కొండై నిలిచాడన్న అనుభూతి వారిది. తనకు, అరుణాచలానికి తేడా ఏమీ లేదన్న అభేద, అద్వైత స్థితి. అద్వైత స్థితిలో అరుణాచలాన్ని రమణులు సంబోధించిన పరమాద్భుత కవితావైఖరి ఆపాతమధురం.



మా మామగారు కీర్తిశేషులు శ్రీ పి. సత్యసాగర్‌గారు. వారు ఉత్తమ సాహిత్యాభిలాషి, శ్రీ రమణ మహర్షి భక్తులు. శ్రీ కావ్యకంఠ గణపతిముని వ్రాసిన 'శ్రీ రమణ గీత'ను 'పురుషోత్తమ రమణ' పేరుతో తెలుగులోకి అనువదించారు. దానిని రమణాశ్రమంవారు ప్రచురించారు.

నన్ను కుమారునిలా ఆదరించి, నా పురోభివృద్ధికి సహకరించిన వారి వాత్సల్యతను స్మరించుకొంటున్నాను.

**పదునైదువత్సరమ్ములు**
**సదమలకాలమున దాటె సాగరుగారూ!**
**మదిలోన మీదు జ్ఞాపక**
**మది కాలము మించినది పదాంజలులివియే.**

వారిని జ్ఞాపకం చేసుకొంటూ మా అత్తయ్యగారు శ్రీమతి పిల్లలమర్రి రాజరాజేశ్వరిగారు ఈ 'అరుణాచల మణమాల' పుస్తకాన్ని అందంగా ప్రచురిస్తున్నారు. మా అత్తయ్యగారి సౌమనస్యము ఇంతింత అనరానిది. వారి సౌహార్ద్ర హృదయానికి ధన్యవాదాలు. భగవంతుడు వారికి దీర్ఘాయురారోగ్యాలను ప్రసాదించాలని హృదయ పూర్వకంగా ప్రార్థిస్తున్నాను.



ఈ పుస్తక రచనలో అనేకులు వ్రాసిన గ్రంథాలు, వ్యాసాలు తోడ్పడ్డాయి. వారి సౌజన్యాన్ని పేర్లతో సహా రచనా సందర్భంలో పేర్కొన్నాను. అందరికీ ధన్యవాదాలు.

ఈ పుస్తక ముద్రణా బాధ్యతను వహిస్తున్న జ్యోతి వలబోజుగారికి, ముద్రణ చేసినవారికి ధన్యవాదాలు.

**– డా.తాడేపల్లి పతంజలి**

ఓం నమో భగవతే శ్రీ రమణాయ

# అక్షరమణమాల

**'మ**ణమాల' అంటే కళ్యాణమాల. అది నాశమెరుగని, వసివాడని జీవాత్మ పరమాత్మల బంధమైతే, 'అక్షరమణమాల!' ఇదొక దివ్యసాధనామార్గం. ద్వైతంతో ప్రారంభమై అద్వైతంగా ముగిసే అందమైన భావగీతం 'అక్షరమణమాల'.

"లోతుగా అధ్యయనం చేసి, అనుభూతి చెందగలిగితే, 'అక్షరమణమాల' సుషుమ్నా గీతం. అహం నశిస్తే తప్ప సోహం స్థితి లభించదని చెప్పే సాధనాగీతం. రమణుల సాలోక్య, సామీప్య, సాన్నిధ్య, సాయుజ్య స్థితులను ఆవిష్కరించే రమణీయ హృదయగానాన్ని విందాం!" అని పెద్దలు ఈ 'అక్షరమణమాల' నేపథ్యాన్ని పలికారు. ఇందులో 108 చరణాలు ఉన్నాయి.



ఓం నమో భగవతే శ్రీ రమణాయ

**అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచలా**

**అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచలా**

## అక్షరమణమాలలో వినాయక ప్రార్థన

**సాక్షాదరుణగిరీశ్వర వరార్హమగు నక్షరమణమాల నమరించుటకును**

**కరుణాకరుండగు గణపతి యొసంగి కరమభయకరము కాపాడుగాక!**

**తాత్పర్యము**

అరుణాచల వరుని పొగుడుటకు తగిన అక్షరాల వరమాలను కరుణకు నిలయుడైన ఆ వినాయకుడు అనుగ్రహించి నన్ను కాపాడుగాక!

**విశేషాలు**

ఇది విఘ్నాలను తొలగించు వినాయకుని స్తుతి.

ఆత్మను పరమాత్మతో కలిపే భక్తిభావ పరంపరను నిర్విఘ్నముగా కొనసాగించుటకు కవి వినాయకుని ప్రార్థించారు. ఈ స్తోత్రంలో శ్రీ రమణ

భగవాన్ ప్రియుణ్ణి ఉద్దేశించి పలికే విరహిణి అయిన కన్య పాత్రని ధరించారు. పూజలు మరియు వివాహ శుభకార్యములను ప్రారంభించే ముందు శ్రీ విఘ్నేశ్వరుని పూజించటం సాంప్రదాయంగా వస్తున్న ఆచారం. అరుణాచలేశ్వరుని స్తుతించటం తప్ప మరే ఇతర దేవుళ్ళపైన శ్లోకములు రచించని శ్రీ రమణులు, తమ 'అక్షరమణమాల' అను భక్తి రచన నిర్విఘ్నంగా పూర్తి కావాలని శ్రీ వినాయకుని ప్రార్థించారు. రమణ మహర్షి సంప్రదాయాన్ని పాటించాలి కనుక వినాయక ప్రార్థన చేసారు.

మధురభక్తి సంప్రదాయంలోని రచన ఇది. భక్తుడైన కవి తాను నాయికగా మారుతాడు. పరమాత్మను నాయకునిగా భావిస్తాడు.

అరుణాచలుడు ప్రియుడు. వధువు చేతిలో అక్షరాల పూలమాలను పట్టుకొని ఉంది. ఆ మహర్షి అక్షర భక్తి సుగంధాలను ఆ పూలమాలలోని 108 భావాలలో ఆస్వాదిద్దాం.



## 1

**అరుణాచల మనుచు స్మరియించువారల**
**యహము నిర్మూలింపు మరుణాచలా**

**తాత్పర్యము**

ఓ అరుణాచల రూపములో ఉన్న పరమశివా! అరుణాచలమని నిను తలచుకొనేవారి యొక్క అహంకారమును నిర్మూలింపుము.

**విశేషములు**

1. అరుణ అనగా ఎర్రని, అచలము అనగా కొండ అని అర్థములు. ఎర్రని కొండ అని తాత్పర్యము. అగ్నిలింగము కనుక ఈ కొండని అరుణాచలమని అంటారు. శివుడే ఈ కొండ రూపములో ఉన్నాడని భావించి రమణ మహర్షి (1879–1950) శివుని 'అరుణాచలా' అని సంబోధిస్తూ 108 భావ పరంపరలతో నుతించారు. అందులో మొదటిభావాన్ని మనం ఇప్పుడు విశ్లేషించుకొంటున్నాం.

2. స్మరించుట మాత్రము చేత ముక్తినొసగే క్షేత్రము అరుణాచలము, అందుకే ప్రతి తాత్పర్యంలోనూ 'అరుణాచల' అను సంబోధన పునరావృతి అవుతుంటుంది.

3. శ్రీ రమణ భగవాన్‌ని దర్శించిన తరువాత సరోజినీనాయుడు ఇలా అన్నారు. "ఒకరు క్షణమైనా ఎవ్వరినీ ఊరికే ఉండనీయరు. ఇంకొకరు ఎవ్వరి అహాన్ని క్షణమైనా పైకి లేవనీయరు" అన్నారు. ఆమె పేర్కొన్న మొదటివారు మహాత్మా గాంధీ. రెండవవారు రమణ మహర్షి.

4. నేను అనేది మనందరికి తెలిసిన ఒక అహంకార భావన. ఇది నశించాలంటే అసలైన "నేను" ను అన్వేషించాలి. విచారించాలి. రమణమహర్షి మొదటగా జీవునిలోని అహంకారాన్ని నిర్మూలించమని ఈ చరణంలో ప్రార్థిస్తున్నారు.



## 2

**అళగు సుందరముల వలె చేరి నేను**
**నీ వుందమభిన్నమై అరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! తమిళంలో అళగు, సంస్కృతంలో సుందరము అను పదాలు వేరయినా వాటి అర్థము ఒకటే (అందము) అయినట్లు నువ్వు నేను అను ఉపాధులు వేరుగా అనిపించినా పరమార్థమున ఒకటే.

**విశేషాలు**

తమిళంలో అళగు అనగా సుందరమని అర్థం. సుతరాం అద్రియత ఇతి సుందరం. బాగా సంతోషపెట్టునది కనుక అందానికి సుందరమని పేరు. రమణ మహర్షి తల్లిదండ్రుల పేర్లు కూడ అళగు, సుందరములగుట గమనార్హం. జీవుని అజ్ఞానము దేవునినుండి వేరు చేస్తోంది. అజ్ఞానము తొలగినప్పుడు జీవుడు-దేవుడు ఇద్దరూ ఒకటిగా కనిపిస్తారు.



## 3

**లోదూరి లాగి నీ లోగుహను చెరగా**

**నమరించి తేమొకో యరుణాచలా**

**తాత్పర్యము**

అరుణాచలా! నా హృదయము లోపలికి దూరి నన్ను ఇంట్లోంచి బలవంతంగా బయటకు తీసుకొనివచ్చావు. గుహ వంటి నీ హృదయము లోపల బంధించావు. ఏమిటి నీ లీల?

**విశేషాలు**

1. ఇక్కడ శ్రీ భగవాన్ మధురైలోని తమ ఇంటినుండి బలవంతంగా తిరువణ్ణామలైకి వచ్చిన విషయాన్ని గుర్తు చేస్తున్నారు. తన 17వ సంవత్సరంలో మధురైలోని తన ఇల్లు విడిచిపెట్టి అరుణాచలంలో 54 సంవత్సరాలు నివసించారు శ్రీ భగవాన్.

2. This sanctuary of my soul,
   Unwitting I keep white and whole,
   Unlatchd and lit, if Thou shouldst care
   To enter or to tarry there.

   అని ఒక ఆంగ్ల కవి రమణుల పై భావాన్ని విశదీకరించారు.



## 4

**ఎవరికిగా నన్ను ఏలితి, విడిచిన**

**అఖిలము నిందించు నరుణాచలా!**

**తాత్పర్యము**

ఓ అరుణాచలా! పరమశివా! ఎవరికొరకు నన్ను నువ్వు ఏలుకొన్నావు? ఏలుకొన్న నువ్వు ఇప్పుడు నన్ను వదిలివేస్తే లోకము నిన్ను నిందిస్తుంది కదా! అది నాకు బాధ కలిగిస్తుంది.

**విశేషాలు**

తనకొరకే తపించిన ప్రేమికురాలిని ప్రేమికుడు విడిచిపెట్టాడు. అప్పుడు ఆ ప్రేమికురాలు పలికిన మాటల్లా పైకి ఈ వాక్యాలు అనిపిస్తాయి.

ఇది మధుర భక్తి సంప్రదాయంలో రమణ మహర్షి వ్రాసిన స్తోత్రము. అంతరార్థం ఇది. ఇందులో ప్రేమికురాలు భక్తుడు. ప్రేమికుడు భగవంతుడైన అరుణాచలుడైన శివుడు. నా మనస్సు నిన్ను విడిచి లౌకిక ఆలోచనలవైపు అప్పుడప్పుడు ప్రసరిస్తున్నదని నన్ను విడిచివేసావు. ఎప్పుడూ నీ వద్ద నన్నుంచుకోవాలనే ఆలోచనే లేకపోతే నన్నెందుకు భక్తునిగా స్వీకరించావు? అరుణాచలా! పరమశివా! ఇప్పుడు ఈ భక్తుడిని ఇలా వదిలేస్తే లోకం నీ గురించి చెడ్డగా చెప్పుకోదా? భక్తుని మనస్సును స్వాధీనపరచుకొన్న తరువాత అలా దూరం చేయటం అరుణాచలానికి న్యాయం కాదని భక్తుడు ఈ స్తోత్రభాగంలో వేడుకొంటున్నారు.

శ్రీరమణాశ్రమ లేఖల నుంచి ఒక మనోహరమైన విషయం

శ్రీ భగవాన్ తల ఎప్పుడూ ఊగిపోతూ ఉండేది. చేతికర్ర లేకుండా వారు నడవలేకపోయేవారు. నిలువుగా నిలబడలేకపోయేవారు. ఇదంతా వృద్ధాప్యం వల్ల కాదు. దీనికి రమణ మహర్షి ఇలా కారణం చెప్పారు. “ఒక చిన్న పూరిపాకలో పెద్ద ఏనుగును బంధిస్తే ఆ పాక కదలిపోదా? అట్లాగే ఇదీను” అన్నారు. ఆ స్థాయి కలిగిన మహనీయుని స్తోత్రధారలో ఒక భాగం చదువుకొన్నాం. ధన్యులమయ్యాం. జయహో రమణా!



## 5

**ఈ నింద తప్పు, నిన్నేటికి దలపించి**
**తిక వీడు వారెవరరుణాచలా!**

**తాత్పర్యము**

ఓ అరుణాచలా! పరమశివా! ఏలుకొన్న నువ్వు ఇప్పుడు నన్ను వదిలివేస్తే, భక్తుడిని వదిలివేసాడని లోకము నిన్ను నిందిస్తుంది కదా! ఈ నిందనుంచి

నిన్ను నువ్వే కాపాడుకో. నిన్నే తలుచుకొనేటట్లు నన్నెందుకు చేసావు? నువ్వే నీగురించి తలచుకొనేటట్టు చేసావు. నీ సాంగత్యంలోని మధురిమ చూసిన నేను నిన్ను వదలలేను. నిన్నెవరు వదిలిపెడతారు? అందరూ నిన్ను అంటిపెట్టుకొనే ఉంటారు.

**విశేషాలు**

జలాశయం విడిచి చేప ఎలా మనలేదో, భగవంతుడిని విడిచి భక్తుడు క్షణమైనా ఉండలేడు. ప్రసిద్ధమైన మందార మకరంద పద్యములో ఇదే భావన ఉంది.

పారిజాత పుష్పములలో ఉండే తేనె త్రాగడానికి అలవాటు పడిపోయిన తుమ్మెద ఉమ్మెత్తపువ్వు మీద వాలుతుందా?

ఆకాశములో ఉండే మందాకినీ నదిలో విహరించడానికి అలవాటు పడి పోయిన రాజహంస ఎండిపోయిన ఒక చెరువు దగ్గరకు వెళ్ళి ఆ నీళ్ళు తాగుతుందా?

లేత మామిడి చిగురు తాను తిని 'కూ' అంటూ కూయడానికి అలవాటు పడిన కోయిల ప్రయత్నపూర్వకంగా వెళ్ళి అడవిమల్లెలు పూసే చెట్టుమీద వాలుతుందా?

పూర్ణమయిన చంద్రబింబంలోంచి వచ్చే అమృతమును త్రాగడానికి అలవాటు పడిపోయిన చకోరపక్షి పొగమంచును త్రాగడానికి ఇష్టపడుతుందా?

సర్వకాలముల యందు తామరపువ్వుల వంటి పాదములు కలిగిన భగవంతుని పాదములను సేవించటం చేత భక్తి తన్మయత్వము భక్తునికి కలుగుతుంది. భగవంతుని విడిచిపెట్టమంటే ఎలా విడిచిపెడతాడు? (పోతన)

ఈ భావ సముదాయాన్ని రమణ మహర్షి ఈ మణమాల భాగంలో చెప్పారు.

అరుణాచలం వచ్చిన మొదటి రోజుల్లో శ్రీ రమణ భగవాన్, అరుణా చలేశ్వరాలయంలోని ఇప్పచెట్టు క్రింద, పూలతోటలో శరీరాన్ని లక్ష్యం చేయకుండా కూర్చొని తనలో తాను ఆనందిస్తూ ఉండేవారు. వచ్చేపోయే ప్రజలు రమణ మహర్షిని చూసి 'పిచ్చివాడు. పిచ్చిచేష్టలు' అనుకుంటూ వెళ్ళేవారు. భగవాన్

వారి మాటలకు నవ్వుకుంటూ 'ఈ పిచ్చి అందరికీ పడితే ఎంత బాగుండును' అని అనుకునేవారట.



## 6

**కనిన జనని కన్న ఘనదయాదాయకా**

**ఇదియా యనుగ్రహ మరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! శివా! నీ ప్రేమా, దయ కన్నతల్లి ప్రేమ కన్నా గొప్పవి! నీ అనుగ్రహం ఎంత అద్భుతం!

**విశేషాలు**

భగవాన్ రమణులు శివుడిని ఇక్కడ కన్నతల్లి అన్నారు. కన్నతల్లి అంటే 1. సొంత తల్లి. 2. సొంత తల్లిలా అతి వాత్సల్యముతో చూచుకొను స్త్రీ.

"నన్ను గన్నతల్లి యన్నపూర్ణామహాదేవి" అన్నాడు శ్రీ నాథుడు భీమఖండంలో (3-9). శ్రీ రమణ భగవాన్‌కి అరుణాచలేశ్వరుడు తల్లిలాంటివాడు. తన బిడ్డ అవసరాలను చూస్తూ తల్లి కాపాడుతూ పెంచుతుంది. అలాగే శ్రీ అరుణాచలేశ్వరుడు శ్రీ భగవాన్ అంతరంగం పట్ల శ్రద్ధ చూపించాడు. రమణుల ఆధ్యాత్మిక అవసరాలను తీర్చారు. అందుకే శివుని దయ అపారమైనదని రమణులు పొంగిపోయారు.

'తిరువాచకం' అనేది మాణిక్య వాచకర్ అను భక్తుడు గానం చేయగా శ్రీ చిదంబర నటరాజస్వామి స్వహస్తాలతో రాసుకున్నారట. ఆమోదముద్ర వేసారట. అందులో మాణిక్య వాచకర్ ఇలా అంటారు.

"అమ్మకి బిడ్డ ఆహారాన్ని గురించి ఎవరూ చెప్పనక్కరలేదు. తల్లి ప్రేమ అంత గొప్పది. కాని శివా! నీ దయ అంత కంటే అద్భుతమైనది, నేను అడగకుండానే నన్ను స్వీకరించావు. నా అహాన్ని రూపుమాపావు. ఆత్మజ్యోతిని వెలిగించావు. రమణుల వచనంలోని భక్తి తాదాత్మ్యత ఈ మాణిక్య వాచకర్ మాటల్లో కూడా ప్రతిఫలించింది.

19-5-1922న భగవాన్ రమణుల తల్లి అలఘమ్మ నిర్యాణము పొందారు.

ఆమె సమాధిపై మహర్షి లింగాకారముతో ఉన్న ఒక శిలను ప్రతిష్ఠించారు. దానికి 'మాతృ భూతేశ్వర లింగము' అని పేరు.

ఒకసారి ఒక భక్తుడు రమణులను ఇలా అడిగారు:

"మనస్సును బాహ్య ప్రపంచపు వ్యవహారాల నుంచి దూరంగా ఉంచాలని ఎంత ప్రయత్నించినా, దానిని ఆపటం మాకు సాధ్యపడడం లేదు స్వామీ!"

"అవును అది నిజమే. ఎలాగయితే చిన్నపిల్లవాడు తన నీడను తాను పట్టుకోవాలని పరిగెడుతూ, పట్టుకోలేక ఏడుస్తుంటాడు. అపుడు తల్లి వచ్చి వాడిని ఆ పని చెయ్యకుండా అడ్డుకుంటుంది. అదే విధంగా మనము కూడా మన మనస్సు ఎటూ వెళ్ళకుండా అడ్డుకోవాలి" అని రమణ మహర్షి చెప్పారు.

రమణుల బోధనలో, సాధనలో, భాషణలో అన్నీ మాతృమయం.



## 7

**నిన్నేమార్చి యరుగనీక యుల్లము పైని**
**నురుదిగా నుండుమా యరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలేశ్వరా! నా మనస్సుకి స్థిరము లేదు. ఎప్పుడూ చంచలమే. నీ సంరక్షణలో నిలుపుతున్నా. అయినా, నిన్ను కూడా మోసం చేసి భౌతిక విషయాల వైపు అది పరుగెత్తవచ్చు, నీ దయ ఒక్కటే దానిని స్థిరంగా ఉంచుతుంది. కనుక నా మనస్సు భౌతిక విషయాలతో చంచలము కాకుండా అందులో ఎప్పుడూ నువ్వు నివసించు.

**విశేషాలు**

సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశాశాఖాస్వటతి ఝటితి స్వైరమభితః
కపాలిన్ భిక్షో మే హృదయకపిమత్యన్తచపలం
దృఢం భక్త్యా బధ్వా శివ భవదధీనం కురు విభో! (శివానందలహరి 20)

ఓ కపాలధారీ, సర్వవ్యాపకా, శివా, ఆదిభిక్షూ! నా దగ్గర మనస్సనే ఒక కోతి ఉంది. అది మోహమనే అడవిలో తిరుగుతోంది. యువతుల స్తనములనే

పర్వతములపై ఎగురుతోంది. ఆశలనే కొమ్మలపై దూకుతోంది. అటునిటు వేగముగా పరుగులు పెడుతుంది. అత్యంత చపలమైన నా మనస్సనే ఈ కోతిని భక్తి (అనే త్రాడు)తో కట్టివేసి నీ వశంలో పెట్టుకో అని ఆదిశంకరులు శివానంద లహరిలో అన్నారు. రమణులు కూడా ఇదే పద్ధతిలో శివుడిని భావించారు.

మానవ శరీరమునందు నేను – నేను అని ఏది తోచుచున్నదో అది 'మనస్సు' అన్నారు రమణులు.

ఒకసారి డాక్టర్ బాబూ రాజేంద్రప్రసాద్, జమ్నాలాల్ బజాజ్‌తో కలిసి రమణాశ్రమానికి వచ్చారు. తిరిగివెళ్తూ రాజేంద్రప్రసాద్ శ్రీ భగవాన్ని ఇలా అడిగారు. "మహాత్ముడు నన్నిక్కడికి పంపించారు. వారికేమైనా చెప్పమంటారా?" "హృదయం, హృదయంతో మాట్లాడుతున్నప్పుడు ఇక వర్తమానం అవసరమేమిటి? ఇక్కడ పనిచేసే శక్తి అక్కడ కూడా పనిచేస్తుంది" అన్నారట భగవాన్.

సబర్మతీ, వార్ధా మొదలైన ఆశ్రమాల్లో ఎవరైనా మనస్సు బాగుండలేదని 'మహాత్మా'తో అంటే "రమణాశ్రమానికి వెళ్లి, అక్కడ నెలరోజులు వుండి రండి" అని చెప్పి పంపేవారట మహాత్మాగాంధీ.

ఇటువంటి మహానుభావులు పుట్టిన పుణ్యభూమిలో పుట్టినందుకు ఆనందిస్తూ మనోనిశ్చలము కలిగించమనే రమణుల భావాన్ని పునః స్మరించుకొందాం.



## 8

**ఊరూరు తిరుగక యుల్లము నిను గని**
**యణగ నీ ద్యుతి జూపు మరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! నా మనస్సు ఈ ప్రపంచాన్ని పట్టుకొని తిరుగుతూంటుంది, నీలో అది లీనమై పోయేటట్టుగా దానిని పట్టుకో. నీ దివ్యమోహన రూపములో అది అణగి ఉండేటట్లు దానిని చేయవయ్యా!

**విశేషాలు**

మనస్సుకు చపలత్వము సహజ గుణం. ఇంద్రియ సంబంధమైన వాటిలో తిరిగే దానికి సంపూర్ణానందము దొరకదు. ఇంద్రియాలు ఇచ్చేవి కేవలం

విషయానందం. పరమాత్మ సచ్చిదానంద స్వరూపుడు. సచ్చిదానందము కల నీ రూపంలో, నా మనస్సు నిండిపోవాలి. అలా నాపై దయ చూపమని రమణులు శివుని ప్రార్థిస్తున్నారు.

గుడిపాటి వెంకటాచలం పరిచయం అక్కరలేని రచయిత. ఆయన రమణుల భక్తులు. ఒకసారి రమణ భగవాన్‌ని కలిసి “నేను వెళ్తున్నాను” అని చెప్పారు. శ్రీ భగవాన్ ఆయనవైపు చూచి చిరునవ్వు నవ్వారు. ఆ చిరునవ్వు చలంలో మార్పుని తీసుకుని వచ్చింది. “నువ్వు వెళ్ళిపోతే ఇక్కడ నేనెట్లా బ్రతకగలను? నేనెంతటి ఒంటరితనాన్ని అనుభవిస్తానో!” అని రమణులు అన్నట్లుగా చలంకి అనిపించింది.

ఇంటికి వచ్చిన తర్వాత “నేను ఎవరిని?” అనే చింతనని చలం ప్రారంభించారు. చాలాసార్లు వారి ప్రమేయం లేకుండా ‘ధ్యానం’ ముంచెత్తింది. చలం మనస్సు నిశ్చలమయ్యేది. “అరుణాచలా! నా మనస్సు ఈ ప్రపంచాన్ని పట్టుకొని తిరుగుతూంటుంది, నీలో అది లీనమై పోయేటట్టుగా దానిని పట్టుకో. నీ దివ్యమోహన రూపములో అది అణగి ఉండేటట్లు దానిని చేయవయ్యా!” అనే రమణుల ప్రార్థన చలం వాస్తవజీవితంలో మనకు నిజం చేసారు. మనస్సును అరుణాచలేశ్వరుని వంటి రమణులలో కలిపారు ఆయన అనుగ్రహంతో.



## 9

**నను జెఱచి ఇపుడు నను గలియక విడు**
**టిది మగతన మొక్కొ యరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! పక్వమయిన నా అహంకారాన్ని నాశనం చేశావు. నీకూ, నాకు ఏమీ తేడా లేదు. నాకంటూ ఇప్పుడు ఏమీ మిగలలేదు. ఇప్పుడు నన్ను నీవు కలుపుకోకపోతే, నీ పౌరుషానికి ఇది మచ్చ కాదా!

**విశేషాలు**

ఒక కన్నెపిల్ల అడిగినట్లుగా భక్తుడు భగవంతుడిని అడుగుతున్నాడు. నాదయిన ఒక వ్యక్తిత్వాన్ని నాశనం చేసిన తర్వాత, నాతో నీవు ఏకమయి తీరాలి. అలా కాకపోతే, అది నీ మగతనం కాదు. నన్ను నీ దానిగా చేసుకోవయ్యా!

భూమి మీద పడనంత వరకే వాన చినుకుకి ఒక వ్యక్తిత్వం. భూమి మీద పడిన తరువాత అది భూమిలో కలిసిపోతుంది. కలసిపోవాలి అని భక్తుడు ఆవేదన పడుతున్నాడు.

ఒకసారి భక్తులు ఒకరు భగవాన్ని "ఇంతమంది సాధువులున్నారు కదా! వారిలో అసలైన సాధువు ఎవరో ఎలా తెలుసుకోవాలి?" అని అడిగారు.

"నీ ప్రయత్నమంటూ ఏమీ లేకుండా ఎవరి వద్ద నీకు చెప్పలేని ప్రశాంతత వస్తుందో, వారే అసలైన సాధువు" అని శ్రీ భగవాన్ సమాధానం చెప్పారు.

ఈ ప్రశాంతత స్వామిలో కలిసేటట్లు చేస్తుంది. తనదయిన అస్తిత్వాన్ని నశింపచేసి, అఖండరూపంలో కలిసేటట్లు చేస్తుంది. రమణులు ఈ భాగంలో మనకు చెప్పినది ఇదే. ఆ ప్రశాంతత కోసం అన్వేషిద్దాం.



## 10

**ఏటికీ నిదుర నన్నితరులు లాగగ**
**నిది నీకు న్యాయమా యరుణాచలా!**

**తాత్పర్యము**

ఓ అరుణాచలా! ఈ మొద్దునిద్ర నీకు ఎందుకయ్యా? నీ దాన్నయిన నన్ను ఇతరులు నన్ను లాగుతున్నా నీకు పట్టదా? ఇది నీకు న్యాయమా?

**విశేషాలు**

మధుర భక్తి సంప్రదాయంలో ఒక కన్నెపిల్ల అడిగినట్లుగా భక్తుడు భగవంతుడిని గద్దిస్తున్నాడు. నీకు పూర్తిగా అర్పించుకున్న నీ దానిని నేను. నన్ను ఇతరులు లాక్కుపోతుంటే ఊరుకొంటావేమిటి? ఇదేమన్నా బాగుందా? అని భక్తుడు అడుగుతున్నాడు.

ఈ 'ఇతరు'లెవరు?

పంచేంద్రియాలు

1. జ్ఞానేంద్రియములు: చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు. (5)
2. కర్మేంద్రియములు: వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ. (5)

3. అంతరింద్రియములు: మనోబుద్ధ్యహంకారములు (3)

ఇంద్రియముల సమూహము: 'అక్షమాల'. శ్రీ రమణ మహర్షి రచించినది 'అక్షర మణమాల'. వీటికి దగ్గర సంబంధము కనబడుతోంది.

ఒకసారి కాశ్మీరు నుంచి ఒకాయన రమణ మహర్షి దగ్గరకు వచ్చారు. తన మాతృభాష కాశ్మీరం తప్ప ఇంకొకటి ఆయనకు రాదు. శ్రీ భగవాన్ ఎదుటకు వచ్చి తన మాతృభాషలో కొన్ని ప్రశ్నలు అడిగాడు. శ్రీ భగవాన్ ఏమీ మాట్లాడలేదు. అతని వైపు చూసారు. కొంత సమయం తరువాత ఆ కాశ్మీరు నుంచి వచ్చినతను సంతృప్తితో వెళ్ళిపోయాడు.

తరువాత రోజు ఎవరో రమణులను అడిగారు. "మీకు కాశ్మీరం వచ్చా? రాత్రి మా కాశ్మీరంవాడు మీ దగ్గరకు వచ్చి, ప్రశ్నలు అడిగాడట, మీరు అదే భాషలో సమాధానాలు ఇచ్చి, సందేహాలు తీర్చారట" అని ప్రశ్నించారు.

"నేను నోరు విప్పలేదు" అని శ్రీ రమణభగవాన్ జవాబు.

ఇది ఇంద్రియాల మీద రమణులకున్న పట్టు.

తానుగా మాట్లాడలేదు. కాని భక్తునికి రమణుల మాట వినిపించింది. ఇది అపూర్వమైన ఇంద్రియానుభవం.



## 11

**పంచేంద్రియ ఖలులు మదిలోన దూరుచో**
**మదిని నీవుండవో అరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా!శివా! ఎప్పుడూ నా మనస్సులో ఉంటావే! మరి పంచేంద్రియాలనే దొంగలు నన్ను ఎలా దోచుకుంటున్నారు? అది వారికి ఎలా సాధ్యమవుతోంది? ఈ దొంగలు చొరబడినప్పుడు వాళ్ళని నువ్వు ఎందుకు తరిమేయవు?

**విశేషాలు**

1. చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు అను జ్ఞానేంద్రియాల ప్రభావము వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ అను కర్మేంద్రియాల ప్రభావము

నా మనస్సు మీద బాగా ఉందని, ఈ ఇంద్రియాల బారినుండి తనను కాపాడమని భక్తుని ఆవేదన.

2. 'కామః క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠంతి తస్కరాః
జ్ఞాన రత్నాపహారాయ తస్మాత్ జాగ్రత! జాగ్రత!' అని ప్రసిద్ధోక్తి.
జ్ఞానానికి సాటివచ్చే పవిత్ర వస్తువేదీ లేదు. అంత విలువైన జ్ఞానరత్నాన్ని అపహరించటానికి మన దేహంలో కామ క్రోధ లోభాలనే ముగ్గురు దొంగలున్నారు.

3. 'తతో రావణ నీతాయాః సీతాయాః శత్రు కర్శనః' అని సుందరకాండ. కామ క్రోధ లోభ మధ మోహ మాత్సర్యములనేటటువంటి అంతః శత్రువులు (ఇంద్రియాల ప్రభావము) నిగ్రహించగలిగినటువంటి ప్రజ్ఞాశాలి హనుమ (శత్రు కర్శనః).

4. నిద్రపోయే ముందు, నిద్రనుండి మేల్కొన్న వెంటనే 'నేనెవరు'ను ప్రశ్నించుకోవాలి. ఈ రెండు సమయాల్లో అఖండ విశుద్ధ ప్రజ్ఞ ఒక్క తృటికాలం పాటు ఉంటుంది. ఇవి ధ్యానానికి ఉత్తమ సమయాలు. మనస్సు అప్పుడు పరిశుద్ధంగా ఉంటుంది.

5. ఆత్మజ్ఞాన అన్వేషికి 'నేను'ను విచారించుటే సూటి అయిన మార్గం. అన్నింటికి కారణమైన 'నేను'ను విచారించకుండా మనసు, బుద్ధి, ఇంద్రియాలు మొదలైనవాటి గురించి ఆలోచిస్తే లాభం లేదు. 'నేను' పోయిందా, 'నేను'ను ఆధారం చేసుకుని బతుకుతున్న ఇవన్నీ ఎగిరిపోతాయి అని రమణులు ఒకసారి చెప్పారు.

6. 1911లో రమణ మహర్షిని సందర్శించిన మొదటి విదేశీయుడు ఎఫ్. హెచ్. హంఫ్రీస్. లోకానికి తానెలా ఉపయోగపడతానని అడిగాడు. 'నీకు నువ్వు ముందు సహాయపడు, అది లోకానికి సహాయపడినట్లే. నీకు లోకానికి తేడా లేదు' అని రమణుల సందేశం. మనకి మనం ఉపయోగపడటానికి ఇంద్రియ తాత్పర్యం గురించి, నేను గురించి విచారణ జరగాలి. అదే ఈ భాగంలో రమణులు చెప్పినది.



## 12.

**ఒకడవౌ నిను మాయ మొనరించి వచ్చువా**

**రెవ, రిది నీ జాల మరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! నీవు అన్నీ తెలిసినవాడివి, అంతటా వ్యాపించినవాడివి. నీకు తెలియకుండా నా మనస్సులోకి ఎవరు వస్తారయ్యా! ఎవరైనా ఎలా ప్రవేశించ గలరు?

నా మనస్సులో నువ్వు వెలుగులా ప్రకాశిస్తుంటే, ఆ ఇంద్రియాకర్షణల చీకటి ఎలా ప్రవేశిస్తోంది? వెలుగు ఉన్నచోట చీకటి అసాధ్యం కదా స్వామీ! నాకు ఒకటి అనిపిస్తోంది. ఇది నీ ఇంద్రజాలమని. నన్ను పరీక్షించాలని ఈ ఇంద్రియాకర్షణలు నాలో కలిగిస్తున్నావు కదా! ఇదేమన్నా భావ్యంగా ఉందయ్యా!?

**విశేషాలు**

అరుణాచల పర్వతం మొత్తం శివ స్వరూపం.

ఒకసారి భగవాన్ రమణ మహర్షి అరుణాచల పర్వతంపై గల విరూపాక్ష గుహలో తెల్లటి గోచీ ధరించి ఉన్నారట. ఓ పండితుడు వచ్చారు. ఆయన రమణులతో ఇలా అన్నారు. "మీరు తెల్లటి గోచి పెట్టుకుని ఉండటం కన్నా సన్యాసం స్వీకరించి, కాషాయ వస్త్రాలు ధరించండి. సన్యాస దీక్ష తీసుకోండి."

రమణ మహర్షి ఏమీ జవాబు ఇవ్వలేదట. ఆ పండితుడు వెళ్లిపోయాడు.

కొద్దిసేపటి తర్వాత ఓ ముసలతను పుస్తకాల సంచీతో వచ్చి ఆ మూటను చూడమని, స్నానం చేసి వస్తానని చెప్పి వెళ్లిపోయాడు. రమణులు ఆ మూటలో పైన సంస్కృతంలో ఉన్న 'అరుణాచల మాహాత్మ్యం' అనే పుస్తకం తెరచి చూసారు.

అరుణాచలం చుట్టుపక్కల 24 మైళ్ల వరకూ ఏ దీక్షా నియమాలు అక్కర్లేదని అందులో వ్రాసి ఉంది. పరమశివుడే ఆ ముసలివాడని చెబుతారు. ఆ పుస్తకాన్ని రమణులు పండితులవారికి చూపిస్తే – సన్యాసదీక్ష ఇలాంటి మాటలు ఇక మాట్లాడకుండా పండితులవారు వెళ్ళిపోయారు.

అరుణాచలంలో అంత మహిమ చూపించే స్వామి, తన మనస్సుతో ఎందుకు ఆడుకొంటున్నాడని ఒక భక్తుడిగా, మధురభక్తి సంప్రదాయంలో రమణులు మనందరి తరఫున స్వామిని ప్రశ్నిస్తున్నారు.



## 13

**ఓంకార వాక్యార్థ యుత్తమ సమహీన**
**నిన్నెవరెరుగువా రరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! ఈ విశ్వములోని ఓంకార తత్వానివి నీవే. నీకు సమానమైన వారు ఎవరూ లేరు. నీ వైభవాన్ని ఎవరు గ్రహించగలరు?

**విశేషాలు**

1. భగవద్గీతలోని ఎనిమిదవ అధ్యాయములో అక్షర పరబ్రహ్మ యోగములో శ్రీ కృష్ణ భగవానుడు ఇట్లు పలికినాడు.

   **ఓమిత్యే కాక్షరం బ్రహ్మవ్యాహరన్ మామనుస్మరన్ ।**
   **యః ప్రయతి త్యజన్ దేహం సయాతి పరమాగతిం ॥**

   (ఓం అను అక్షరం ఒక్కటే బ్రహ్మం. దానిని స్మరించుటయే నన్ను స్మరించుట. ఓంకారమును స్మరించుచు ఎవరు దేహమును విడుచుచున్నారో వారు పరమాగతి అయిన నన్ను పొందుచున్నారు.)

2. ప్రణవనాద సుధారసమే భువనమోహనమైన రామావతారమై దిగివచ్చిందని త్యాగయ్య గానం చేశారు.

3. గణపతి ఓంకార రూపంతో ప్రకాశిస్తాడు.

4. 'ప్రణవమే ధనుస్సు. ఆత్మే బాణం. బ్రహ్మమే లక్ష్యం. గురి తప్పకుండా ఆత్మ లక్ష్యాన్ని చేరాలి. బాణం లక్ష్యాన్ని ఛేదించినట్లు ఆత్మ బ్రహ్మంలో లీనం కావాలి' అని ఉపనిషత్తు చెప్పింది.

5. 'తస్య వాచకః ప్రణవః" అనగా ఆ భగవంతుని పేరు తెలుపునదియే ఓంకారము అని పతంజలి మహర్షి 'యోగసూత్రము' అను గ్రంథములో చెప్పారు.

6. 'ఓంకారం బిందు సంయుక్తం నిత్యం ధ్యాయన్తి యోగినః/కామదం మోక్షదం చైవ ఓంకారాయ నమో నమః' అని ప్రార్థన. (మనమందరము ఓంకారము నుండి జన్మించినవాళ్లమని యోగులు ఓంకారమును ధ్యానించుచుందురు. ఆనందమును, మోక్షమును ఇచ్చే ప్రణవమునకు నమస్కారము.)

7. ఇటువంటి ఓంకార తత్వానివి నువ్వే అని అరుణాచలస్వామిని రమణులు ఈ భాగంలో పేర్కొన్నారు.

8. మనస్సుతో గాని, బుద్ధితో గాని భగవంతుని తెలుసుకోలేము. ఆయనని తెలుసుకోవాలంటే, మనోబుద్ధులను దాటాలి. అది కేవలం భగవంతుని అనుగ్రహం వల్లనే సాధ్యమవుతుంది. "నీ వైభవాన్ని ఎవరు గ్రహించగలరు?" అను రమణుల మాటలో ఈ సందేశముంది.

9. తిరువణ్ణామలైలో కందాస్వామి అనే ధనికుడు ఉండెడివారు. అతను అప్పుడప్పుడు రమణులను దర్శించుటకు వచ్చెడివారు. కాని అతని దుష్ప్రవర్తన వలన ఆయనను ఎవరూ ఇష్టపడేవారు కాదు. ఆయన చివరి రోజులలో ఆశ్రమము ఎదురుగుండా ఉన్న మంటపములో అనారోగ్యము మరియు పేదరికమునందు ఉండెడివారు. ఒకనాడు 'కేరళగంజి' కావలెయునని ఆశ్రమమునకు ఎవరిద్వారానో కబురు చేసారు. భగవాన్ వెంటనే ఆ గంజి వండించి, కందాస్వామికి పంపారు. తరువాత కొద్ది రోజులకు అతని పరిస్థితి క్షీణించి మరణించాడు. చెప్పుటకు ఏ విధమైన సద్గుణములు లేని కందాస్వామిని గురించి భగవాన్ ఏమియు మాట్లాడలేరన్న నిశ్చయముతో, భక్తులు అతను మరణించాడన్న వార్తతో భగవాన్ వద్దకు వెళ్ళారు.

10. భగవాన్ కందాస్వామి శుభ్రతయందు ఇంజికొళ్ళై దీక్షితార్ వలె ఉంటారని చెబుతూ, ఉదయము 8 గంటలకు చెరువువద్దకు చేరి తన ధోవతిని పిండి ఎంతో పరిశుభ్రముగా ఉతుక్కుని, ఎప్పుడు నూనెగాని, సబ్బుగాని వుపయోగించక శరీరమును ఎంతగానో రుద్ది శుభ్రపరచుకొనేసరికి మధ్యాహ్న సమయం అయ్యెడిదని, తన జుట్టు మరియు గడ్డము ఎల్లప్పుడు శుభ్రముగా ఉంచుకొనెడివారని చెప్పిరి. కందాస్వామిని గురించి భగవాన్

చెప్పిన ఈ మాటలను విన్న భక్తులందరు సిగ్గుతో తలలు వంచుకున్నారు (అంతర్జాల సౌజన్యం). ఇతరులలో మంచిని మాత్రమే గ్రహించు భగవాన్ రమణులు "నీ వైభవాన్ని ఎవరు గ్రహించగలరు?" అనుటలో ఆలోచనామృత మున్నది. స్వస్తి.



## 14

**అవ్వబోలె నొసగి నాకు నీ కరుణ న**

**న్నేలుట నీ భార మరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! తమిళ భక్తురాలయిన, కవయిత్రి అయిన అవ్వయార్‌పై నీ దయను చూపినట్లు నాపై కూడ నీ దయని వర్షించు! నన్ను ఆ విధంగా రక్షించి కాపాడుట నీకు భారము కాదు.

**విశేషాలు**

1. అవ్వయార్ జీవితంలో ఎక్కువగా సంతృప్తి నిచ్చేది ఇతరులకు సహాయం చేయటం. జీవితంలో స్వార్థం పెనుభూతం లాంటిది. 'జీవితంలో తప్పులు పట్టడం ప్రారంభిస్తే స్నేహితులు, బంధువులు ఎవ్వరూ మిగలరు' అని చెప్పిన కవయిత్రి అవ్వయార్.
2. ఈమె చేర, చోళ, పాండ్య రాజాస్థానాలను సందర్శించినపుడు ఈ చాటువు చెప్పింది.
3. వాదవర్ కోన్ పినై యెంద్రాన్
   వత్తవర్ కోన్ నాళై యెంద్రాన్
   యాదవర్ కోన్ యాదోస్ద్రుమ్
   ఇల్లై ఎంద్రాన్ ఆదలాల్
   వాదర్ కోన్ పినై యినుం,
   వత్తవర్ కోన్ నాళై ఎనుం
   యాదవర్ కోన్ ఇల్లై ఇనియ

(వాదవర్ అనే నృపాలుడు తరువాత రమ్మన్నాడు. వత్తవర్ రేపు రమ్మన్నాడు. యాదవర్ లేదన్నాడు. ఈ ముప్వురిలో తరువాత, రేపు అని చెప్పి వాయిదా వేసిన వారికన్న లేదని నిశ్చయంగా చెప్పిన వాడే ఉత్తముడు)

4. ఒకసారి కంబరు సభలో ఆమెను అవమానించాలని 'అడీ అడీ (ఒసీ ఒసి)' అని రెండుసార్లు సంబోధిస్తూ ఒక సమస్య ఇచ్చాడనీ, ఆమె మహా పౌరుషశాలిని గనుక ఆ సమస్య పూరిస్తూ తిరిగి ఆయనను 'అడా అడా (అరే అరే)' అని పదిసార్లు సంబోధిస్తూ ఆ సమస్య పూరించిందట.

5. శ్రీ రమణులు చెప్పిన అవ్వయార్ కథ –

"అవ్వ పరమేశ్వరున కెదురుగా ఇట్లా నాలాగే కాళ్ళు చాచి కూర్చున్నది. ఇది చూసిన పార్వతీదేవికి పట్టరాని బాధ. పరమేశ్వరునికి ఎదురుగా కాళ్ళు చాచిందే, ఇది అపరాధం కదా అన్న దిగులుతో 'నేను చెప్పనా అవ్వతో' అని పరమేశ్వరునికి మనవి చేయగా, "అమ్మో, మాట్లాడకు, ఆమెనేమీ అనరాదు" అని అన్నాడట ఈశ్వరుడు.

6. అయినా ఆ అమర్యాదను సహించలేక చెలికత్తెతో చెప్పగా, ఆ చెలికత్తె అవ్వను సమీపించి "అవ్వా అవ్వా, కాళ్ళు ఈశ్వరుని వైపు పెట్టకు" అని అన్నదట.

7. "అట్లాగా అమ్మా, ఈశ్వరుడు ఎటు లేడో చెప్పు, ఇటు తిప్పనా?" అని కాళ్ళు ఇటు తిప్పితే ఇటు, అటు తిప్పితే అటు పరమేశ్వరుడు తిరగవలసి వచ్చింది. అప్పుడు పార్వతిని చూసి, "చూసావా? నేను చెబితే విన్నావు కాదు, ఆమె ఇప్పుడు నన్నెలా తిప్పుతుందో చూడు" అని ఈశ్వరుడు అనగా అంతట అవ్వని క్షమించమని అడిగింది పార్వతీదేవి.

8. తమిళములో అవ్వయార్ అనగా 'అవ్వ' అని అర్థము. చిన్నతనము నుండే ఆమెకు కావ్యాలు, కవితలు వ్రాయడం బాగా అలవడింది. ఆమెకు నాలుగు సంవత్సరాల వయసులోనే మహామహులు చెప్పలేని వేదాంత విద్యను శ్లోకాలలో చెప్పడం ఆరంభించింది.

9. ఆమెకు శివ సాన్నిధ్యమే అంతా తప్ప వేరొకరిని మనసులో ఎపుడూ కలనైనా ఊహించుకునేది కాదు. యుక్తవయసు వచ్చిన ఆమె అందచందాలు గుణ

గణాలు చూసి ఎన్నో సంబంధాలు వచ్చాయి. ఆమె తల్లిదండ్రులు ఆమెను యోగ్యుడైన వరునికి ఇచ్చి పెళ్లి చేయాలని నిశ్చయించుకున్నారు.

10. ఒక సుముహూర్తాన ఆమెకు పెళ్లి నిశ్చయం అయింది. ఆమెకు పెళ్లి చేసుకుని వైవాహిక సాంసారిక జీవితం గడపటం సుతరాము ఇష్టం లేదు. తను చిన్నప్పటినుండీ ఎంతో భక్తిశ్రద్ధలతో పూజించే గణేశుని విగ్రహం దగ్గర కూర్చుని తనను ఈ విషమ సమస్యనుండి గట్టున వేయవలసిందిగా కోరుకుని, తనకు అసలు సమస్య అంతా ఈ అందము తెస్తున్నదే కావున తనకు ఈ అందము తీసివేసి వృద్ధురాలిని చేయవలసిందిగా ప్రార్థించింది. ఆమె మొర ఆలకించిన గణపతి ఆమె అందము తీసివేసి వృద్ధురాలిని చేసాడు. యుక్తవయసులోనే తమ కుమార్తె వృద్ధురాలవడం ఆమె తల్లిదండ్రులు జీర్ణించుకోలేకపోయారు. కానీ అంతా దైవకృప కావున ఏమీ చేయలేక మనసులోనే దాచుకున్నారు.

11. తనను తాను కోరుకున్న విధంగా తన యవ్వనాన్ని తొలగించి వృద్ధాప్యం అందించిన గణపతిని ఆమె అనేక విధాలుగా స్తుతించి ఆమె ఇల్లు వదలి దేశాటన చేయడం ఆరంభించింది. ఆమె సాహిత్య విజ్ఞానాన్ని గుర్తించిన ఎందరో మహాకవులు ఆమెకు ఎదురేగి స్వాగతసత్కారాలు అందజేసి ప్రణమిల్లారు. ఆమె కీర్తి చోళ, చేర, పాండ్య రాజ్యాలలో దశదిశలా వ్యాప్తి నొందింది. తమిళరాజ్య మహారాజులు ఆమె విజ్ఞాన సాహిత్యాన్ని సమాదరించి ఆమెకు సేవలు చేసారు. ఇప్పటికీ తమిళ చిన్నపిల్లలు అవ్వయార్ వ్రాసిన విజ్ఞాన నీతి గీతులను పఠిస్తూనే ఉన్నారు, ఉంటారు. (ఈ విషయాలన్నీ యథాతథంగా అంతర్జాల సౌజన్యముతో సేకరించబడినవి. సేకర్తలకు ధన్యవాదములు).



## 15

**కన్నుకు గన్నయి కన్నులేక కను నిన్**
**కనువారెవరు, కను మరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! నువ్వు నాకు నా కంటిచూపు లాంటివాడివి. కన్ను తనంతట తాను చూడలేదు. చూచే శక్తిని కళ్ళకి ఇచ్చేది ఆత్మ. ఆ ఆత్మ నువ్వు. చూపుకి మూలం నువ్వే. ఆత్మజ్ఞానమనే కన్ను ద్వారానే నిన్ను చూడటం సాధ్యమవుతుంది.

**విశేషాలు**

కనుల మీద రమణుల అమోఘ భావలహరి ఇది.

మనస్సు వేరే చోట పెట్టి కళ్ళని తెరచినంత మాత్రాన చూడలేం. కళ్ళు మూసుకొని మనం నిద్ర పోయేటప్పుడు ఎన్నో కలలను చూస్తాం. దీనికి మూల కారణం ఆత్మ. ఆత్మ లేకపోతే కళ్ళు తెరచినా చూడలేవు. మనస్సు స్వామి మీద పెట్టి కళ్ళు మూసుకొన్నా అవి చూడగలుగుతాయి. ఆ చూసే శక్తిని ఇచ్చేవాడు అరుణాచలుడు.

నిత్యానందం కావాలంటే దృశ్యమూ, ద్రష్టా (అంటే చూసేది, చూడబడేది) రెండూ ఏకము కావాలి. దానికోసం భక్తుల తరఫున అరుణాచలేశ్వర స్వామికి రమణుల ప్రార్థన ఇది.

“మాయ అంటే ఏమిటని?” రమణ మహర్షిని ఒక భక్తుడు అడుగుతూ ఉండేవాడు. రమణులు జవాబు చెప్పేవారు కాదు.

ఒక రోజు రాష్ట్రపతిగా ఉన్న బాబూ రాజేంద్రప్రసాద్ మహర్షిని చూడటానికి వచ్చారు. ప్రజలు విపరీతంగా వచ్చారు. రాష్ట్రపతి, రమణులను జనాలందరూ మార్చి మార్చి చూడసాగారు. రాష్ట్రపతి వచ్చినా రమణులు అలాగే మౌనంగా ఉన్నారు. రాజేంద్రప్రసాద్‌గారు మహర్షి సమక్షంలో మౌనంగా కాసేపు కూర్చున్నారు. రాష్ట్రపతి బయటకు వెళ్ళేటప్పుడు అందరూ ఆయన వెంట వీడ్కోలు కోసం వెళ్ళారు. మాయ అంటే ఏమిటని సందేహం అడిగిన వ్యక్తి ఒక్కడే రమణుల దగ్గర ఉన్నాడు. అప్పుడు రమణులు నోరు విప్పి ‘మాయ అంటే ఇదే’ అని చెప్పారు.

దేనిని చూడాలో దానిని చూడము. ఆకర్షణని తదేకంగా చూస్తూ ప్రలోభంలో పడతాం. కన్నుకు కన్ను అయిన అరుణాచలేశ్వరుడు మనందరిని రక్షించుగాక!



## 16

**కాంత మినుమును వలె గలిసి నన్ విడువక**

**కలసి నాతో నుండు మరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలపు రూపంలో ఉన్న ఓ పరమశివా! ఇనుమును అయస్కాంతం ఆకర్షిస్తుంది. ఇనుప ముక్క అయస్కాంతాన్ని తాకిన తరువాత ఇక దానినుండి విడిపోలేదు. అలాగే నన్ను నీ వద్దకు చేర్చుకో. ఎప్పుడూ నిన్ను అంటిపెట్టుకునేట్టు దయ చూపించు అరుణాచలా!

**విశేషాలు**

**భక్తిలో వివిధ దశలు**

శివానందలహరిలో భగవత్పాదులు భక్తిలోని వివిధ దశలను 'అంకోలం..' శ్లోకంలో ఉదాహరణలతో వివరించారు. మొదట్లో భక్తుడు తన మనస్సును బలవంతంగా భగవంతునిపై ఉండేటట్లు చేయాలి. ఆయన పాదాలపై దృష్టిని మోపాలి. ఊడుగు (అంకోల) గింజలు పండిపోయి నేలమీద రాలిపడి మరల వానికవియే చెట్లనంటుకుని పోతాయి. ఇది భక్తిలోని మొదటి దశకు ఉదాహరణ.

భక్తుని మనస్సు భగవంతునిపై నిలబడినప్పుడు భగవంతుని కృప కారణంగా భగవంతునివైపు భక్తుని మనస్సు ఆకర్షింపబడుతుంది. సూదంటురాయి సూదిని ఆకర్షించినట్లు. ఇది రెండవ దశ.

భక్తుని హృదయం పూర్తిగా భగవంతునితో నిండిపోయినప్పుడు, భగవంతుడు కూడా భక్తునిపై ప్రేమను సంపూర్ణంగా ప్రదర్శిస్తాడు. అది పతివ్రత అయిన స్త్రీ తన పతిని అంటిపెట్టుకునియున్నట్లు. అప్పుడు పతి కూడా తన పత్ని పట్ల విపరీతమైన ప్రేమను ప్రదర్శిస్తాడు. ఇది మూడవ దశగా మనం చెప్పవచ్చు.

నెమ్మదిగా భక్తుడు భగవంతునికి భూషణమవుతాడు.

ప్రహ్లాదుడు లేకపోతే నరసింహావతారం ఎత్తి భగవంతుడు ఈ లోకాన్ని ఆశీర్వదించేవాడు కాదు. అలా ఒక విధంగా భక్తుడు భగవంతుని ప్రఖ్యాతిని

పెంచుతాడు. ఒక లత చెట్టును అల్లుకునిపోయి దాని సౌందర్యాన్ని పెంచినట్లుగా ఉంటుందది.

ఈ నాల్గవ దశ దాటిన తరువాత భక్తుడు భగవంతునితో మమైకమై పోతాడు నదులు సముద్రంలో విలీనమైపోయినట్లు. ఒకసారి నదులు సముద్రంలో కలిస్తే ఇక వాటికి ప్రత్యేక అస్తిత్వం ఉండదు. సముద్రం నుండి నదులను విడిగా చూడలేము. అలాగే భక్తుడు కూడా భగవంతుని మించి వేరుగా ఉండడు. (శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి శ్రీ శారదా పీఠము – శృంగేరివారి 'స్ఫూర్తినందించే ఆధ్యాత్మిక కథలు' నుండి)

సదాశివబ్రహ్మేంద్రులు మానసిక పూజ చేస్తూ – "ఈశ్వరా! నిన్ను పూజించడానికి కూచున్నాను. కాని నీకు ఉపచారం చేయడానికి బదులు అపచారం చేస్తున్నాను. నీ కెట్లా పూజ చేయడం? అది వీలయిన పనా? నీ ఆరాధన చేయడమెట్లా? నీవు ఒక దిక్కున ఒక చోటనే ఉంటే కదా నీవు ఇక్కడనే ఉన్నావని నమస్కారం చేయడం? నీవు వెనుకా ముంగలా ప్రక్కలా పైనా కిందా ఎల్లయెడలా సర్వాంతర్యామివై ఉన్నావు. నేను నీ పాదాలను ఎక్కడ ఉన్నవని చూచి నమస్కరించను? పోనీ! ఎక్కడనో నీ పాదాలున్నవని నమస్కరిస్తే ఆ పాదాల వెనుక నీవు లేవు అని కదా అర్థం. అలా అయితే నీ పూర్ణత్వానికి భంగం చేసిన చందంగా నిన్ను అర్థం చేసికొన్నవాడనే కదా! నీ చరణములను కడుగుటకు పంచపాత్రనుండి ఒక ఉద్ధరిణలో నీళ్ళు కింద పోస్తామా, నీవు ముల్లోకాలనూ మూడడుగులతో కొలచిన త్రివిక్రముడవి కదా! నీ పాదాలను అణుమాత్రమయినా ఈ నీళ్ళు తడపగలవా? పాదాలను పూర్తిగా కడగక వదలుట అపచారం కాదా ప్రభూ? "భూః పాదౌ యస్య నాభిః'. దిగంబరుడవయిన నిన్ను ఈ చిన్న వస్త్రముతో అలంకరింపగలనా? నే నేమి పూజ చేయను తండ్రీ!

నేనేమని ప్రార్థింపను? నీ మనోవృత్తులన్నీ నీవు చదివిన పుటలు. నీవు సర్వజ్ఞుడవు. ప్రార్థన అంటూ చేసి నీ సర్వజ్ఞతకొక అజ్ఞానం తెచ్చి అంటగట్టనా? అయినా నీవద్ద లేని ఏదో ఒక వస్తువును నే నడుగలేదు. కొత్త వస్తువును ఏదే నొకదానిని నేనడిగితే నీవు దాతవు, నేను ప్రతిగ్రహీతను అయిపోతాం. నీవు అఖండానందస్వరూపుడవని శ్రుతులు చెపుతున్నవి. నేనో ఇలా కోరికలతో,

కొరతలతో ఉన్నాను. ఈ స్థితిని మాన్పి నా స్వరూపం నాకియ్. నన్నే నాకియ్' అని చెప్పారు. 'నన్నే నాకియ్.' అంటే ఏమిటి అర్థం? నా స్వరూపమే నీవు, నిన్నే నాకియ్' అని (జగద్గురు బోధలు 01వ సంపుటం).

రమణులు ఈ చరణంలో అంతర్గతంగా కోరుకొన్నది ఇదే.



## 17

**గిరి రూపమైనట్టి కరుణా సముద్రమా**
**కృప జేసి నన్నేలు మరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! పర్వతరూపంలో ఉన్న కరుణాసాగరుడవు నీవు. నీ దయని వర్షించు.

**విశేషాలు**

శక్తికి, ఔన్నత్యానికి ప్రతీక పర్వతం. విస్తృతికీ, గాంభీర్యానికి ప్రతీక సముద్రం. అరుణాచలుని అనుగ్రహం సముద్రముతో సమానమైనదని రమణులు ఈ చరణంలో చెప్పారు.

'కరుణాపూర్ణ సుధాబ్ధీ' అని అరుణాచల పంచరత్నాలలో కూడా మొదటి శ్లోకంలో శ్రీ భగవాన్ స్వామిని పిలిచారు.



## 18

**క్రింద మీదెటను జెన్నొందు కిరణమణి**
**నా క్రిందుగతి మాపు మరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! క్రిందికీ, మీదికీ కాంతి కిరణాలు ప్రసరించే రత్నము వంటి వాడివి నువ్వు. అతి స్వల్ప జీవుల హృదయాలలో కూడా నీ కాంతి ఉంటుంది. నాకు అల్పత్వముంది(క్రిందుగతి). దేహంతో పారవశ్యము పొందటమే ఆ

అల్పత్వం. ఈ అల్పత్వాన్ని నశింపచేయి. అహంకారంనుంచి పుట్టిన అంధకారంలో విహరిస్తుంటాను. ఈ అల్పత్వాన్ని నశింపచేయి.

**విశేషాలు**

"1942లో తమిళ్ పండితులొకరు వచ్చి అమృతనాడిని గుఱించి శ్రీవారితో మూడు రోజులు ఇష్ఠాగోష్ఠిగా మాట్లాడుతూ వచ్చారు.

భగవాన్ ఉత్సాహంతో సమాధానమిస్తూ ఆ అమృతనాడి అల్లాగుంటుందనీ, ఇల్లాగుంటుందనీ ఏదో సెలవిస్తూ వుండటం గమనించి అయ్యో! మనకా అనుభవం రాలేదే అన్న దిగులు కలిగింది నాకు.

ఆ వచ్చినవారు వెళ్ళిన వెనుక గూడా భగవాన్ మాధవస్వామితో ఆ విషయమే మాట్లాడటం చూచి అడుగుదామన్న ఆసక్తితో భగవాన్ గోశాలవైపు నుండి వస్తుండగా మెల్లిగా దగ్గరకు వెళ్ళి "అమృతనాడిని గుఱించి చాలా దూరం సెలవిస్తున్నారే? అది..." అని అన్నానో లేదో భగవాన్ "అదంతా నీకెందుకు?" అని అదిలించినట్లు మాట్లాడారు.

"నాల్గు రోజులనుంచీ ప్రశంసగా మాట్లాడుతున్నాను గదా! దాన్ని గుఱించి తెలుసుకుందామని అడుగుతున్నాను" అన్నాను. "సరిపోయింది. వారేదో శాస్త్రాన్ని బట్టి అడిగితే తగినట్లు సమాధానం చెప్పాను. అదంతా నీ కెందుకు? నీ వెవరో చూచుకుంటే పోయేదానికి?" అని శిక్షాపూర్వకమైన ధ్వనితో సెలవిస్తూ నడక సాగించారు భగవాన్. నా కాలు సాగక నిలిచిపోయినాను.

రెండు మూడు రోజులయిన వెనుక, హాలులో అట్టే జనం లేని సమయంలో ఆ అమృతనాడిని గుఱించిన ప్రసంగవశంగా, "ఆ – అదొక భావన" అంటున్నారు భగవాన్.

"అయితే అమృతనాడి విషయం గూడా భావనామాత్రమేనా?" అన్నా నేను.

"ఊఁ.. భావనగాక మరేమి? శరీరమే భావనామాత్రమైతే ఇది మాత్రం భావన కాదా యేమి?" అంటూ ప్రశాంతదృష్టితో నా సందేహమంతా తీరేట్లుగా అనుగ్రహించారు" (సూరి నాగమ్మగారి నా రమణాశ్రమ జీవితము 07వ అధ్యాయము)

అల్పత్వాన్ని సరియయిన సమయంలో తీసివేయటం రమణులకు కూడా తెలుసునని ఈ సంఘటన నిరూపిస్తుంది.



## 19

**కుట్ర యంతయు కోసి గుణముగ పాలించు**

**గురు రూపమై వెలుగారుణాచలా!**

**తాత్పర్యము**

గురురూపమైన అరుణాచలా! నా దోషాలను సమూలముగా నాశనము చేసి, నన్ను గుణవంతునిగా చేయవయ్యా!

**విశేషాలు**

దక్షిణామూర్తిని ప్రార్థిస్తూ 'ఈశ్వరో గురుః ఆత్మేతి మూర్తి భేద విభాగాని... దక్షిణామూర్తయే నమః' అని ఒక శ్లోకముంది.

దేవుడు, గురువు, ఆత్మ (జీవాత్మ) ఈ మూడు వేరు వేరుగా కనబడుతున్నాయి. కాని నిజానికి ఒకటే. ఇది తెలియకపోవటం అవిద్య. ఈ అవిద్య (అజ్ఞానం) దోషాలన్నింటికి మూల కారణము. దానిని తొలగించమని భక్తుని ప్రార్థన.



## 20

**కూచి వాల్గన్నుల కోత బడక కృప**

**చేసి నన్ జేరి కావరుణాచలా!**

**తాత్పర్యము**

"అరుణాచలా! నాకు అపకారం తలపెట్టేవారి బారినుండి కాపాడు, వాళ్ళ చూపులు  బల్లెముల వలె వాడిగా ఉన్నాయి. వాటితో నన్ను వెంటాడుతున్నారు, నువ్వే నన్ను రక్షించగల సమర్థుడివి.

**విశేషాలు**

1. ప్రాపంచిక విషయాలు, లోభాలు, ఆకర్షణలు నాకు అపకారం తలపెట్టే వారని రమణుల తాత్పర్యం. ఆ ఇంద్రియాల చూపులు బల్లెములు అంటే శక్తిమంతమైనవని తాత్పర్యం.
2. తల్లి ఒడిలో ఉన్న బిడ్డకు ఎంతో రక్షణ. ఆ రకంగా నన్ను ఇంద్రియ ప్రలోభాల నుంచి కాపాడుమని రమణుల కోరిక.

   రమణులను మనం నమ్ముకొంటే ఇంద్రియాలనుంచి కాపాడి, పై 'స్వామిత్వాన్ని మనపై' ప్రదర్శించి అనుగ్రహిస్తారు.



## 21

**వంచకా వేడియున్ కొంచెమున్ కరుగవే**
**యభయ ముంచేలుమా అరుణాచలా!**

**తాత్పర్యము**

"అరుణాచలా! శివా! దయతో నను రక్షించమని నేను ఎన్నో రకాలుగా వేడుకొంటున్నాను. కాని నీవు నా పట్ల ఎంతో నిర్లక్ష్యముగా పట్టించుకోవటం లేదు. దయచేసి రక్షించు, నన్ను స్వీకరించు!"

**విశేషాలు**

నిందాస్తుతిగా అనిపించే ఈ చరణంలో ఆర్తి ఉంది.

దేవుని దయకొరకు భక్తులు వేడుకుంటారు. కాని వాళ్ళకి తగిన సమయం రాకపోవటంవల్ల, కర్మ పరిపక్వత కాకపోవటంవల్ల భగవంతుని దయలో ఆలస్యమయినట్లు భక్తునికి అనిపిస్తుంది.

పొలం దున్నకుండా, విత్తనాలు వేయకుండా వర్షం కురిసినా లాభం లేదు. పంట పండదు. దేవుని దయావర్షం కూడా ఇంతే. మనకు తగిన సమయం రావాలి. అప్పుడు స్వామి యొక్క దయావర్షపు అనుభవాన్ని పొందుతాం. భగవంతుని దయ కలిగేవరకు భక్తుడు ఎంతో ఓర్పుతో, చిత్తశుద్ధితో తన సాధన చేస్తూనే ఉండాలి. రమణులు ఈ చరణంలో చెప్పినదిదే.



## 22

**అడుగ కిచ్చెడు నీదు అకళంక మగు కీర్తి**

**హాని సేయక బ్రోవు మరుణాచలా!**

**తాత్పర్యము**

ఓ అరుణాచలా! భక్తులు ఎవరూ నిన్ను అడుగనక్కరలేదు. వారిపై దయని చూపిస్తావని నీకు పేరు. కావలసినది ఇస్తావని నీకు కీర్తి ఉంది. దానికి ఇప్పుడు మచ్చ తీసుకురాకు. నాకు ఎటువంటి కీడు రాకుండా కాపాడు.

**విశేషాలు**

1. భగవంతుని అపార దయను రమణులు ఎంతో అద్భుతంగా ఈ చరణంలో చెప్పారు. ఒక్కోసారి మన జీవితాలలో జరిగే సంఘటనలు స్వామి దయతో నిండినవని చాలాకాలం తర్వాత కాని మనకు తెలియవు.
2. రమణుల జీవితంలోనే దీనికి ఉదాహరణ చెప్పుకొందాం.
3. ఇల్లు విడిచి తిరువణ్ణామలైకి చేరిన రమణుల దగ్గరికి కన్నతల్లి అళగమ్మ వచ్చింది. ఇంటికి తిరిగి రమ్మని ఎంతో ప్రాధేయపడింది. రమణులు జవాబివ్వలేదు. చాలా కాలం తర్వాత ఒక కాగితం మీద అమ్మకి రమణులు ఇలా జవాబు వ్రాసారు
4. "ప్రతి ప్రాణినీ దాని ప్రారబ్ధం ప్రకారం సృష్టికర్త నడిపిస్తాడు. ఎంత ప్రయత్నించినా జరగబోనిది జరగదు. నివారించడానికి ఎంత ప్రయత్నించినా సరే, జరగనున్నది జరగకమానదు. దీనికి తిరుగులేదు. అందువల్ల అన్నిటికన్నా శ్రేష్ఠమైన పద్ధతి మౌనంగా ఉండటం."
5. రమణులు తిరువణ్ణామలైకి రావటం లౌకికదృష్టితో చూస్తే కన్నతల్లికి బాధ అనిపిస్తుంది. తల్లీబిడ్డలను విడదీసిన భగవంతుని దయను మనస్సు ప్రశ్నిస్తుంది.
6. కాని ఆధ్యాత్మిక దృష్టితో చూస్తే కొన్ని కోట్లమంది అమ్మలకు, వారి బిడ్డలకు భావిజీవితంలో రమణుల ఉపదేశాల ద్వారా, సన్నిధి ద్వారా చక్కని మేలు జరిగింది, జరుగుతున్నది. ఇది రమణులు ఇల్లు విడిచిపెట్టటం ద్వారానే జరిగింది.

7. కొన్ని విషయాల్లో భగవంతుని అనుగ్రహం మొదట్లో లేదని అనిపిస్తుంది. తర్వాత ఎప్పుడో దాని ఫలితం తెలుస్తుంది. రమణులు ఈ చరణంలో అంతర్గతంగా చెప్పినది ఇదే!



## 23

**హస్తామలక నీదు సద్రసమున సుఖో**
**న్మాద మొందంగ నేలు మరుణాచలా!**

**తాత్పర్యము**

"అరుణాచలా! అరచేతిలోని ఉసిరికాయలా సులువుగ అధీనమగువాడవు నీవు. అఱచేతి ఉసిరికాయలా ఇతరులు చెప్పనక్కఱ లేకయే స్పష్టముగా నాకు జ్ఞానము తెలియాలి. నిజమైన సుఖము యొక్క ఉన్మాదాన్ని పొందాలి. నీయందే ఉన్న మనస్సుతో చేతనాచేతనముల యందు నేను సమానముగా ప్రవర్తించాలి. అలా నన్ను అనుగ్రహించు."

**విశేషాలు**

ఒకసారి తన భక్తురాలు చనిపోయిన విషయాన్ని రమణ మహర్షికి సూరి నాగమ్మ చెప్పారు. అప్పుడు రమణుని యొక్క మాటలు ఇవి.

Oh, is she dead? I have been waiting to see when she would get away from all these worldly worries. So she has gone away from all these worries. All right, go there and come back. (29th December 1945 LETTERS FROM SRI RAMANASRAMAM; SURI NAGAMMA TRANSLATED BY D.S. SASTRI)

ఈ చరణములోని నిజమైన జ్ఞానకాంతులు రమణుల మాటలలో మనకు కనిపిస్తాయి.



## 24

**వల నుంచి భక్తుల పరిమార్పు నిను గట్టు**
**కొని యెట్లు జీవింతు అరుణాచలా!**

**తాత్పర్యం**

భక్తుల జీవత్వాన్ని నశింపచేయడమే ధ్వజముగా కలిగిన నిన్ను నేను వివాహం చేసుకుంటే (నాయకునిగా చేసుకొంటే) నేనొక వ్యక్తిగా ఇక ఉండగలనా? నీలో పరిపూర్ణంగా ఐక్యమైపోతాను కదా? (నాయకుడైన అరుణాచలస్వామి అడుగు జాడలలో నడిస్తే ప్రతి భక్తుడు స్వామిలో ఐక్యమై మోక్షము పొందుతాడని తాత్పర్యం.)

**విశేషాలు**

1. భక్తుడు భగవంతునికి చేరువయినట్లు గుర్తు ఏమిటంటే - ముందుగా భక్తునిలోని అహంకారం నశించటం.
2. భక్తుల అహంకారాన్ని ధ్వంసం చేస్తాడని చెప్పటానికే జీవత్వాన్ని నశింప చేయడమే భగవంతుడు ధ్వజముగ కలిగినవాడని ఈ చరణంలో చెప్పబడినది.
3. మధురభక్తి సంప్రదాయంలో జీవులందరూ స్త్రీలు. భగవంతుడు ఒక్కడే పురుషుడు.
4. వివాహము ఇద్దరినీ ఒకటి చేస్తుంది.
5. అందువలన రమణులు తనను స్త్రీగా - నాయికగా భావించుకొని, అరుణాచల స్వామిని పురుషునిగా - నాయకునిగా ప్రతిపాదించి వివాహ ప్రసక్తి తెచ్చారు.
6. బృహదారణ్యకంలో ఒకనాడు యాజ్ఞవల్క్య మహర్షి సన్న్యాసం పుచ్చుకొని అరణ్యానికి వెళ్ళబోతూ చిన్నభార్య అయిన మైత్రేయిని పిలిచి నేను సన్న్యసించి వెళ్ళుతున్నాను - మీ ఇద్దరికి నా ఆస్తి సమానంగా పంచి ఇస్తాను - అది పెట్టుకొని సుఖంగా బ్రతకండని చెప్పాడట.
7. దానికావిడ ఏమండీ! మీరు పంచిపోయే ఈ ఆస్తివల్ల నా కమృతత్వమనేది సిద్ధిస్తుందా అని అడిగిందట. అతడా మాటకు నవ్వి ఓసి పిచ్చిదానా!

ఆస్తులవల్ల అమృతత్వం సిద్ధించటమేమిటి – అది ఒక్క ఆత్మదర్శనం వల్ల మాత్రమే మనకు దక్కుతుందని చెప్పాడట.

8. అయితే నాకీ పనికిమాలిన ఆస్తి దేనికి ఆత్మదర్శనానికి సాధనమేదో దానినే బోధించి పొమ్మని ప్రాధేయపడిందావిడ. అప్పుడాయన చెప్పినవే 'శ్రోతవ్యో– మంతవ్యో – నిదిధ్యాసితవ్యః' అనే మూడు మాటలూ. ఈ మూడింటికే శ్రవణ మనన నిదిధ్యాసనలని వ్యవహారం.

9. "ఆత్మావాఽరే ద్రష్టవ్యః" అమృతత్వాన్ని పొందాలంటే ఆత్మదర్శనం చేసుకోవాలి మానవుడు. అదే జీవిత పరమార్థం. అయితే అది ఎలా ప్రాప్తిస్తుంది మనకు?

10. శ్రోతవ్యః – మొదట శ్రవణం చేయాలి. మంతవ్యః – తరువాత మననం చేయాలి. నిదిధ్యాసితవ్యః – ఆ పిమ్మట తదేక దృష్టితో ధ్యానం చేయాలి. శ్రవణాదులైన ఈ మూడు ఆచరిస్తే మనసులో పేరుకొనిపోయిన కర్మ మాలిన్యాన్నంతా అది కడిగివేస్తుంది. దానితో మనోదర్పణం పరిశుద్ధమయి చక్కగా ప్రకాశిస్తుంది. (బ్రహ్మశ్రీ యల్లంరాజు శ్రీనివాసరావుగారు)

11. రమణులు ఈ చరణంలో చెప్పిన ఐక్యత సాధించాలంటే ముందుగా ఈ శ్రవణాది త్రి సాధన చేయాలి.



## 25

**కోపరహిత గుణ! గురిగాగ నను గొను**
**కొఱ యేమి చేసితి నరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! ఓ పరమశివా! కోపంతో పాటు అన్ని ఆవేశాలనూ నీవు జయించావు. మరి నన్నెందుకయ్యా! ఆ కోపతాపాలకు గురిచేస్తున్నావు. కోపగుణాన్ని నాకు అంటగట్టి నన్ను వెంటాడుతున్నావెందుకు? నేను చేసిన తప్పేమిటి చెప్పు? ఏమి చేసాను? ఏ రకంగా నీకు కోపం తెప్పించాను?

**విశేషాలు**

ఈ చరణంలో నిందాస్తుతి ఉంది. అంటే పైకి నింద. లోపల స్తుతి. కోప గుణాన్ని నాకు అంటగట్టి నన్ను వెంటాడుతున్నావెందుకు? అన్నచోట అరుణాచల స్వామిపట్ల నింద అనిపిస్తుంది. ఇందులోనే స్తుతి ఉంది. నువ్వు నన్ను అనుగ్రహించావు కాబట్టే నా కోపతాపాలను పోగొట్టడానికి – నా జీవనచర్యలో నన్ను అనుక్షణం వెంటాడుతున్నావని దేవుని దయను రమణులు పొగుడుతున్నారు.



## 26

**గౌతమ పూజిత కరుణా ఘన నగమా**
**కడగంట నేలుమా అరుణాచలా!**

**తాత్పర్యము**

"అరుణాచలా! దయామూర్తీ! గౌతమ మహర్షిచే పూజింపబడినవాడా! నీ అనుగ్రహపు చూపు నాపై ప్రసరించుగాక!"

**విశేషాలు**

పూర్వం గౌతమ మహర్షి, తన భార్య అహల్యతో త్ర్యంబకం దగ్గర తపస్సు చేసుకుంటూ వుండేవారు. ఒకసారి ఆ ప్రాంతమంతా చాలా తీవ్రమైన కరువు వచ్చింది. నీరు లేక, పంటలు పండక, ఆహారం లేక, అక్కడ నివసించే మిగతా ఋషులంతా పొట్ట చేతబట్టుకుని దిక్కు తోచిన విధంగా పోసాగారు. ఇది చూసి గౌతమ మహర్షికి చాలా బాధ కలిగి తన తపశ్శక్తి ద్వారా వారి ఆకలి తీర్చసాగాడు.

గౌతముడు చేస్తున్న ఈ మంచి పనులవల్ల ఆయనకి పుణ్యం పెరిగి, తన ఇంద్రపదవికి ఎక్కడ పోటీ వస్తాడోనని ఇంద్రులుగారు ఒక మాయ ఆవుని సృష్టించి గౌతముని పొలాలని విధ్వంసం చెయ్యమని పంపుతాడు. ఆది తెలియని గౌతముడు దానిని సున్నితంగా అదిలించటానికి దర్భతో అలా అంటాడు. ఆ ఆవు మరణించింది.

గౌతమునికి గోహత్యా పాపం వస్తుంది. ఆయన ఇంట్లో అక్కడి బ్రాహ్మణు లెవరూ భోజనం చెయ్యరు. దానికి బాధపడిన గౌతముడు గోహత్యా దోష నివారణ మార్గం చెప్పమని కోరుతాడు. మిగతా ఋషులు "పరమ శివుణ్ణి ప్రార్థించి, ఆయన

జటాజూటంలోని గంగని వదలమను. ఆ గంగలో స్నానం చేస్తే గోహత్యా దోషం పోతుం”దని చెబుతారు.

గౌతముడు బ్రహ్మగిరిమీద శివుడికోసం తపస్సు చేస్తాడు. ప్రత్యక్షమైన శివుణ్ణి గంగని విడిచి పెట్టమని కోరుతాడు. ప్రసన్నుడైన శివుడు సరేనంటాడుగానీ, గంగాదేవి శివుని జటాజూటం వదలటానికి ఇష్టపడదు. శివుడు తాండవం చేయగా జటాజూటం దాటి వచ్చింది గంగమ్మ. కానీ గౌతముడు స్నానం చెయ్యటానికి వీలులేకుండా అతనికి అందీ అందకుండా, కనిపించీ కనిపించకుండా మాయం కాసాగింది.

గౌతముడు మాత్రం సామాన్యుడా!? మహాతపస్సంపన్నుడు. ఆయన కుశలను తీసి గంగ చుట్టూ వర్తులాకారంగా చుట్టి దీనిని దాటిపోరాదు అని అన్నాడు. పాపం గంగ ఏమీ చెయ్యలేకపోయింది. అదే కుశావర్తం. త్రయంబకేశ్వర ఆలయం వెనుక వున్న పుష్కరిణి. ఇక్కడ నీరు ఎప్పుడూ ఉబుకుతూ వుంటుంది. బ్రహ్మగిరినుంచి గంగ ముందు ఇక్కడే నేలకు దిగింది, ఇక్కడ అదృశ్యమయ్యే గోదావరి ప్రవాహం నాశిక్ దగ్గర ఉధృతమవుతుంది.

గోహత్యా దోషం పోగొట్టటానికి శివ జటాజూటంనుంచి కిందకి దిగిన గంగమ్మ ఆ గోవుమీదనుంచి పారటంతో గోదావరి అనే పేరు వచ్చింది. గౌతముడు రప్పించాడు కనుక గౌతమి అయింది. గౌతముడు గోహత్యా దోషంనుంచి విముక్తుడైన ప్రదేశం కుశావర్తం కనుక ఇక్కడ చేసే అనేక శాంతులు, పితృకార్యాలు అమిత ఫలితాన్నిస్తాయంటారు. ముఖ్యంగా ఇక్కడ మాత్రమే చేసే నారాయణ నాగబలి వలన దీర్ఘకాల అనారోగ్యం, తీవ్ర ఆర్థిక బాధలు, సంతానలేమి, ఇంకా అనేక తీవ్రమైన ఈతిబాధలు తొలగిపోతాయంటారు. ఇది మూడు రోజుల కార్యక్రమం, పైగా కొన్ని నిర్దిష్టమైన రోజులలో మాత్రమే చెయ్యాలి. అలాగే కాలసర్ప దోషానికి శాంతి, ఇంకా అనేక పూజలు భక్తులు ఇక్కడ చేయించు కుంటారు. ఈ కుశావర్తం ఒడ్డున చిన్న శివాలయం వున్నది. (పి.యస్.యమ్. లక్ష్మిగారి వ్యాస సౌజన్యం)

గౌతముడు కొంతకాలం తిరుచ్చుళిలో నివసించాడట. తిరుచ్చుళియే శ్రీ రమణభగవాన్ జన్మస్థలం.



## 27

**సకలము కబళించు కరకాంతియిన**

**మనో జలజ మలర్చుమా అరుణాచలా!**

**తాత్పర్యము**

ఈ జగత్తులో చీకటిని అంతా సూర్యదేవుడు మాయం చేస్తాడు. సూర్యుని కిరణాలు తామరమొగ్గను వికసింపచేస్తాయి. ఓ అరుణాచలా! శివా! నా హృదయ పద్మాన్ని వికసింపచేయి. నా హృదయానికి వెలుగునివ్వు.

**విశేషాలు**

అజ్ఞానాన్ని పోగొట్టమని రమణులు ప్రార్థిస్తున్నారు. అరుణాచల పంచ రత్నాలలోని మొదటి శ్లోకంలో కూడ శ్రీ భగవాన్ ఇదే తాత్పర్యం చెప్పారు.

**కరుణా పూర్ణ సుధాబ్ధే**

**కబళిత ఘన విశ్వరూప కిరాణావల్యా**

**అరుణాచల పరమాత్మన్**

**అరుణోభవ చిత్తకంజ సువికాసాయ!**

(దయతో నిండిన పూర్ణ అమృత సముద్రుడా! ఓ అరుణాచలా! నీ వెలుగు కిరణాలు ఈ ప్రపంచంలోని చీకటిపై పడి ఆ చీకటిని మాయం చేస్తాయి. పద్మపు రేకులు విచ్చుకునేట్లు చేస్తాయి, నా హృదయాన్ని కూడా అలాగే వికసింప చేయి.)

ఏ కోర్కె లేకపోవటం మోక్షం. అద్భుతమైన మనందరికి ఆ జ్ఞానాన్ని కలుగచేయమని ఈ చరణంలోని రమణుల ఆంతర్యం.



## 28

**తిండిని నిన్జేరితిని తిన నా నేను**

**శాంతమై పోవుదు అరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! నిన్ను నావాడిగా చేసుకోవాలనే ఉద్దేశంతో నిన్ను చేరాను. కాని నన్ను నువ్వు వశపరచుకొన్నావు. నా అహంకారాన్ని నువ్వు మింగి నా

'వేఱు' అను భావాన్ని నశింపచేసావు. నన్ను నీలో కలుపుకొన్నావు. శాంతి అనేది నాకు లభించింది. నిన్ను తిందామని వచ్చిన నేను నీకు ఆహారమైపోయాను. తినేవాడూ, భోజనమూ ఒకటయ్యాయి. ఇక నేను వేఱు, నువ్వు వేఱు అను భావము లేనే లేదు, అన్నిటినీ నేను కోల్పోయాను. నీతో ఏకత్వాన్ని పొందాను. నాకు ఇంక ఏ కోరికా మిగలలేదు.

**విశేషాలు**

నిర్మలమైన భక్తితో స్వామిని ఆరాధిస్తే ఆయన మోక్షాన్ని ప్రసాదిస్తాడని ఇందులో తాత్పర్యం.



## 29

**మది చల్లబడ భద్రకర ముంచి యమృత నోర్**
**తెరు మనుగ్రహచంద్ర అరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! కలువ చంద్రుని చల్లని కిరణములు సోకగనే వికసిస్తుంది. నా హృదయము కలువ వంటిది. అమృత కిరణాలు కలిగిన చంద్రుని వంటి నీ కిరణ స్పర్శ వల్ల నా హృదయము విప్పారుతుంది. నీ దయ అనే అమృతముతో నన్ను పూరించవయ్యా! నీ అమృతహస్తాన్ని చాపి ఉంచితే నా మనస్సు చల్లబడు తుంది. అమృతముతో నిండిన నీ నోటిని తెరచి మాట్లాడవయ్యా! నన్ను దయ చూడవయ్యా!



## 30

**వన్నెను చెరచి నిర్వాణ మొనర్చి కృ**
**పా వన్నె విడి బ్రోవు మరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! నన్ను వివస్త్రను చేయవయ్యా! స్వామీ! నీ ఎదుట నేను నగ్నంగా నిలబడినప్పుడు, నీ దయ అనే ఆచ్ఛాదనని కప్పవయ్యా! నన్ను నీ చేతులలోకి తీసికోవయ్యా!

**విశేషాలు**

1. ఇక్కడ వస్త్రము భక్తుని యొక్క సంపదలకు ప్రతీక.
2. దేహాత్మ బుద్ధి అనగా ఈ శరీరమే తానను జీవభావము. ఈ దేహాత్మ భావనను వదలి మనోబుద్ధి, చిత్తాహంకారములను వశము చేసికొనినచో ఈ సూక్ష్మ శరీరమైన జీవుడు తనయందున్న పరమాత్మను దర్శించి విశ్వవ్యాప్తుడు కాగలడు. ఇవే ఈ చరణంలో పేర్కొన్న సంపదలుగా మనం గ్రహించాలి.
3. భక్తునికి గల ఈ సంపదలు అన్నీ తొలగినపుడే అరుణాచలుని దయకి పాత్రుడవుతాడు. అప్పుడే అరుణాచలుడు తన దయ అనే వస్త్రాన్ని భక్తునికి కప్పుతాడు, ఆ తరువాతనే దగ్గరకు తీసుకుంటాడు.
4. పంచ–కోశములు

   1. అన్నమయము, 2. ప్రాణమయము, 3. మనోమయము,

   4. విజ్ఞానమయము, 5. ఆనందమయము అని అయిదు కోశములు
5. ఈ పంచ కోశములన్నీ అనాత్మలు, అవిద్య భూమికలు. వీనిని అర్థము చేసుకొని ఆయా కోశములలో ఉపాసన చేసిన, హేతు స్వరూప సోపాన పంక్తి (కార్య కారణరూపమైన మెట్ల వరుస) క్రమముగా బ్రహ్మజ్ఞాన ప్రాప్తికి దారితీయును.
6. ఈ పంచకోశముల లోపల ప్రదేశాన్ని బుద్ధి గుహ, దహరాకాశము లేక హృదయపద్మము (Heart Cavity) అంటారు.
7. దహరము అంటే హృదయమే. ఇదే యోగశాస్త్రములోని అనాహత చక్ర స్థానము.
8. ఈ పంచకోశముల విశ్లేషణ తైత్తిరీయ ఉపనిషత్తులోనిది.
9. వరుణదేవుడు తన కుమారుడైన భృగువుకు బ్రహ్మజ్ఞానమునకు మార్గ దర్శనము చేయుట దీనిలోని విషయము.
10. భృగువుకు నచికేతుని వలెనే బ్రహ్మజ్ఞానాన్ని పొందాలని తీవ్రజిజ్ఞాస కలిగినది. దయతో తనకు బ్రహ్మతత్త్వోపదేశం చేయమని తండ్రిని అడిగాడు.

11. దానికి తండ్రి – "నాయనా! అన్నం, ప్రాణం, నేత్రం, శ్రోత్రం, మనస్సు, వాక్కు – ఇవన్నీ బ్రహ్మోపలబ్ధికి సాధనాలే. వీటన్నిటిలో బ్రహ్మతత్త్వం యొక్క అస్తిత్వం స్ఫురిస్తుంది. దేనిలోనుండి ఈ సర్వమూ ఉత్పన్నమయిందో, దేనిచేత పరిపోషింపబడుతున్నదో, దేనిలో చిట్టచివఱకు మహాప్రళయ కాలంలో తిరిగి లయమవుతున్నదో ఆ మూలవస్తువును తెలుసుకొనడానికి ప్రయత్నించు. ఆ మూలతత్త్వాన్ని తపస్సుద్వారా ప్రత్యక్షం చేసుకొని అనుభవించు" అని చెప్పాడు.

12. భృగువు తపస్సు చేసి మొదటగా తెలుసుకొన్నది అన్నం వల్లనే ఈ సర్వ ప్రాణులూ ఉత్పత్తి చెందుతున్నాయి. పుట్టిన ప్రాణులన్నీ అన్నం వల్లనే పరిపోషింపబడి సురక్షితంగా ఉంటున్నాయి. మరణించిన తర్వాత కూడా అన్నరూపమైన ఈ పృథివిలోనే అన్ని జీవరాశులూ కలిసిపోతాయి. ఆ తపస్సులో కల్గిన ప్రథమ ప్రబోధం బ్రహ్మం అన్న స్వరూపమనిపించడం. ఈ విషయమంతా తండ్రికి నివేదించాడు భృగువు.

13) తండ్రి ఇలా అన్నాడు. "నాయనా! నీకు బ్రహ్మం యొక్క స్థూలరూపమే పరిచయమైంది. నీవు ఇంకా తపస్సు చేయాల"ని చెబుతాడు. ఇలా వరుసగా ప్రాణమే బ్రహ్మతత్త్వమని, మనస్సే బ్రహ్మతత్త్వమని, విజ్ఞానమే బ్రహ్మ తత్త్వమని, ఆనందమే బ్రహ్మ తత్త్వమని వచ్చి తండ్రికి చెబుతాడు భృగువు.

14) తండ్రి కొడుకుతో, "కుమారా! ఆనందం అనేది అన్నిటి కన్నా ఉత్తమంగా పరమాత్మ రూపాన్ని విస్పష్టం చేసే రూపం. అయినా, అన్నమయకోశం, ప్రాణమయకోశం, మనోమయకోశం, విజ్ఞానమయకోశం – ఇవన్నీ బ్రహ్మ స్వరూపాలే. కానీ ఇవి ఒకదాని కన్నా మఱొకటి సూక్ష్మమయినవి. అన్నిటి కన్నా మించినది ఆనందమయ బ్రహ్మానుభూతి" అని చెబుతాడు. (సద్గురు శివానందమూర్తి)

15. రమణులు ఈ చరణంలో ఆనందమయ బ్రహ్మానుభూతి కొరకు అరుణాచలుని దయతో ప్రయత్నించమని, అది ఈ శరీరమే తానను జీవభావము (సంపద) వదిలిన తర్వాత సాధ్యమని ఈ చరణంలో సందేశమిస్తున్నారు.



## 31

**సుఖ సముద్రము పొంగ వాక్ మనము లడంగ**

**సూరక నమరు మం దరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! పరమశివా! నా హృదయములోకి రావయ్యా! దానిని మౌనంతో నింపివేయి. నాలో మాట కాని, ఏ మనస్సుకు సంబంధించిన ఏ వ్యాపారముగాని లేకుండేట్టు చేయి.

మనస్సు ఆ విధంగా శాంతంలో, మౌనంలో అణగిపోయినప్పుడు ఆత్మ జ్ఞానానుభూతి అద్భుతమైన సుఖసముద్రముగా మారి పొంగుతుంది. నా హృదయాన్ని నింపేస్తుంది.

'నేను వేరు', 'ఇతరులు వేరు' అను తేడా ఉన్నప్పుడు మాట అవసరము. సర్వ వ్యాపకుడవైన నీలో కలసిపోయినప్పుడు ఇక నాకు మాటతో పనేమిటి?

**విశేషాలు**

రమణమహర్షి మాటల్లో "మౌనం అంటే పదాల ప్రతిబంధకాలు లేని నిశ్శబ్ద సంభాషణము". అది అనుగ్రహించమని అరుణాచలేశ్వరునికి ఈ చరణంలో నివేదిస్తున్నారు.



## 32

**వంచింతువేల నన్ శోధింపకిక నీదు**

**జ్యోతి రూపము జూపు మరుణాచల!**

**తాత్పర్యము**

అరుణాచలా! శివా! ఇంక నన్ను మోసం చేస్తావేమిటయ్యా! ఇంకా ఎంత కాలమయ్యా! ఈ దోబూచులాట! ఇంకా నాకు పరీక్ష లేమిటి? అన్ని రకాల పరీక్షలు పెట్టావు. ఇక శోధనలు వద్దు. నీ దయ ఒక్కటే మిగిలి ఉంది. నీ మనోహరమైన జ్యోతి రూపాన్ని ఒక్కసారి నన్ను దర్శించనీ! అలా నన్ను అనుగ్రహించు.

**విశేషాలు**

1) రమణులకు, జ్యోతికి అవినాభావ సంబంధం ఉంది.

2) ఒకసారి వేకువజామున భక్తులందరు శ్రీ రమణ సన్నిధిలో ప్రార్థన చేస్తున్నారు.

3) హఠాత్తుగా రమణుని చుట్టూ ఒక జ్యోతి పుట్టింది.

4) ఆయన నుదురును ఆరుసార్లు తాకింది.

5) ఆ తేజస్సు అంతయు ఆయనలో కలిసిపోయింది.

6) గణపతి ముని (నాయన) దీనిని చూసి సంతోషముతో రమణమహర్షిని కార్తికేయునిగా భావించి 8 శ్లోకములను చెప్పారు.

7) ఈ చరణంలో కోరుకొన్నట్లుగానే రమణుల అంతిమ జీవితంలో జరిగింది.

8) 1950 ఏప్రిల్ 14న రాత్రి 8 గం.47 ని.లకి అరుణాచలంలో రమణ మహర్షి లీనమైపోయారు. సరిగ్గా అదే సమయానికి ఒక పెద్ద జ్యోతి దక్షిణ దిక్కునుండి బయలుదేరింది.

9) రమణులున్న గదిని దాటి ఉత్తర భాగంలో ఉన్న అరుణాచలపు దిక్కులో కలిసిపోయింది.

10) అరుణాచలంలోనే కాక, దేశంలో అనేక చోట్ల చాలామంది ఈ అద్భుత దృశ్యం చూసి పరవశించారు.

11) తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ (18- 62)

అర్జునా! అన్ని విధములుగా ఆ పరమాత్మనే శరణు కోరు. అతని దయ చేతనే పరమశాంతిని, శాశ్వతమైన మోక్షమును నువ్వు పొందగలవు అని గీతలో చెప్పిన శరణాగతి కూడా రమణుల ఈ చరణంలో మనకు కనబడుతోంది.



## 33

**పరవిద్య గరపి ఈ భూమి మైకము వీడి**
**రూపగు విద్య జూపరుణాచలా!**

**తాత్పర్యము**

ఓ అరుణాచలా! ఇంతకాలమూ ఈ ప్రపంచపు భ్రమలనే నమ్మాను. ఆ మైకములో నిన్ను పట్టించుకోలేదు. ఈ భ్రమలని అంతం చేసే ముక్తినిచ్చే విద్యని నాకు అనుగ్రహించు.

**వివరణము**

1) పరమాత్మను గురించి తెలుసుకొనడానికి ఉపయోగించే విద్యను పర(రా) విద్య అంటారు.

2) ఈ లోకంలో నేర్చే లౌకికవిద్యలు జీవించడానికి ఉపయోగపడతాయి. అహంకారాన్ని పెంచుతాయి. ధనాన్ని ఇచ్చి ఉచ్చులలో పడవేసి మైకాన్ని పెంచుతాయి. పరమాత్మను గురించి తెలుసుకొనడానికి ఉపకరించే ఆత్మ సాక్షాత్కారాన్ని కలిగించగల నేను ఎవడను అనే ఆత్మవిచారమార్గం ఒక్కటే నేర్చుకోవలసిన అసలైన విద్య అని రమణుల తాత్పర్యం.

3) "మనకు కనిపించే శరీరం కాకుండా ఇంకా అనేక శరీరాలున్నాయి. ఈథర్ శరీరం, ఆస్ట్రల్ శరీరం, భావశరీరం, ప్రాణశరీరం, ఆత్మశరీరం ఇలా కంటికి కనిపించని అనేక శరీరాలు మనకున్నాయి. వాటిని కంటితో చూడడం కుదరదు. మనసుతో దర్శించాలి.

4) కనిపించడం అన్నది కంటికి పరిమితం. కనిపించని దానిని దర్శించడం మనస్సు పరిధిలోనిది. అలా దర్శింపచేసే సామర్థ్యం ఉన్నది ఆత్మకు మాత్రమే."

5) "ఇవ్వాళ మనం టన్నులకొద్దీ విజ్ఞానం, నాగరికత ఉందని సంబరపడి పోతున్నాంగానీ, ఇంతకు వేయిరెట్లు 'విజ్ఞానం' ఆ (పూర్వం) రోజుల్లోనే ఉండేది. అది సంస్కారం. అప్పుడు మనవాళ్లు హాయిగా పరలోకాలకు విహారయాత్రలకు వెళుతూ వస్తూ ఉండేవారు. దేవతలతో, యక్షులతో, కిన్నెరలతో, కింపురుషులతో, గంధర్వులతో చెలిమి చేసేవారు."

6) "ఈజిప్టు, రోమ్ దేశాల నాగరికతల్ని అధ్యయనం చేస్తే అక్కడి చారిత్రక అవశేషాల్ని గమనిస్తే చాలా రహస్యాలు తెలుస్తాయి. ఈజిప్టులోని పిరమిడ్లు, స్ఫింక్ రహస్యాలు ఇప్పటికీ తెలియడం లేదు. వారి ఖగోళ విజ్ఞానం, ఆత్మల అవగాహన నేటికీ ఊహాతీతంగానే ఉంది. భూమి కొలతలు, భూమికి ఇతర గ్రహాలకు మధ్య దూరాలు ఎలా కొలవగలిగారు. ఎవరూ భౌతిక శరీరాలతో వెళ్లి టేపులు పెట్టి కొలిచి ఉండరు కదా! వారికి లింకులు తెలుసు. మానవ మేధస్సును విశ్వమేధస్సుతో లింక్ చేయడం వారికి తెలుసు. భౌతిక శరీరాన్ని ఇక్కడ భద్రపరచి, అశరీరులుగా విశ్వసంచారం చేయడం వారికి తెలుసు."

7) "ఏ దేశ చరిత్ర పుటలు వెనక్కి తిప్పినా, ఏ జాతి చరిత్రలోకి తొంగిచూసినా ఆ కాలంవారికి 'అశరీర పరిజ్ఞానం' పూర్తిగా ఉన్నట్లు స్పష్టంగా తెలుస్తుంది. మన పౌరాణిక కథలు, ఇతిహాసాలు, లోతుగా పరిశీలించండి. ఎన్ని అద్భుతాలు బయటపడతాయో గమనించవచ్చు. రాజులు, ఋషులు యథేచ్ఛగా అలా అలా స్వర్గానికి హనీమూన్ ట్రిప్స్ వేస్తుండేవారు. అక్కడి దేవకన్యలతో, అప్సరసలతో సరదాగా షికార్లు చేసి, సరదాలు తీర్చుకునే వారు. అలా విమానాల్లో ఆకాశమార్గాన హిమాలయాల పైకి వెళ్లేవారు. నదులు, సముద్రాలు అలవోకగా దాటి వెళ్లేవారు. ఇంద్రసభకు వెళ్లడం, నందనాల్లో విహరించడం, త్రిమూర్తుల్ని కలవడం, ముక్కోటి దేవతలతో ముచ్చట్లాడడం, ముచ్చట తీర్చుకోవడం బొత్తిగా కష్టం కాదని తెలుస్తుంది" అంటారు మాస్టర్ శ్రీ శార్వరి పరావిద్య అనే పుస్తకంలో.

8) రమణుల 'నేను' అన్వేషణ – పైన చెప్పిన పరిధులని దాటి పరావిద్య తీరానికి చేర్చి ఆత్మసాక్షాత్కారం చేయిస్తుంది. జీవునికి ఈ అన్వేషణ చేసే శక్తికి కూడా పరమాత్మ అనుగ్రహం కావాలి. అదే రమణులు ఈ చరణంలో కోరుతున్నారు.



## 34

**చేరకున్నను మేను నీరుగ కరిగి క**
**న్నీటేరయి నశించు నరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! ఓ పరమశివా! నా శరీరము, నా మనస్సు నువ్వే. నాలోని ప్రతి అంశము నీలో కలవాలనుకొంటోంది. నీలోకి నేను చేరకపోతే నీవు నన్ను స్వీకరించకపోతే – కలిగే వియోగబాధని తట్టుకోలేను, కరిగి కరిగి నా శరీరము నీరు అవుతోంది. నువ్వు ఇంకా ఆలస్యము చేస్తే నేను కన్నీటిలో కరిగిపోతాను, నన్ను తొందరగా అనుగ్రహించు.

**వివరణము**

01. ఈ చరణాన్ని చెబుతున్నప్పుడు శ్రీ రమణ భగవాన్ కంటినుండే గాక శరీర మంతటి నుండీ నీరు కారిందట. ఆయన తడిసి ముద్దయ్యారని పెద్దలు చెబుతారు.

02. తనకు కలిగే కన్నీటి గురించి రమణులు ఒకసారి ఇలా చెప్పారు. "సాధారణంగా ఏ ప్రార్థనా చేసేవాణ్ణి కాదు. నా అంతరంగం, విశ్వంలో అంతర్గమైనదానిని స్పృశించేది. దీనికి చిహ్నంగా కళ్ల వెంట నీళ్లు కారేవి. అవి ఏ రకమైన సంతోష, విషాదాలకూ ఫలితాలు కావు" అని పేర్కొన్నారు.

03. కన్నీరు అనగానే మహాదాత అయిన మయూరధ్వజుని కన్నీటి వృత్తాంతం కలవరపెడుతుంది.

04. ఒకసారి శ్రీకృష్ణుడు, ధర్మరాజుతో కలసి వృద్ధ బ్రాహ్మణుల రూపంలో మయూరధ్వజుని దగ్గరకు వెళ్తారు. ఏమి కావాలో కోరుకొమ్మని మయూర ధ్వజుడు అడుగుతాడు. "రాజా! మీ దర్శనార్థమై మేము వస్తున్నప్పుడు దారిలో ఒక సింహం అడ్డుపడింది. మా కుమారుడ్ని పట్టుకోగా బాలుని విడిచిపెట్టవలసినదిగా మేము ప్రార్థించాం.

05. అప్పుడు మీ కుమారుడు మీకు కావాలంటే మయూరధ్వజుని శరీరంలోని సగభాగం నాకు ఆహారంగా కావాలి. అతడి భార్యాపుత్రులే స్వయంగా అతని శరీరాన్ని కోసి ఇవ్వాలి. అది తెచ్చి ఇస్తే మీ కుమారుడిని వదిలేస్తానని చెప్పింది" అని కృష్ణుడు చెబుతాడు.

06. ఆ ప్రకారంగా జరిగిన తరువాత మయూరధ్వజుని ఎడమకన్ను నుంచి నీరు కారటం ధర్మరాజు చూసి "కన్నీటి దానం వద్దు వద్దు అంటాడు". అప్పుడు మయూరధ్వజుడు, "అయ్యా! బాధపడి నా శరీరాన్ని మీకివ్వటం

లేదు. నా కుడిభాగం పరోపకారానికి ఉపయోగపడుతోంది. కానీ ఆ అదృష్టం తనకు లేదని ఎడమకన్ను బాధపడుతూ కన్నీరు పెడుతోంది" అని చెబుతాడు.

07. తర్వాత కృష్ణుని వరంతో దేవాలయ ధ్వజస్తంభంగా మయూరధ్వజుడు మారతాడు. అతని కన్నీరు మన మనస్సులను ప్రక్షాళితం చేస్తుంటుంది. రమణుల ఈ చరణంలోని కన్నీరు కూడా అదే కోవలోకి చెందింది. మనలను తరింపచేస్తుంది.



## 35

**ఛీ యని త్రోసిన చేయు కర్మ తపన**

**గాకేది మనుమార్గ మరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! ఓ పరమశివా! నా చెడు కర్మలకు వచ్చే ఫలితాలనుంచి నువ్వే నన్ను కాపాడగలవు. నన్ను నిర్లక్ష్యము చేసావనుకో, పట్టించుకోలేదనుకో నా పూర్వజన్మలలో చేసిన చెడు కర్మల ఫలితం నన్ను కాల్చివేస్తుంది. ఈ భయంకర పరిణామము నుంచి నీ దయ ఒక్కటే నన్ను కాపాడుతుంది. నాపై ఎప్పుడు నీ దయను చూపించు!

**విశేషాలు**

1) ప్రారబ్ధమనగా ప్రారంభించబడినది. మనము ఈ శరీరము ద్వారా అనుభవించవలసిన కర్మ ఫలములను ప్రారబ్ధము అంటారు.

2) పూర్వజన్మలలో చేసినది వ్యక్తమై మనకీ వర్తమాన జన్మనిస్తే అలాటి కర్మకు ప్రారబ్ధమని పేరు.

3) ప్రారబ్ధము మూడు విధములుగా ఉంటుంది

   1. ఇచ్ఛాప్రారబ్ధము: మనఃపూర్వకముగా కోరి గతములో చేసిన పుణ్యాపాప కర్మల యొక్క ఫలములు ఇప్పుడు అనుభవములోనికి వచ్చినవాటిని ఇచ్ఛాప్రారబ్ధము అంటారు

2. అనిచ్ఛాప్రారబ్ధము: తాను కావాలని కోరకుండా దైవికముగా సంభవించేవి అనిచ్ఛాప్రారబ్ధము. ఉదా: వ్యాధి కలుగుట

3. పరేచ్ఛాప్రారబ్ధము: ఇతరులు కోరుట వలన ప్రాప్తించిన కర్మ ఫలములు

4) ఈ ప్రారబ్ధము విడచిపెట్టబడిన బాణము వంటిది. అనుభవించి రద్దు చేసికొనవలసినదే కాని వేరొక మార్గము లేదు.

5) జీవన్ముక్తులను కూడా వదలిపెట్టదిది.

6) 'ప్రారబ్ధం భోగతో నశ్యేత్' అనుభవంతో సమాప్తం కావలసినదే. వాడు పామరుడైనా, పండితుడైనా అనుభవించిగాని దాని బాకీ తీర్చుకొనలేడు. ఈ ప్రారబ్ధము ఒక్కొక్కసారి భగవంతుని దయవలన నశిస్తుందని రమణులు ఈ చరణంలో చెబుతున్నారు.

7) ప్రారబ్ధం అనుభవంలోకి రావడం గూర్చి ఒక చిన్న విషయం,

8) ప్రారబ్ధ వశాత్ ఒక వ్యక్తికి ఒకనాడు విపరీతమైన రక్తస్రావము జరిగి హాస్పిటల్ మంచంమీద పడడం రాసి ఉన్నది అనుకుందాం. అది రెండు విధాలుగా అనుభవంలోకి రాగలదు.

9) ఏదో విధంగా దెబ్బ తగిలి శరీరభాగం తెగి/కోసుకొని రక్తం కారిపోయి హాస్పటల్‌లో జాయిన్ అయ్యి హాస్పటల్ మంచంమీద పడి అక్కడి వారిచే వైద్యసేవలు పొంది తగ్గాక ఇంటికెళ్ళవచ్చు.

10) అత్యవసరంగా శస్త్రచికిత్స చేయవలసిన రోగికి అవసరమైన రక్తం కావలసి వచ్చి, సదరు వ్యక్తి హాస్పటల్‌కి వెళ్ళి తనంత తానుగా హాస్పటల్ మంచం ఎక్కి రక్తం ఇచ్చి కాసేపు హాస్పటల్ బెడ్‌మీద ఉండి అక్కడివారిచే కొద్ది వైద్యసేవలు పొంది తిరిగి ఇంటికి వెళ్ళిపోవచ్చు.

11) ఐతే, రెండవ విషయానికి మన ప్రారబ్ధం అని బాధ ఉండదు. పైగా ఉత్సాహం, ఆనందమూ కలగవచ్చు, కానీ ఇదీ ప్రారబ్ధమే అని గుర్తించం.

12) మొదటి విషయంలోనే ప్రారబ్ధం అనుకుంటాం. ఎందుకంటే అది ఎక్కువ బాధ. అసలు ప్రారబ్ధమంతా ఈ జీవితాన్ని పొందటమే. రమణులు చెప్పినట్లు ఇదే ఒక పుండు, దీనికి పుళ్ళూ పుట్టచ్చు, నొప్పి వేయవచ్చు, కండూతితో

సుఖమూ అనిపించవచ్చు. జీవితంలోని విషయాలను పరిశీలిస్తే జాగ్రత్తగా ఈ విధంగా అన్వయమవుతాయి ఒకసారి తరచి చూసుకుంటే.

13) త్రిపుర రహస్యంలో దత్తాత్రేయులవారు పరశురాములవారికి జ్ఞానబోధ చేయునపుడు "ప్రారబ్ధం అనునది సంకల్ప వికల్ప క్రియలో తత్ క్షణం లభించే ఫలితమే" అని చెప్పారు.

14) సంకల్పం చేయగానే అది వికల్పం కావటానికి తత్ క్షణమే కావచ్చు లేదా ఆ జీవి జీవితకాలం పట్టవచ్చు.

15) శ్రీ రామకృష్ణపరమహంసల వారు ప్రారబ్ధంవల్ల గొడ్డలితో నరకబడు స్థితి కలిగితే అమ్మవారి దయతో గోటితో పోతుందన్నారు. శ్రీ రమణులు కూడా ఈ 35వ చరణంలో ఆ దయా విశేషాన్ని చెప్పారు.



## 36

**చెప్పక చెప్పి నీవు మౌనత నుండని**
**యూరక యుందువే అరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! పరమశివా! నువ్వు చెప్పకుండానే చెబుతున్నావు. మాట్లాడకుండా మౌనంగా ఉంటున్నావు. నీవు నిశ్శబ్దముగా ఉంటున్నావు.

**విశేషాలు**

1) అరుణాచలాధీశుడు తనకు మౌనదీక్ష అనుగ్రహించాడని, మౌనం ద్వారా తన ఉపదేశాన్ని అనుగ్రహించాడని ఈ చరణంలోని ఆంతర్యం.

2) కేవలం మాట్లాడకపోవడమే మౌనము కాదు – మనస్సులో నిరర్థకమైన ఆలోచనలు లేకుండా ఉండటం కూడా మౌనమే.

3) మనకి ప్రపంచంతో సంబంధాలని కలిగించే మనస్సు ఆత్మలో అణగిపోతే శాంతి సాధకునికి కలుగుతుంది.

4) సనకుడు మొదలైన శిష్యులకు శ్రీ దక్షిణామూర్తి అనుగ్రహించిన మౌన ఉపదేశాన్ని రమణ మహర్షి ఈ చరణంలో ప్రస్తావించారు.

5) ఒకసారి మౌనాన్ని గురించి రమణులకి, భక్తునికి మధ్య సంభాషణ ఇలా జరిగింది.

6) భక్తుడు: మౌనమనగా ఏమి?

7) మహర్షి: తలపులు లేని స్థితియే మౌనము. అదియే మౌనముతో కూడిన ధ్యానము. మౌనముతో కూడిన నిశ్చల ధ్యానమే నిరంతర వాగ్ధాటి.

8) భక్తుడు: అటులైన మన భావనలను ఇతరులకు తెలియచేయుట ఎట్లు?

9) మహర్షి: ద్వంద్వాలను చూచునంతవరకు సంభాషణ అవసరము. ద్వంద్వాతీత స్థితిలో మౌనమే సంభాషణ.

10) భక్తుడు: రమణులు బయటకు వెళ్ళి ప్రపంచానికి సత్యమును ఎందుకు బోధించరు?

11) మహర్షి: నేను చేయుట లేదని ఎట్లు అనెదవు? వేదికపైన కూర్చుని ఉపన్యసించుటయే సత్యమును బోధించుటయా? బోధన మౌనమునందు మాత్రమే జరుగును. గంటలకొద్దీ ప్రవచనము విని బయటకు వెడలునంతనే విస్మరించుటకన్నను, పవిత్ర సన్నిధియందు కొద్దిసేపుండి, పొందిన అనుభూతి ద్వారా జీవితంపట్ల అవగాహన మార్చుకొనుట మంచిది. ఈ రెంటియందు ఏది మంచిది? ప్రసంగముల ద్వారా తెలియచేయుటయా లేక మౌనమునందే అంతశ్శక్తిని ప్రసరింపచేయుటయా?

12) మౌనబోధన గొప్పదని రమణులు పై సంభాషణ ద్వారా తెలియచేసారు.

13) 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' అని పరబ్రహ్మ వస్తువును గురించి శ్రుతి చెబుతున్నది.

14) బ్రహ్మ వస్తువును మనసుతో పొందటానికి వీలులేదు.

15) అంటే అక్కడ పదములు భాష, వాక్యములు దానిని నిర్దేశించలేవు. వాటికా శక్తి లేదు.

16) మౌనధ్యానమొక్కటే శరణ్యం. రమణ మహర్షి ఈ చరణంలో అదే ప్రబోధించారు.



## 37

**సోమరినైతిని మిన్నని సుఖ నిద్ర**
**కన్న వేరేది గతి అరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలేశ్వరా! శివా! నేను సోమరినయ్యాను. ఏవో వినోదాలతో, కాలాన్ని ఖర్చు చేస్తూ సుఖంగా నిద్రపోతూ నా కాలాన్ని గడుపుతున్నాను. నాకు అంతిమ లక్ష్యమయిన ఆత్మజ్ఞానాన్ని గ్రహించటం లేదు. నాకు నువ్వు తప్పించి ఇంకొక గతిలేదు.

**విశేషాలు**

అన్నీ దేవుడే నడిపిస్తాడు కదా! మనమేమి చేయకుండాలి. సోమరిగా ఉండవచ్చు కదా! ఈశ్వర ఆజ్ఞ లేనిదే చీమయిన కుట్టదంటారే. అన్నీ ప్రారబ్ధం ప్రకారం జరుగుతుందంటారు కదా, మరి ప్రత్యేకంగా ఈ దుర్గుణాలు, దురభ్యాసాలూ పోగొట్టుకోవాలనటం ఎందుకు? అన్న సందేహానికి శ్రీ రమణులు ఒకసారి ఇలా జవాబిచ్చారు.

శరీరం వుంది, దానికెక్కడో ఒక వ్రణం పుడుతుందనుకో, డాక్టరు వచ్చి, కత్తితో ఆ భాగం కోసి, చెడు రక్తం తీసివేసి, మంచి రక్తానికి రక్షణగా కట్టుకట్టడం లేదా? అట్లాగే యిదీనూ! ఆ వ్రణం కోయకుండా వదిలితే, లోపలంతా కుళ్ళు తుంది. కోసిన వెనుక కట్టు కట్టకుంటే చీము పడుతుంది. మానవుని నడవడికలోనూ అంతే.

దుర్గుణాలు, దురభ్యాసాలూ వ్రణం లాంటివి. కోసివేయకుంటే అథః పతితుడౌతాడు. ఏ వ్యాధికి ఆ చికిత్స చేయాలి. ఆధ్యాత్మిక సాధనలో దైవాన్ని నమ్ముకోవాలి. మన ప్రయత్నం మానకూడదు. సోమరితనాన్ని వీడాలి. ఇది రమణుల సందేశం.

సోమరితనాన్ని కూడదని శ్రీరమణులు వివరించిన కథ ఇది –

ఒక పిచ్చుక గ్రుడ్డు సముద్రంలో జారి పడిపోయింది. ఆ గ్రుడ్డును బయటికి తీసి రక్షించాలని పట్టుదలతో సముద్రంలో నీళ్ళన్నీ బయట పోస్తానని, విసుగు విరామం లేకుండా సముద్రంలో మునిగి, ముక్కుతో నీరు పీల్చి ఒడ్డుకు వచ్చి

రెక్కలతో విదిలించడం చేస్తోంది తల్లి పిచ్చుక. నారదులవారు ఇది చూసారు. “వెఱ్ఱిపిచ్చుకా! నీకిది సాధ్యమా?” అని అడిగారు.

“సాధ్యమా? అసాధ్యమా? అన్న చింత నాకు లేదు, పట్టుదలతో ప్రయత్నిస్తాను, పైన దేవుడున్నాడు” అని ఆ పిచ్చుక జవాబు. నారదుడు చాలా ఆనందించి, గరుడుని వద్దకు వెళ్ళి విషయం చెప్పాడు. గరుడుడు పరుగు పరుగున వచ్చి రెండు రెక్కలతో ఒక్కసారి విసిరాడు. నీరంతా రెండు పాయలై చెదిరి గ్రుడ్డు బయటపడింది. పిచ్చుక ఆనందంతో ఆ గ్రుడ్డును తీసుకుందట.

అదేవిధంగా ఆత్మచింతన కలవారూ, సోమరిపోతులు కాకూడదు. ఈ పని పెద్దదే, మనము ఈ పని చేయగలమా?! అని సందేహపడకూడదు. మనం శ్రద్ధతో చేస్తుంటే దైవానుగ్రహం అదే లభిస్తుంది. ఈ చరణంలోని అంతరార్థమిదే.



## 38

**శౌర్యము జూపితి శమియించెనని మాయ**
**చలియింపకున్నావు అరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! శివా! నీ జ్ఞాన పరాక్రమాన్ని చూపించావు. నా అజ్ఞానాన్ని, నా మాయను పోగొట్టావు. ప్రాపంచిక భ్రమలు పోగొట్టావు. నా హృదయంలో ఎటువంటి కదలిక లేకుండా స్థిరంగా ఉన్నావు.

**విశేషాలు**

జీవకోటి యాత్రలో ఒక చోట అడ్డంగా ఒక గీత పెడతారట. అరుణాచల ప్రవేశమునకు ముందు జీవితము ఆ గీతకు ఒకవైపు, అరుణాచల ప్రవేశము తర్వాత జీవి జీవితం గీతకు మరొక వైపు. అరుణాచలములోకి ప్రవేశించాలంటే ఈశ్వరుని దయ కావాలి. ఆ దయని పొందిన జీవుని స్థితిని రమణులు ఇందులో వర్ణించారు.



## 39

**కుక్కకు న్నీచమే నే నే గురుతుగొని**
**వెదకి నిన్జేరుదు నరుణాచలా!**

**తాత్పర్యము**

ఓ అరుణాచలా! నేను కుక్క కన్నా తక్కువవాడినా? కుక్క తన ఆహారాన్ని వాసనతో కనుగొంటుంది. అలాగే నా ఉనికికి ఆధారమైన నిన్ను నేను కూడ వెతికి వెతికి చేరుతాను. ('నేను' అనే ఆలోచన మూలాన్ని వెతికి వెతికి, దానిని చేరి, ఆత్మలో లీనమవుతానని తాత్పర్యం)

**విశేషాలు**

కోతి, కుక్క, నెమలి మొదలైన జంతువుల్ని మీరు అని గౌరవంగా సంబోధించి ప్రేమించేవారు రమణులు. మహర్షి శరీర త్యాగము చేసిన గదితో పాటు స్వామి స్పర్శదీక్షతో ముక్తి పొందిన గోవు లక్ష్మి సమాధి, కుక్క (జాకీ), కాకి, జింక (వల్లి)ల సమాధులు కూడా రమణాశ్రమ సన్నిహితంగా ఉన్నాయి.



## 40

**జ్ఞానము లేక యాన దైన్యము బాప**
**జ్ఞానము తెలిపి బ్రో నరుణాచలా!**

**తాత్పర్యము**

ఓ అరుణాచలా! ఓ పరమశివా! నాకు జ్ఞానము లేదు. కాని నిన్ను వెతకాలని, చూడాలని నాకు తపన మాత్రం ఉంది. అంతా నీ ఆజ్ఞ. నీలో ఐక్యం పొందాలని ఈ దీనుని కోరిక. ఈ దైన్యాన్ని పోగొట్టవయ్యా! అసలైన జ్ఞానము (మాయ తొలగితే వచ్చే జీవుడు, దేవుడు ఒకటే అనే స్థిరబుద్ధి.) తెలిపి నన్ను రక్షించు.

**విశేషాలు**

మనిషికి కలలో ఏవేవో కనిపిస్తాయి. నిద్రలో అదంతా నిజంగానే ఉంటుంది. మేలుకొన్న తర్వాత అదంతా కల అని తెలుస్తుంది. అలాగే జ్ఞానము కలిగినప్పుడు

ప్రపంచం కల అనిపిస్తుంది. ఇదంతా ఒక కల అని తెలుసుకుంటావు. జాగ్రదావస్థ ఉన్నంత వరకు ఈ జగత్తు, జీవం, ఈశ్వరం అన్నీ సత్యమనుకొంటాం. ఈ అవస్థలు దాటి, తురీయావస్థకు వస్తే గాని ఇవన్నీ నిజము కావని ఒక ఆత్మ మాత్రమే సత్యమని తెలుస్తుంది. ఈ జ్ఞానము కలిగించమని ఈ చరణంలో రమణుల కోరిక.



## 41

**తేటి వలెను నీవు వికసింపలేదని**

**యెదుట నిలుతువేల యరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! పరమశివా! సూర్యుడు తామరమొగ్గ ఎదుట నిలబడి అన్నాడట “ఈ మొగ్గ ఇంకా వికసించలేదు” అని.

వికసింపకపోవటం ఆ మొగ్గ తప్పా?

తేనెటీగ అన్నదట “ఈ పువ్వు ఇంకా వికసించలేదేమిటి?” అని.

అది మొగ్గ తప్పా?

నువ్వు సూర్యుడివి. నా హృదయ పద్మాన్ని వికసింపచేయుట నీ బాధ్యత. నాకు జ్ఞానము కలిగించుట నీ బాధ్యత.

**విశేషాలు**

రమణులు ఒకసారి ఇలా చెప్పారు.

‘హృత్–అయం’ అంటే ‘ఇది కేంద్రం’ అని అర్థం. ఇక్కడనుండే అన్ని భావాలు ఉదయించి, దానిమీదే ఆధారపడి, దానిలోనే లయమైపోతాయి. మనస్సు భావాల సమూహం. భావాలే ప్రపంచానికి రూపాన్నిచ్చాయి. బ్రహ్మం నుండే జీవులన్నీ ఉద్భవిస్తాయని ఉపనిషత్తులు చెప్తాయి. అదే హృదయం. బ్రహ్మమే హృదయం. ఆ హృదయాన్ని తన నిలయంగా చేసుకొమ్మని రమణుల నివేదన ఈ చరణంలో కనబడుతుంది.

'సర్వజ్ఞతా తృప్తి రనాది బోధః స్వతంత్రతా నిత్యమలుప్త శక్తిః
అనంత శక్తిశ్చ విభోర్విధిజ్ఞాత షడాహురంగాని మహేశ్వరస్య' అంది శాస్త్రం.

కొన్ని విషయములను కన్ను చూసినా, మనస్సు వాటిని పట్టుకోదు. మనం ఒకచోట కూర్చుని కంటితో అన్నిటినీ చూస్తున్నా అలా చూస్తున్నవాటిలో కొన్నిటిని మాత్రమే గుర్తుపెట్టుకోగలము. కానీ ఈశ్వరుడు అలా కాదు.

మహేశ్వరుడు సమస్త ప్రాణుల హృదయగతమయిన అభిప్రాయములను కూడా తెలుసుకోగలడు. మీ మనస్సును ఈశ్వరుని పాదముల మీద పెట్టగలిగితే ఈశ్వరుడు మీ వెంట పరుగెడతాడు. మీ మనస్సు అక్కడ పెట్టడానికి మీరు చేస్తున్న పరిశ్రమకు 'పూజ' అని పేరు. అలా భగవంతునియందు మనస్సును కేంద్రీకరించి పూజ చేయడం అలవాటు చేసుకోవాలి. అది అలవాటు అయితే మీరు ఏ ప్రదేశంలో వున్నా పూజ చేసుకోగలుగుతారు. కాబట్టి పరమేశ్వరుడు హృదయగతాభిప్రాయమును పట్టగలిగినవాడు. దీనికే సర్వజ్ఞత అంటారు.

సర్వజ్ఞత, స్వతంత్రత అనేవి రెండూ ఈశ్వరుడితో ముడిపడి ఉంటాయి. ఏకకాలమునందు సమస్త చరాచర జగత్తులో ఉన్న ప్రాణుల హృదయాంతర్గత భాగములను తాను చూస్తాడు. చూసి ఆ భావముల పరిపుష్టి చేత మోక్షమును కూడా అనుగ్రహిస్తాడు. (చాగంటివారు)

ఆ శివానుగ్రహం కోసం ఆవేదన ఈ చరణంలో కనబడుతుంది.



## 42

**తత్త్వమెరుగజాల నంతయై నిలుతునే**

**ఇది ఏమి తత్త్వమో యరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! ఓ పరమశివా! నేను ఏ ఆధ్యాత్మిక గ్రంథాలనూ చదవలేదు. ఏ తత్త్వము తెలియదు. ఎవరి దగ్గరా నేర్చుకోలేదు. అయినా దయ వల్ల 'తత్త్వమ్' (నీవు అదే), 'తత్త్వమసి' (ద్వయీ తాత్పర్యం లేదు) అను రెండు ఆధ్యాత్మిక సత్యాలు నాకు తెలిసాయి. ఇది ఏమి తత్త్వమయ్యా!

**విశేషాలు**

1) మౌలికమైన, సారమైన విషయము. దేనిమీద ఇతర సత్యములు ఆధారపడి యుండునో అట్టి మౌలిక సత్యము లేదా దేనినుండి ఇతర సత్యము లుత్పన్నములగునో అట్టి మౌలిక సత్యమును తత్వమంటారు (Principle).

2) సామవేదానికి చెందిన ఈ తత్వమసి మహావాక్యం చాందోగ్యోపనిషత్తులో ఉంది. 1. అహం బ్రహ్మోస్మి, 2. ప్రజ్ఞానం బ్రహ్మ, 3. అయమాత్మా బ్రహ్మ, 4. తత్త్వమసి అను నాలుగింటిలో ఒకటి ఈ తత్వమసి.

3) అందులో 'తత్త్వమసి', 'అహమ్ బ్రహ్మోస్మి' ఈ రెండూ చాలా ప్రధానంగా భావిస్తారు వేదాంతులు. ఎంచేతనంటే తత్త్వమసి అనేది ఉపదేశవాక్యము, అహమ్ బ్రహ్మోస్మి అనేది అనుభవ వాక్యం. కాబట్టి ఇవి రెండే వేదాంత శాస్త్రానికంతటికీ ప్రతినిధి రూపమైన వాక్యాలు.

4) తత్త్వమసి అనే వాక్యం మూడింటి సంపుటీకరణం. అందులో తత్–త్వమ్–అసి అని మూడే మూడు మాటలున్నాయి. తత్ అంటే అది – త్వమ్ అంటే నీవు – అసి అంటే అవుతున్నావని అర్థం.

5) శ్రీ చాగంటివారు తమ ఉపన్యాసములో రమణుల తత్వాన్ని గురించి చెప్పిన విషయాలు ఈ సందర్భంలో జ్ఞాపకం చేసుకుందాం.

6) భగవాన్ రమణులు ఎప్పుడూ నా ఆశ్రమం అని అనేవారు కాదు, నా ఆశ్రమమేమిటీ? భక్తుల ఆశ్రమం. నేను అందులో ఉన్నాను అనేవారాయన. గంట కొడితే వెళ్ళి కూర్చునేవారు భోజనానికి తప్పా, ఆయన వెళ్ళి భోజనం చేయడం అలాంటివేమీ ఉండేవి కావు. బ్రహ్మజ్ఞాని బ్రహ్మజ్ఞానే.

7) ఒకసారి ఆయన తలుపులు గడివేసుకుని లోపల ఉన్నారు. అంతేవాసులు లోపల పడుకున్నారు. ఆయనకి మంచాలు, కుంచాలు లేవు. కటికనేల చాపమీద పడుకుంటారు. పడుకుంటే దొంగలొచ్చారు. లోపల ఏమైనా ఉన్నాయోమోనని వాళ్ళు తలుపు కొట్టారు. తలుపు కొడితే కిటికిలోంచి చూసి రమణులు అన్నారూ 'ఎవరు మీరు?' అని.

8) 'మేము దొంగలం' అన్నారు. 'రండి స్వాగతం' అని తలుపు తీశారాయన, అంటే 'ఛీ ఛీ ఛీ మాకు జాబ్ స్యాటిస్ఫాక్షన్ ఉండదు. ఆ తలుపు వేసేసి

దొంగలు దొంగలు అని అరు. మేము తలుపులు బద్దలు కొట్టుకుని లోపలికి వస్తాం.'

9) రమణులు అన్నారు 'వద్దు, ఎందుకలాగా? నేనేం అరవను. మీరు ఈశ్వరులు. మీకేమైనా కావాలా? ఇదిగో ఇవి ఉన్నాయి మా దగ్గర, మీకేమైనా కావాలంటే తీసుకోండి' అన్నారు. అంటే వాళ్ళన్నారు 'బుద్ధిహీనుడా! పిచ్చాడివా ఏంటీ? అరవాలి దొంగలు దొంగలని, అంతేగాని తీసుకోమంటావేమిటీ తలుపేసుకో' అన్నారు. అంటే పోనీ మీకేమైనా తృప్తి అన్నారు, అలాగే వేసుకుంటాను రండి అన్నారు. వాళ్ళు తలుపులు బద్దలు కొట్టేసుకుని వచ్చారు, పారిపో అన్నారు. ఎందుకన్నారాయన. 'పారిపోవాలి దొంగలని చూస్తే' అన్నారు. నేను అలా పారిపోను. నాకు ఈశ్వరుడు కనపడుతున్నాడు మీలో. మిమ్మల్ని చూస్తూ నిల్చుంటాను అన్నారు.

10) 'బుద్దుందా లేదా? నీవు పారిపో అప్పుడు మేము ఎత్తుకుపోతాము' అన్నారు. 'మాకు దొంగతనం చేసిన తృప్తి ఉంటుంది. మేము ఏదైనా పట్టుకెళ్తే మామూలుగా పట్టుకెళ్ళకూడదు, కష్టపడి దొంగతనం చేశామన్న తృప్తి మాకుండాలి, అందుకని పారిపో' అన్నారు, అంటే 'మీ తృప్తికి వెళ్ళిపొమ్మంటే వెళ్ళిపోతా' అన్నారు రమణులు. అలా పారిపోవడాలు నేనేం చేయను అని ఆయన వెళ్ళిపోయారు. పారిపోతున్నవాళ్ళని కొట్టి తీసుకోకపోతే మాకు సంతోషం కలుగదు అందుకని ఓ దుడ్డుకర్ర తీసి నడుస్తున్నటువంటి రమణుల యొక్క కాళ్ళమీద కొట్టారు. కొడితే ఇంతంత బొబ్బలు వచ్చాయి రమణుల కాళ్ళమీద. ఆయన నవ్వుతూ ఆ దెబ్బలు తింటూ వెళ్ళి కూర్చున్నారు అరుగుమీద.

11) ఏముంటాయండీ ఆ గదిలో! అందులో చాప అవీనూ.. 'ఛీ ఛీ మరీ ఇంత అన్యాయమేమి'టని వెళ్ళిపోయారు దొంగలు. పైగా తృప్తి కూడా లేదు. ఏమిటో ఈ మనిషి కూడా పిచ్చాడిలాగని వెళ్ళిపోయారు ఆ దొంగలు. ఆ చుట్టూ ఉన్నవారు అన్నారూ "భగవాన్! ఊఁ.. అనండీ చావగొట్టేస్తాం వాళ్ళని. మిమ్మల్ని కొట్టడమా? ఇంతంత తట్లు తేలిపోయాయి కదండీ!" అన్నారు.

12) రమణులు "నాలుకా నాదే, పళ్ళూ నావే! అన్నం తినేటప్పుడు నా నాలుక నా పళ్ళకింద పడితే నా పళ్ళు పీకేసుకోనా?" అన్నారట. "అబ్బెబ్బే! ఎలా పీకేసుకుంటారు? మన పళ్ళు కదా! అందుకు ఓర్చుకోవడమే!" అన్నారు. "ఆ సర్వేశ్వరుడే దొంగరూపంలో వచ్చాడు. ఆ సర్వేశ్వరుడే నాకు ఈ బహుమానం ఇచ్చాడు. మీరు పూలు తెచ్చి వేసినప్పుడు ఎంత తృప్తో వాళ్ళు కర్రలు పెట్టి కొట్టినప్పుడూ అంతే తృప్తి" అన్నారు.

13) రమణులు బ్రహ్మజ్ఞాని కదాండీ. స్థితిని చేరడం అంత సామాన్యమైన విషయమేం కాదు. అది నోటితో చెప్పినంత తేలికకాదు. అది ద్వంద్వాతీత స్థితినుండి అంతటా బ్రహ్మమునే చూడగలగటం. 'నమః చోరాయ చ' (నమకం) గురించి నీవు ఆలోచిస్తూ 'ఈశ్వరా! నీవు దొంగలాగా కూడా వుంటావయ్యా!' అని అనుకుంటూ అభిషేకం చేసి చేసి చేసి అంతటా ఆ బ్రహ్మమునే చూసి రమించిపోయేటటువంటివాళ్ళ ఆనందం వేరుగా వుంటుంది. వాళ్ళ స్థితి మీకు ఆ కన్నులలో కనపడుతుంది.

14) ఈ రమణులు చెప్పిన తత్వం ఈ 'అక్షర మణమాల'లోని 42లో కనబడుతుంది.



## 43

**తా నేను దానను తత్త్వ మిద్దానిని**
**తానుగా జూపింతు వరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! ఓ పరమశివా! తాను అను తానే తత్వార్థం. దీనిని తానే అయిన నువ్వు చూపించు. దర్శింపచేయ మనవి.

**వివరణ**

"ఓ శివా! నువ్వు స్వయంప్రకాశుడివి. నీవు ఏకము, నీవు పరమాత్ముడవు, ఈ విశ్వమంతా నీ వ్యక్త రూపమే కదా! ఈ పరమ సత్యం నాకు అనుభవసిద్ధ మయ్యేటట్టు అనుగ్రహించు"మని 'తాను' అను పదమును పదే పదే ప్రయోగించుట ద్వారా భక్తుడు శివుని ప్రార్థిస్తున్నాడు.

"పరమాత్మ తెలియబడకుండటంగాని, అప్రాప్తంగా ఉండటం గాని ఎప్పుడూ లేదు. ఎందుకంటే, అతను ఏకమై ఉన్నాడు. ఆత్మతో సమానమై ఉన్నాడు. ఆయన అనుగ్రహం, ఆయన దివ్యసాన్నిధ్యంతో సమానం. దీనినే జ్ఞానప్రాప్తి అంటారు. నీవు సూర్యకాంతిలో ఉన్నా, సూర్యుణ్ణి తెలుసుకోగోరితే నీ కళ్ళను సూర్యుని దిశగా మరలించి చూడాలి. అలాగే దైవానుగ్రహం ఇప్పటికిప్పుడు ఉన్నప్పటికీ, స్వప్రయత్నం ద్వారానే తెలుసుకోవాలి. అలాగే, ఒక అజ్ఞానికి నిత్యం స్వయం ప్రకాశమానమై ఉన్న ఆత్మ తెలియకుంటే ఆ దోషం ఆత్మదా లేక ఆ అజ్ఞానిదా? అంటే సూర్యుణ్ణి గుడ్లగూబ చూడజాలకుంటే అది సూర్యుడి తప్పా లేక ఆ పక్షియొక్క దృష్టి లోపమా?" అని రమణులు బోధించారు.

భగవంతునికి ఆకారం లేదు. అయినా భక్తులకోసం సగుణరూపంలో వ్యక్తమవుతాడు. భగవంతుడు సంగం లేనివాడు. కాని భక్తులకు తత్వం బోధపడడానికి సంబంధాన్ని కల్పించుకుంటాడు. సర్వం తానే అయినా తనకేమీ పట్టనట్టు ఉంటాడు. అన్నీ తనవేనన్న భ్రమ భక్తులకు కల్పిస్తాడు. మళ్ళీ ఆ భగవంతుడే తన భక్తుల కన్నీళ్లకు కష్టాలకు కరిగిపోతాడు. తనను తాను భక్తుడు కోరుకున్న విధంగా కనబడతాడు. ఇదీ అంతా భగవంతుని చిద్విలాసం. రమణులు ఈ చరణంలో చెప్పినదిదే.



## 44

**త్రిప్పి యహంతను నెప్పుడు లోదృష్టి**
**గన తెలియుననునదే యరుణాచలా!**

**తాత్పర్యము**

ఓ అరుణాచలా! "మనస్సును అంతర్ముఖము చేసి నీలో ఉన్న ఆత్మ కొరకు వెతుకు. 'నేనెవరు?' అను విచారము ద్వారానే ఆత్మని తెలుసుకోవచ్చు" అని చెప్పావు.

**విశేషాలు**

1. ఎవరయినా ఆత్మసాక్షాత్కారాన్ని పొందాలంటే లౌకిక విషయాల పట్ల వైరాగ్యంతో ఆత్మ విచారము చేయాలి.

2. 'నేనెవరను?' అని నిరంతరం ఆలోచిస్తుంటే ఆత్మానుభవం సాధ్యమవుతుందని రమణుల బోధ.
3. ఆలోచన వచ్చేటపుడు దాన్ని గెంటి వెయ్యాలి.
4. నేతి, నేతి – ఈ ఆలోచన కాదు, ఈ ఆలోచన కాదు. ఈ ఆలోచన నాకు వద్దు అనుకొంటూ ఉండాలి.
5. అసహ్యం, భయంలాంటి ప్రతిపక్ష భావనలు వస్తే వాటిని వ్యతిరేకమైన భావనలతో అంటే ప్రేమతో అసహ్యాన్ని, ధైర్యంతో భయాన్ని దాటాలి.
6. ఉదాసీన తాత్పర్యంతో మనస్సుకు సాక్షిగా ఉండు.
7. ఇలా నేనెవరను అని విచారణ చెయ్యడం వల్ల ఆలోచనలన్నీ నశిస్తాయి. చివరకు మనస్సు మిగలదు.
8. మనస్సు నశించటమే మోక్షానికి దారితీస్తుంది.
9. వరుణ మహర్షి కొడుకు భృగువు. అతనికి ఆత్మానుభవం పొందాలని ఆకాంక్ష కలిగింది.
10. తండ్రి ఐన వరుణ మహర్షి వేదవేదాంగాలు అభ్యసించిన జ్ఞాని. అందుకని తండ్రి దగ్గరికే వెళ్ళి నాన్నగారూ! నేను బ్రహ్మజ్ఞానాన్ని తెలుసుకోవాలన్న కాంక్షతో ఉన్నాను. దయతో నాకు బ్రహ్మోపదేశం చేయండి అని వేడుకున్నాడు.
11. కొడుకు జ్ఞానతృష్ణకు సంతోషించిన తండ్రి మన శరీర మనస్సులు, ప్రాణశక్తి అన్నీ బ్రహ్మజ్ఞానానికి ఆధారాలే. సృష్టి స్థితిలయములకు కారణమైన మూలాధారం ఏది ఉందో దాన్ని తపస్సు ద్వారా తెలుసుకోవచ్చు. అందువల్ల తపస్సు చేయి అన్నాడు.
12. భృగువు నియమనిష్ఠలతో, తదేక దీక్షతో తపస్సు చేశాడు.
13. మొదట అతను తపస్సు ద్వారా గ్రహించింది అన్నమే అన్నిటికీ ఆధారమని, అందుకనే అన్నం పరబ్రహ్మమన్నాడు. తన అనుభవాన్ని తండ్రికి వివరించాడు.
14. వరుణమహర్షి నిజమే కానీ అది పరబ్రహ్మ స్థూల స్వరూపం. అది సమగ్రం కాదు, సర్వస్వం కాదు. నీకు ఉపరితలమే పరిచయమైంది. ఛాయామాత్రంగా

నువ్వు సత్యాన్ని అందుకున్నావు. మళ్లీ తపస్సు చేసి మౌలిక సత్యాన్ని గ్రహించు అన్నాడు.

15. భృగువు పట్టుదలతో మళ్లీ తపస్సు చేశాడు.

16. అప్పుడు అతనికి అన్నిటికీ మూలమైంది ప్రాణమే అని గ్రహించాడు. ప్రాణశక్తి లేకుంటే సమస్త శక్తి నిర్వీర్యమవుతుంది. ప్రాణులు చలనం లేనివవుతాయి. కాబట్టి సమస్త సృష్టికి ప్రాణమే ఆధారమని నిర్ణయించుకుని తను గ్రహించిన సత్యాన్ని తండ్రికి విన్నవించాడు.

17. వరుణ మహర్షి కొడుకు చెప్పింది విన్నాడు. ఏమీ మాట్లాడకుండా బదులివ్వకుండా నువ్వింకా అసలు సత్యాన్ని సమీపించలేదు. ఏకాగ్రతగా మళ్లీ ధ్యానం చేయి. ఆ తపశ్శక్తి వల్ల నీకు అంతిమ సత్యం అందివస్తుంది. అన్నాడు.

18. తండ్రి అజ్ఞానుసారం భృగువు మళ్లీ తపస్సులో మునిగాడు.

19. ఈసారి మనస్సే బ్రహ్మమని తెలుసుకున్నాడు. అన్ని భావనలకూ మనసే కేంద్రం, అన్నీ దాంట్లోంచే ఉద్భవిస్తాయి. కాబట్టి సృష్టికి ఆధారం మనసే అని నిశ్చయించుకున్నాడు. తన అనుభవాన్ని తండ్రికి వివరించాడు.

20. వరుణ మహర్షి నీలో సత్యాన్వేషణ ఉంది. కానీ అదింకా సమగ్రం కాలేదు. పరిపూర్ణం కాలేదు. కాబట్టి నీ తపస్సును కొనసాగించు అన్నాడు.

21. సహనంతో భృగువు మళ్లీ తపోముగ్ధుడయ్యాడు. సత్యాన్వేషికి సహనమే ఆయుధం. ప్రశాంతచిత్తంతో ధ్యానమగ్నులైన వాళ్లకు పరమాత్మ దర్శన మవుతుంది. దానికి కాలనియమం లేదు.

22. మళ్లీ తపస్సు చేసినప్పుడు భృగువుకు విజ్ఞానమే బ్రహ్మమని అనిపించింది. తన భావాన్ని తండ్రికి నివేదించాడు.

23. వరుణ మహర్షి నువ్వు దారి తప్పలేదు. కానీ దారిలో తటస్థమైనవన్నీ దారికి ఆధారాలుగా భావిస్తున్నావు. నీ ప్రయాణాన్ని కొనసాగించు అన్నాడు.

24. భృగువు మళ్లీ తపస్సులో మునిగాడు. నిర్మల ప్రయత్నాన్ని నిర్విఘ్నంగా కొనసాగించాడు.

25. ఆ తపస్సు ఫలితంగా అతను ఆనందమే బ్రహ్మ అని గుర్తించాడు. ఆనందమే అనంత సృష్టి సారమని గ్రహించాడు. ఈ అనంత విశ్వం ఆనందంతో సాగుతోందని తెలుసుకున్నాడు. ఆనందంలోనే ప్రతిదీ పుట్టి, ఆనందంలో ప్రతిదీ జీవించి, ఆనందంలోనే ప్రతిదీ లయమవుతోందని గ్రహించాడు.

26. తన అపూర్వ అనుభవాన్ని తండ్రికి వివరించాడు. తండ్రి కొడుకు మాటలు విని బ్రహ్మానందపరవశుడయ్యాడు. సుదీర్ఘ ప్రయత్నంలో తన కొడుకు సత్యాన్ని గ్రహించినందుకు ఆనందించాడు.

27. పరమాత్మ తత్వాన్ని అన్నిటికన్నా గొప్పగా ఆవిష్కరించేది ఆనందం. అన్నం, ప్రాణం, మనసు, విజ్ఞానం, ఇవన్నీ బ్రహ్మస్వరూపమైనవే. ఇవి ఒక దానికంటే ఒకటి సూక్ష్మమైనవి. వీటన్నిటి కన్నా అత్యుత్తమమైనది ఆనందం. కానీ ఇక్కడ దేన్నీ తక్కువ చేయకూడదు. బ్రహ్మను అందుకోవడానికి ఇవి సోపానాలు. అన్నాన్ని, ప్రాణాన్ని, మనస్సును పరస్పరాధారాలుగా భావించాలి. వాటిగుండా విజ్ఞానానుభవమవుతుంది. అవన్నీ కలిసి ఆనందంగా పర్యవసిస్తాయి అన్నాడు.(అంతర్జాల సౌజన్యం)

28. మన పురాణాల్లో చెప్పిన పై విషయాలు రమణ మహర్షి ఈ చరణంలో చెప్పిన 'నేను' అన్వేషణలో వచ్చినవి. స్వస్తి.



## 45

. **తీరముండని యెద వెదకియు నిన్ను నే**
**దిరిగి బొందితి బ్రోవు మరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! తీరము లేని హృదయము నాది. అందులో నీకోసం వెతికాను. నిన్ను పొందలేక తిరిగి వచ్చాను. నన్ను దయ చూడు.

**విశేషాలు**

1) "అరుణాచలా! నీకోసం వెతుకుతూ దూర దూర తీరాలకు వెళ్ళగల శక్తి నా మనస్సుకి లేదు. అందుకే నిన్ను నా హృదయకుహరములోనే చూద్దామని ప్రయత్నించాను. కాని ఓడిపోయాను. నాకుగా నేను ఏమి చేయలేనని

అర్థమైంది. ఏమీ సాధించలేను కనుక నీతో ఐక్యం పొందే మార్గాన్ని నీవే చూపి అనుగ్రహించమని రమణులు వేడుకొంటున్నాను" అని ఒక అంతరార్థం.

2) "అరుణాచలా! నువ్వు అంతటా వ్యాపించినవాడివి. నీకు తీరమంటూ ఏమీ లేదు. అందువలన నీకోసం అంతటా వెతికాను. నీ దర్శనం కాలేదు. కాని నా హృదయగుహలో నిన్ను వెతికాను. అక్కడ నీ దర్శనం దొరికింది. నీవు నా హృదయంలోనే ఉన్నావని నేను గ్రహించాను" అని రమణులు వ్రాసిన పై చరణంలో ఇంకొక అంతరార్థం.

3) "మనస్సు విజృంభించు చోటు శిరస్సే అయిననూ, అది పుట్టు చోటు హృదయమే అవుతుంది. అనగా, ఆత్మ తేజము నుండి ఒక రశ్మి బయలు వెడలి శీర్షస్థానమును చేరి మనస్సు అగుచున్నది. అది స్వస్థత చెందుట అనగా తన ఉత్పత్తి స్థానమును తిరిగి చేరిన స్థానమే ఆత్మ, అదియే హృదయము. మనస్సు యొక్క స్వరూపమును వెదకిన యెడల మనస్సు అన్నదియే లేదని తెలియును. అది ఆత్మ నుండి వచ్చిన ఒక రశ్మి" అని మనస్సును గురించి, హృదయమును గురించి రమణులు విశ్లేషించారు.

4) భగవంతుడు హృదయంలోనే ఉన్నాడని, అది అందరూ గ్రహించాలని ఈ చరణ సారాంశం.



## 46

**సత్య జ్ఞానము లేని యీ జన్మ ఫలమేమి**
**యొప్పగ రావేల యరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! పనికిమాలిన వ్యాపకాలతో కాలం గడిపేస్తే జన్మ వృధా అవుతుంది కదా! ఆత్మని అనుభవసిద్ధం చేసుకోలేని, సత్యపుటెరుక లేని ఈ జన్మ వృధా! అటువంటి ఈ జన్మను దేనితో పోల్చటానికి పనికిరాదు. అందువల్ల ఆత్మవిచారమార్గం ద్వారా ఆత్మని అనుభవసిద్ధం చేసుకొనే అర్హతను నాకు అనుగ్రహించు.

**విశేషాలు**

1) ఒకసారి భగవాన్ రమణ మహర్షి భక్తులలో ఒక భక్తుడి కొడుకు అకస్మాత్తుగా మరణించాడు. ఆ బాధను తీర్చగల సమర్థుడు రమణులే అని భావించి ఆయన వద్దకు ఆ భక్తుడు వచ్చారు.

2) రమణులు ఎప్పటిలాగా ఆత్మ గురించి విచారణ చేయమని, అసలు బాధ పడుతున్నది ఎవరో తెలుసుకోమని సమాధానం చెప్పారు. ఆ సమాధానంతో ఆ భక్తుడు తృప్తి చెందలేకపోతే దానికి సంబంధించిన ఒక కథను రమణులు ఇలా చెప్పారు.

3) రామ, కృష్ణ అనే ఇద్దరు యువకులు విదేశాలకు వెళ్ళి అక్కడ బాగా చదువుకుని డబ్బులు సంపాదిస్తామని వారి వారి తల్లిదండ్రులకు నచ్చజెప్పి విదేశానికి వెళ్ళారు.

4) కొంతకాలానికి వారిద్దరిలో ఒకడు మరణించగా, మరొకడు బాగా చదువుకుని, మంచి జీవనం గడుపుతున్నాడు.

5) విదేశాల్లో ఉండే వ్యాపారి తన స్వదేశానికి వెళ్తున్నాడని తెలుసుకుని, తాను ఇక్కడ మంచి జీవనం గడుపుతున్నానని తన తల్లిదండ్రులకు చెప్పమని, కృష్ణ అనే మిత్రుడు మరణించాడని అతని తల్లిదండ్రులకు చెప్పమని రామ ప్రార్థిస్తాడు.

6) అయితే పొరబాటుగా బ్రతికున్న రామ తల్లిదండ్రులకు తమ బిడ్డ మరణించాడని, చచ్చిపోయిన కృష్ణ తల్లిదండ్రులకు తమ పిల్లవాడు వున్నతమైన జీవనం గడుపుతున్నాడని ఆ వ్యాపారి తప్పుడు సమాచారం చేరవేస్తాడు.

7) జీవించి ఉన్న రామను తలుచుకొని అతని అమ్మానాన్నలు తమ బిడ్డ మరణించాడని తీవ్రంగా బాధ పడుతుంటారు.

8) మరణించిన కృష్ణ తల్లిదండ్రులు తమ పిల్లాడు ఎప్పటికైనా తిరిగి వస్తాడని సంతోషంగా కాలం గడుపుతుంటారు.

9) నిజానికి ఈ తల్లిదండ్రులు ఇద్దరూ తమ పిల్లలను చూడనేలేదు.

10) కాని ఒకరు సంతోషపడుతున్నారు,

11) ఒకరు అవేదన చెందుతున్నారు.

12) మనం కూడా అంతే.

13) మనం మన మనసు చెప్పినవన్నీ నమ్మేస్తాం.

14) అందుకే ఏది లేదో అదే ఉన్నదని, యదార్థానికి ఏది ఉన్నదో అదే లేదని భావిస్తాం.

15) మనం మనసు మాట వినకుండా, హృదయంలోనికి ప్రవేశించి అక్కడున్న పుత్రుని (ఆత్మ) చూసుకుంటే, ఇక బయట ప్రత్యేకంగా పిల్లలను చూసుకుని ఆనందించవలసిన అవసరం లేదు అన్నారు రమణ మహర్షి.



## 47

**శుద్ధ వాఙ్మన యుతులం దోచు నీ నిజా**
**హంత గల్పి నను బ్రోవరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! పరమశివా! నిర్మలమైన మనస్సూ, మాట కలిగినవారే నీలో కలువగలరు. నీ నిజస్వరూపాన్ని అనుభవించగలరు. అటువంటి ధన్య జీవులలో నన్ను కూడా ఒకడిని చేయవయ్యా!

**విశేషాలు**

1) మానవులమైన మనము ఎలా బతకాలో అన్ని పదాలకు చివర 'త' వచ్చునట్లుగా పెద్దలు తమాషాగా చెప్పారు.

- ఆలోచనలో పరిపక్వత
- మనస్సులో సంతుష్టత
- బుద్ధిలో పరిపక్వత
- సంస్కారములో శ్రేష్ఠత
- దృష్టిలో పవిత్రత
- మాటలలో మధురత

- కర్మలలో ప్రావీణ్యత
- సేవలో నమ్రత
- వ్యవహారములో సరళత
- స్నేహములో ఆత్మీయత
- ఆహారములో సాత్వికత
- జీవితములో సత్యత
- వ్యక్తిత్వములో రమణీయత
- నిద్రలో నిశ్చింతత

2) రామాయణంలో వాల్మీకి భరధ్వాజునితో ఇలా అంటాడు. "అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ! రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనో యథా!!" ఈ నీటిని చూశావా భరద్వాజా! బురద లేదు. రమణీయం ప్రసన్నాంబు - నీరు చూశావా! ఎంత రమణీయంగా ఉందో. ఎక్కడా మట్టి లేకుండా నిర్మలంగా చక్కగా స్వచ్ఛంగా ఉన్నాయి నీళ్ళు. మంచి మనిషి యొక్క మనస్సు ఎలా ఉంటుందో, ఈ నీళ్ల అలా ఉన్నాయి. పాపము లేని స్థితి అంటే ఏదో చెయ్యకూడని పని చెయ్యకుండా ఉండటము కాదు భగవంతుణ్ణి చేరుకొనే ప్రయత్నం చేస్తున్నప్పుడు మీకు అడ్డుగా వచ్చేది ఏదో దానికి పాపం అని పేరు. (చాగంటివారి ప్రసంగం)

3) ఈ నిర్మల మనస్తత్వాన్ని, త్రికరణశుద్ధిని అలవరచుకోవాలని రమణుల చరణం ప్రబోధిస్తోంది.



## 48

**దైవ మనుచు నిన్ను దరిజేరగా నన్ను**

**పూర్ణ నాశ మొనర్చి తరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! నిన్ను నా దేవుడని నమ్మి నీ వద్దకు చేరాను, నీ దగ్గరకు రాగానే నాలోని అహాన్ని పోగొట్టావు. నేను అనే భావాన్ని సంపూర్ణ నాశనము చేసావు. నన్ను నీలో కలుపుకొన్నావు.

**విశేషాలు**

1) ఒక రోజు భగవాన్ రమణమహర్షి తన ఆశ్రమంలోని వంటగదికి వెళ్ళారు. అక్కడ నేలమీద బియ్యపుగింజలు పడి ఉండడం చూశారు. ఆయన వెంటనే కింద కూర్చుని వాటిని ఒక్కొక్కటిగా ఏరడం మొదలుపెట్టారు. కాసేపటికి అక్కడికి ఆయన శిష్యులు వచ్చారు. తమ గురువుగారు నేలమీద కూర్చుని బియ్యం గింజలు ఏరుతుండడం చూసి విస్తుపోయారు.

2) ఆత్మజ్ఞానం కోసం ఇంటినీ, తల్లినీ, ఇతర బంధువులను విడిచిపెట్టి వచ్చిన రమణమహర్షి ఇలా బియ్యపుగింజల్ని ఏరడం ఏమిటా అని వాళ్ళలో వాళ్ళు చెవులు కొరుక్కున్నారు. ఉండబట్టలేక వారు ఆయనవద్దకు వెళ్ళి "స్వామీ, నేలమీద పడిపోయిన కొన్ని బియ్యపుగింజలకి ఇంత ప్రాధాన్యమివ్వాలా? మన ఆశ్రమంలో బియ్యపు బస్తాలకు ఏ మాత్రం కొరత లేదు కదా!" అని ఆయనను మెల్లిగా అడిగారు.

3) అప్పుడు ఆయన ఏం చెప్పారో చూడండి – "మీరు వీటిని ఉత్తి బియ్యపు గింజలుగా చూడటం సరికాదు. వీటి లోపల ఏమేమున్నాయో చూడగలగాలి. మీకెవ్వరికీ అన్నదాత శ్రమ కనిపించడం లేదా? సూర్యుడి వెలుగు కనిపించడం లేదా? హాయినిచ్చే గాలి లేదా? మృదువైన మట్టి లేదా? ఇలాంటివేవీ చూడలేకపోతున్నందువల్లే మీరు వీటిని ఉత్తి బియ్యపు గింజలుగా అనుకుంటున్నారు. కానీ నేను చెప్పినవన్నీ వీటిలో కనిపించి ఉంటే కిందపడిపోయిన ఈ బియ్యపుగింజల్ని ఏరాలా? అని నన్ను అడిగేవారు కాదు. ప్రతి బియ్యపుగింజకూ భగవంతుడి కటాక్షం ఉందన్న సంగతి పరచిపోకండి. అందుకే అంటున్నా.. మీరు ఈ వాస్తవాన్ని విస్మరించకండి. ఎప్పుడైనా సరే మీ పాదాలతో వాటిని తొక్కి వృథా చేయకండి. నేలమీద పడిన బియ్యపు గింజలను భద్రపరచి తినడం ఇష్టం లేదనుకుంటే వాటిని పక్షులకైనా వెయ్యండి. అవి ఎంతో తృప్తిగా తింటాయి" అని. ఆయన మాటలు విన్న తర్వాత శిష్యులు ఇక నోరెత్తితే ఒట్టు. (బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావుగారి ఉపన్యాసము)

4) అరుణాచలేశ్వరుని ఈ పాదములో రమణులు కోరుకొన్న సర్వనాశనము ఇదే. తన భక్తులకు ఇది నేర్పారు. నా/మన బియ్యపు బస్తాలు అనే భావాన్ని నాశనం చేసారు. సర్వం భగవన్మయమని నిరూపించారు.



## 49

**వెదుకక గనిన సత్ప్రీయనుగ్రహ నిధీ**
**మది తెగుల్ బ్రోవరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! నేనే ప్రయత్నమూ చేయకుండా, వెతకకుండా నాకు లభించిన అనుగ్రహనిధివి నీవు. నా మనస్సులోని భ్రమని పోగొట్టి నా హృదయాన్ని నిత్యమైన శాంతితో నింపవయ్యా!

**విశేషాలు**

అరుణాచల అను పేరు భవబంధాల నుంచి విముక్తుణ్ణి చేస్తుంది. ఈ అమూల్యమైన పదాన్ని ఒక అనుగ్రహ నిధిగా పోల్చారు భగవాన్ రమణులు.

పంచభూత శివ క్షేత్రాల్లో అగ్నితత్వానికి ప్రతీకయైన అగ్నిలింగం అరుణాచలంలో ఉంది. ఒకసారి బ్రహ్మ, విష్ణువుల మధ్య వివాదం వచ్చినప్పుడు, ఆ వివాదం తీర్చడానికి పరమశివుడు ఈ అరుణాచల క్షేత్రంలోనే మహా తేజోవంతమైన అగ్నిలింగంగా తన రూపాన్ని ప్రదర్శించాడని స్థలపురాణం.

అరుణ అంటే ఎర్రని, అచలము అంటే కొండ అని అర్థం. అ-రుణ అంటే పాపములు హరించునది అనే అర్థం కూడా ఉంది. అరుణాచలం కొండను 'అరుణగిరి', 'అన్నామలై కొండ', 'అరుణాచలం', 'అరుణై', 'సోనాగిరి', 'సోనాంచలం' అని కూడా పిలుస్తారు. ఇంకా 'రెడ్ మౌంట్', 'హిల్ ఆఫ్ ది హోలీ బేకాన్', 'హిల్ ఆఫ్ ది హోలీ ఫైర్' అని కూడా అంటారు.

తమిళంలో 'తిరువణ్ణామలై' అంటారు. తిరు అనగా 'శ్రీ' అని, 'అణ్ణామలై' అనగా పెద్దకొండ అని అర్థం.

ఈ కొండే శివుడని పురాణాలు చెపుతున్నాయి. అందుకే అరుణాచలేశ్వర దేవాలయం కన్నా ఈ కొండకే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం కనిపిస్తుంది.

గిరి ప్రదక్షిణం మొత్తం 14 కిలోమీటర్ల దూరం ఉంటుంది. గిరి ప్రదక్షిణాన్నే 'గిరివాలం' అని కూడా అంటారు. ఈ అరుణాచలం కొండ ఎత్తు 2,669 అడుగులు.

కొండ చుట్టూ ఎనిమిది లింగాలు, ఇందిరా లింగం, అగ్ని లింగం, యమ లింగం, నైరుతి లింగం, వరుణ లింగం, వాయులింగం, కుబేర లింగం, ఈశాన్య లింగంలు. ఎనిమిది నందులు, 350 పైగా చెరువులు, మరెన్నో మండపాలు వున్నాయి.

ఈ అరుణాచలాన్ని ఈ పాదంలో రమణులు నిధిగా పేర్కొన్నారు.



## 50

**ధైర్యము పరుగిడు నీ నిజాహ మరయ**
**నే నాశమైతి బ్రోవరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! నీ నిజస్వరూపమును తెలుసుకోగలనని ధైర్యముతో భావించి భ్రమించి నేను విఫలుడనైనాను. నాపై నీ దయను చూపించి కాపాడు.

**విశేషాలు**

1) "నిజంగా మనోనిగ్రహం సాధించగలమా?" అని ఒకరు రమణులను ప్రశ్నించినప్పుడు, వారు ఇచ్చిన జవాబు ఇది.

2) సముద్రం ఎప్పుడూ చూడని ఒకాయన దాన్ని చూసి తెలుసుకోవడానికి దాని దగ్గరకు వెళ్ళాడు. ఆ విశాల జలరాశి ముందు నిలిచి అందు స్నానం చేయాలని అనుకొన్నాడు. ఆ తీరాన నిలిచి చలించి, ఘోషిస్తున్నట్టి ఆ తరంగాల్ని చూసి "ఈ అలలన్నీ అణిగినప్పుడు ఇంటి వెనక చెరువులో స్నానం చేసినట్లు – సముద్రంలో దిగి స్నానం చేస్తాను" అనుకున్నాడు.

3) సముద్రం నిరంతరం అలసట లేకుండా తరంగాలతో సృష్టి మొదటినుంచి, ప్రళయం వరకు ఆ విధంగా చలిస్తూ వుంటుందనే సంగతి ఇతరులు చెప్పడం వల్లగాని, లేదా తనకు తానుగా తెలుసుకోవడం వల్ల గాని విషయం గ్రహించవలసి వుంది.

4) అతడా విషయం తెలుసుకున్న తర్వాత అతడా సముద్రంలో దిగి స్నానం చేస్తాడు.

5) అతడు చేతులు మెల్ల మెల్లగా వూపుతూ, గత సూచనల ద్వారా ఆ తరంగాలలో మునుగుతూ తన తలపై నించి తరంగాలను పోనిస్తాడు. అతడు శ్వాసను సహజంగా బంధిస్తాడు.

6) అట్లా చేయడం వలన అతడు నేర్పరి అవుతాడు. చివరకి తన లక్ష్యాన్ని సాధిస్తాడు – ఎటువంటి దుఃఖం బాధ కష్టం కలగకుండా.

7) ఇదొక పద్ధతి.

8) ఇంకొక పద్ధతి ఉంది.

9) ఉప్పుబొమ్మ ఒకటి ఒకనాడు సముద్రపు లోతు చూడటానికి అందులో దిగి అందులో కరిగిపోయింది.

10) ఈ అద్వైత భావన స్వామి దయతోటి వస్తుంది.

11) మొదట మన ప్రయత్నము చేయాలి. తరువాత మనకు చేతకాకపోతే విన్నవించుకొంటే ఆయన అనుగ్రహిస్తాడు.



## 51

**తాకి కృపాకరము నను గలియకున్న**
**నిజము నశింతు బ్రోవరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! నీ దయ కలిగిన చేయి నాకు అందివ్వు. అలా చేయకపోతే ఈ సంసార సముద్రములో మునుగుతాను. నేను నిజమే చెబుతున్నాను. నీ దయ లేకపోతే నేను నశించిపోతాను. నాపై నీ దయ ఎప్పుడూ చూపించు! నన్ను కాపాడు.

**విశేషాలు**

1. రమణులు తమ దయను పశుపక్షి మృగాదుల మీద ప్రసరింపచేసేవారు.
2. భగవాన్ దయాసాగరుడా! అని శ్రీ రమణులను ఒకసారి ప్రశ్నించారు.
3. సమాధానంగా "సముద్రమునకు ఒక హద్దు లేక చెలియలికట్ట ఉన్నది. భగవాన్ దయకు అటువంటి హద్దు లేదు. అనంత"మని రమణులు జవాబు చెప్పారు.
4. ఇటువంటిది భగవానుని దయ. దానిని మనందరికి అందచేయమని రమణులు జీవుల పక్షాన ఈ పాదంలో ప్రార్థిస్తున్నారు.



## 52

**దోషరహిత నీవు నాతో నైక్యమయి ని**
**త్యానంద మాయ మొనర్పరుణాచలా!**

**తాత్పర్యం**

నిష్కళంకమైన పరిపూర్ణత నీది. నీతో ఐక్యమైతే నాకు కూడా పరిపూర్ణత లభిస్తుంది. ఆ స్థితి ఆనందమయం. ఆ స్థితి నీ అనుగ్రహం వల్లనే సాధ్యమవుతుంది. నన్ను నీతో ఐక్యం చేసుకొని నిరవధికమైన ఆనందమయ స్థితిని అనుగ్రహించు అరుణాచలా!

**విశేషాలు**

తమ జీవిత సర్వస్వాన్ని భగవాన్ సేవకు అర్పించినవారిని ఉద్దేశించి 1950 ఏప్రిల్ 14న, రాత్రి 8.57 గంటలకు మహాభినిష్క్రమణం చేయడానికి కొద్ది క్షణాల ముందు రమణులు పలికిన పూర్ణభావనామయమైన మాట thanks. మళ్లీ ఆయనే 'అంటే సంతోషం అని అర్థం' అన్నారు. భగవంతుడు మానవశరీరం ధరించి వచ్చినప్పుడు ఎంత వినమ్రంగా ఉంటాడో ఈ సన్నివేశం చెబుతుంది.

"నేను ఎక్కడికి వెళతాను? ఇక్కడే ఉంటాను" అంటూ సెలవు తీసుకున్నారు రమణులు. ఆయన చెప్పినట్లుగానే నేటికీ అరుణాచలం నుంచి రమణుల కరుణ

కురుస్తునే ఉంది. (శ్రీ వియస్ఆర్ మూర్తి) ఆనందాన్ని ఏ స్థితిలోనూ వదులుకో వద్దని చెప్పిన రమణుల సందేశం సర్వదా శిరోధార్యం.



## 53

**నగకు నెడము కాదు నిన్వెదకిన నన్ను**
**గను కృపానగ వేసి యరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! నేను అలంకారం లేకుండా ఉండటం వల్ల నా పట్ల విముఖత చూపించకు. నాకు మంచి ఆభరణములు లేకపోవటం వల్ల నన్ను చూచి నవ్వకు. నన్ను చూసి పరిహసించే సమయము ఇది కాదు. నీ దయ అను అమూల్యమైన ఆభరణాన్ని ప్రసాదించు.

**విశేషాలు**

ఒక జీవాత్మ పరమాత్మ పట్ల ఎటువంటి ఆవేదన చూపించాలో రమణులు ఈ చరణంలో ప్రదర్శించారు.

అలంకారము అంటే ఇంద్రియ నిగ్రహము మొదలైనవి. అవి లేవని ఈ జీవుడిని పక్కకు పెట్టకు. నీ దయ అనే ఆభరణము నాకు ఇవ్వు. ఈ జీవుడు నువ్వు నడిపించే జీవితంలో మెరిసిపోతాడు అని రమణుల ఉదాత్తమైన భావన.

It is the Wind that Sings పుస్తకములో Arthur Osborne అను ఆంగ్ల రచయిత శ్రీ రమణమహర్షి చెప్పినట్లుగా ఈ కథను పేర్కొన్నారు.

గోరా అనే ఒక కుమ్మరి సాధువు ఉంటాడు. ఆయన ఒకసారి సాధు సంతులకు విందు ఏర్పాటు చేస్తూ భక్త నామదేవుని మరియు భక్త జ్ఞానదేవుని ఆహ్వానిస్తాడు. అందరూ భోజనాలకు కూర్చున్నారు.

అప్పుడు జ్ఞానదేవుడు కుమ్మరి సాధువుని పిలిచి కుండలు పచ్చివా లేదా బాగా కాలియున్నవో ఎలా తెలుసుకుంటావో అలానే ఈ సాధువులు బాగా పండి ఉన్నారో లేదో తెలుసుకోమన్నాడు. కుమ్మరి సాధువు ఒక కర్ర తీసుకువచ్చి ఒక్కొక్కరి తలమీద కొట్టుకుంటూ పోతాడు.

నామదేవుని దగ్గరికి వచ్చేసరికి అతడు కోపంతో ఊగిపోతాడు. “ఆత్మజ్ఞానాన్ని పొందిన నన్నే పరీక్షించి అవమానిస్తావా?” అని కేకలేస్తాడు.

దీనికి సమాధానంగా వరుసలోనున్న వారందరికన్న నామదేవుడే చాలా పచ్చిగా నున్నాడని కుమ్మరి జవాబిస్తాడు.

అందరూ ఘొల్లుమని నవ్వుతారు. నామదేవుడు చాలా బాధపడతాడు.

తనకు జరిగిన అవమానానికి తనను నమ్మిన విఠోబానే అడుగుదామని గుడికి వెళ్లి ఆ విఠలుని నిలదీస్తాడు.

విఠలుడు ప్రత్యక్షమై అందరిలాగే మాట్లాడకుండా మౌనంగా వుండాల్సిందని ఓదార్చి అక్కడికి కొన్ని యోజనాల దూరంలోనున్న శివాలయములో ఒకతను వుంటాడు, అతని దగ్గరికి పొమ్మని చెబుతాడు.

వెంటనే నామదేవుడు శివాలయం వైపు పోయి చూస్తే అక్కడొక భిక్షగాడు శివలింగముపై కాళ్ళుపెట్టి పడుకొని వుండడం చూస్తాడు.

నామదేవుడు అతన్ని నిద్రనుంచి లేపాడు.

అతను లేచి, “ఓహో నువ్వా! ఆ విఠలుడు పంపించిన నామదేవుడవే కదా! రా! రమ్మని” పేరు పెట్టి పిలుస్తాడు.

నామదేవుడు ఆశ్చర్యపోతూ శివలింగముపై కాళ్ళు తీసెయ్యమని అతన్ని అడుగుతాడు.

అప్పుడతను నేను తీయలేను నీవే తీసెయ్యి నాయనా అంటాడు.

సరేనని నామదేవుడాతని కాళ్ళు జరుపుతాడు.

విచిత్రంగా కాళ్ళు జరిపిన చోటే ఒక శివలింగం ఉద్భవించింది.

నామదేవుడు కాళ్ళను ఇంకో చోటికి జరుపుతాడు. అక్కడొక శివలింగం పుట్టింది. ఆశ్చర్యంగా ఆ బిచ్చగాని పాదాలు ఎక్కడ పెడితే అక్కడొక శివలింగం పుట్టుకొస్తోంది.

నామదేవుని మతిపోయింది.

అప్పుడా బిచ్చగాణ్ణే అడిగాడు ఎక్కడ కాలు పెట్టాలని?

నీ తొడపైనే పెట్టుకోమన్నాడు బిచ్చగాడు.

నామదేవుడు అలానే చేసాడు. ఈసారి తానే శివలింగమైనాడు! అంటే నామదేవునికి ఇప్పుడు ఆత్మజ్ఞానం కలిగింది.

రమణులు ఈ చరణంలో కోరుకొన్న దయ అను ఆభరణం ఇది.



## 54

**నాన లేదే వెదుక నే నయి నీ వొంటి**
**స్థాణువై నిలిచితి వరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! నేను అన్నిటినీ విడిచివేసాను. నీవే నాకు దిక్కని తలచి నీ దగ్గరకు చేరాను. నువ్వు నన్ను దగ్గరకు తీసుకుంటావనుకున్నాను. కాని నీవు ఏమీ కదలిక లేకుండా ఒక స్థాణువులా – స్తంభంలా నిలబడ్డావు ఎందుకయ్యా! నాపై నీకు ఈ నిర్లక్ష్యమెందుకు?

**విశేషాలు**

1. మధురభక్తి సంప్రదాయంలో భక్తుడు ఒక విరహిణిగా మారాడు.
2. భగవంతుడనే ప్రియునితో దెబ్బలాడుతున్నాడు.
3. ఐక్యం ఎందుకు చేసుకోలేదనే ప్రశ్నలో – జన్మరాహిత్యం కలిగించే ఐక్యం తొందరగా చేసుకొమ్మనే అభ్యర్థన ఉంది.
4. శివుడు అచలుడు. ఎందుకంటే అతడు కదలటానికి ఇంకొక స్థలం లేదు. అంతటా అతడే నిండి ఉన్నాడు కనుక.
5. అధర్వవేదం శివుని స్థాణువని పిలిచింది.
6. పురాణాల ప్రకారం అరుణాచలేశ్వరుడు ఒక స్తంభం. బ్రహ్మ, విష్ణువులు ఆ స్తంభపు ఆది, అంతము కనుగొనటానికి ప్రయత్నించిన విషయం ప్రసిద్ధి.
7. ఈ స్థాణువు అనే పదంతో మన ప్రాచీన కవులు అద్భుతభావాలు సృష్టించారు.

8. స్థాణు వొక్కండు మగవాడు తలక కుమియ
ఫల మొసగె నట్టె కినియక పద్మవదన
వదనసుర గూర్మి నొసగ నీవలదె పుష్ప
మైన ననుమాడ్కి నుమిసిన నలరె బొగడ

(స్థాణువు అంటే పొగడ అని, శివుడు అనీ అర్థాలు. గతంలో ఎప్పుడో ఒక మగవాడు (తిన్నడు) ఉమ్మేసినంత మాత్రాన ఒక స్థాణువు (శివుడు) 'ఫలమును' (మోక్షఫలమును) ఇచ్చాడు. మరి ఈ పద్మముఖులు లాలా జలములు అను అమృతాలను ఇచ్చారు. ఈ త్యాగానికి పువ్వులైనా ఇవ్వకుంటే ఎలా అని ఆ పొగడచెట్లు మురిసి వారు చేసే దోహదక్రియతో (ఉమ్మివేయుట అను క్రియ) పూలతో విరిసాయి. (రాయలవారి ఆముక్త మాల్యదలోనిది ఈ తాత్పర్యం)

9. పార్వతీ శివులనే భార్యాభర్తల మధ్య స్థాణువనే పదంతో (చెట్టు అనే అర్థం తీసుకొని) ఒక చాటుకవి ఇలా మాటలతో ఆడుకొన్నాడు.

10. 'కస్త్వం? శూలీ! మృగయ భిషజం, నీలకంఠే ప్రియేహం!
కేకామేకాం కురు, పశుపతిః నైవ దృశ్యే విషాణే
స్థాణుర్ముగ్ధే నవదితి తరుః జీవితేశశ్శివాయః
గచ్ఛాటవ్యామితిహత వచః పాతువశ్చంద్ర చూడః'

11. పార్వతి – 'కస్త్వం' (ఎవరు నువ్వు)

12. శివుడు – 'శూలీ' (శూలం ధరించినవాణ్ణి)

13. పార్వతి – (శూలీ అంటే తలనొప్పి అని కూడా అర్థము కనుక ) 'మృగయ భిషజం' (వైద్యుణ్ణి వెతుక్కో?)

14. శివుడు – 'నీలకంఠే ప్రియేహం' (ప్రియా! నేను నీలకంఠుణ్ణి)

15. పార్వతి – (నీలకంఠః అంటే నెమలి అని ఇంకొక అర్థం) కేకామేకాం కురుః' (నెమలివా! అయితే అరువు!)

16. శివుడు– నేను పశుపతిని

17. పార్వతి – (పశుపతి అంటే ఎద్దు అని ఇంకొక అర్థం కనుక). 'నైవదృశ్యే విషాణే!' (కొమ్ములెక్కడ?)

18. శివుడు – 'స్థాణుర్ముగ్ధే' (ఓ ముగ్ధా! నేను అంతటా నిండి ఉన్నవాడిని. స్థాణువును)
19. పార్వతి – (స్థాణువు అంటే చెట్టు అన్న అర్థాన్ని తీసుకుని) 'నవదితి తరుః' (చెట్టా ఎక్కడ?)
20. శివుడు – 'జీవితేశ శ్శివాయః' (నీ జీవితేశ్వరుడైన శివుడిని)
21. పార్వతి (శివా అంటే మృగం అనే అర్థం తీసుకొని) గచ్ఛాటవ్యాం (అడవుల్లో తిరుగు)
22. ఇలా మాటల్లో ఓడిన శివుడు రక్షించుగాక అంటూ మాటల చమత్కార శ్లోకం ముగిసింది.
23. అమ్మవారిని కల్పలతతో పోలుస్తూ – శంకర భగవత్పాదులు "కృత స్థాణుస్థానా కుచఫలనతా సూక్తిసరసా" – పార్వతీదేవి అనే జ్ఞానానందలతిక శివుడనే మ్రోడుని పెనవేసుకొన్నదన్నారు తమ సౌందర్యలహరిలో.
24. స్థాణువనే రమణుల పదప్రయోగం ఎంతో విశిష్టమైనది.



## 55

**నీ జ్వాల గాల్చి నన్ నీరు సేసెడు మున్నె**

**నీ కృప వర్షింపు మరుణాచలా!**

**తాత్పర్యము**

ఓ అరుణాచలా! నీ జ్ఞానాగ్ని అను జ్వాల అన్నిటినీ – మంచినీ, చెడునీ కూడా కాల్చివేస్తుంది, భస్మం చేస్తుంది. ఆ జ్ఞానాగ్ని నన్ను దహించి బూడిద చేయకముందే ముందే నీ దయ అను చల్లనినీటిని నాపై వర్షించి, నన్ను రక్షించు. (నీరుకు ఈ చరణంలో బూడిద అని అర్థం)

**విశేషాలు**

1) జ్ఞానము, భక్తి ఈ రెండింటిని రమణులు ఈ చరణంలో తనదైన శైలిలో వివరించారు.

2) ఆత్మ సాక్షాత్కారము తరువాత – (అనగా జ్ఞానం కలిగిన తరువాత) బ్రహ్మ అను విద్వాంసునిచే సృష్టించబడిన పుణ్యం, పాపం రెండు జీవునికి అంటవు. అట్లే ఆత్మ సాక్షాత్కారము పూర్వము చేసిన పుణ్య పాపములు నశిస్తాయని – బ్రహ్మ సూత్రములలో చెప్పారు.

3) "స్వప్నమందు కల్పించబడిన శుభాశుభ కర్మలు మేల్కొనిన వెంటనే క్షీణించి పోతాయి. అజ్ఞానమును వదలి 'అహం బ్రహ్మాస్మి' అను అపరోక్ష జ్ఞానము రాగానే నూరుకోట్ల జన్మల నుండి చేసిన సంచితములోని పుణ్య పాప కర్మల సముదాయమంతా క్షణ మాత్రములో నశించిపోతుందని" – వివేక చూడామణిలో చెప్పారు.

4) రమణ మహర్షి ఈ జ్ఞాన విషయాన్ని ప్రస్తావిస్తూ – ఈ జ్ఞానము తనకు కావాలి కాని – దానికంటే ముందు అరుణాచలేశ్వరుని దయ అనే వర్షములో తడవాలని ఉందని ఈ చరణంలో చెప్పారు.

5) అనగా భక్తి నుండి, జ్ఞానం లభిస్తుందని సందేశం.



## 56

**నీవు నే నణగ నిత్యానందమయముగ**
**నిలుచు స్థితి కరుణింపరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! నన్ను నీ మనిషిగా చేసుకో! 'నేను', 'నీవు' అని ఈ రెండు భావాలెందుకు? మనము కలిసినప్పుడే కదా ఆ నిత్యానందం కలుగుతుంది. నీతో విరహం లేని ఐక్యమనే ఆనందాన్ని నన్ను అనుభవించనీవయ్యా!

**విశేషాలు**

1. ఆలోచనలన్నిటికీ మూలం 'నేను' అనే తాత్పర్యం.
2. ఈ 'నేను' అంటే ఏమిటి? ఎక్కడ్నుంచి ఉదయిస్తుంది? అని ఆరా తీస్తే మనసు తన మూలమైన ఆత్మలో విశ్రమిస్తుంది.
3. అప్పుడు ఆనందంగా ఉంటుందని ప్రబోధించే రమణులు అదే విషయాన్ని ఈ చరణంలో మరొక రకంగా ప్రస్తావించారు.

4. స్వామితో విరహమనేది లేకుండా ఉండాలని అప్పుడే ఆనందమని రమణుల సందేశం.

5. "నేను ద్వారా నిజమైన ఆత్మను తెలుసుకో. అప్పుడు సత్యం సూర్యోదయ కాంతిలాగా ప్రకాశిస్తుంది ప్రతాత్పర్యం చూపుతుంది. నీ మనస్సుకు యే బాధా, బందీ ఉండవు. అసలు ఆనందం వెల్లువై ప్రవహిస్తుంది. ఆనందం, ఆత్మ వేరు కావు. రెండూ ఒక్కటేనని తెలుస్తుంది. ఈ ఆత్మజ్ఞానాన్ని పొందితే ఇక సందేహాలకు తావే ఉండదు. సందేహం లేకపోతే, అంతా సచ్చిదా నందమే." ఇదీ మహర్షి శ్రీ రమణులు నిత్యాన్వేషి అయిన బ్రిటన్ రచయిత పాల్ బ్రంటన్‌కు చెప్పిన మాటలు. ఈ ఆనందసాధనను ఈ చరణంలో వివరించారు.

6. మహర్షి రమణులు సన్యసించి అరుణాచలములో ఆవాసము ఏర్పరచు కొన్నది అందరికీ తెలిసినదే!

7. కాలూ అని 1926 ప్రాంతములో ఒక భక్తుడు స్వామి ఆశ్రమమునకు ఆవు దూడను దానమిస్తే, స్వామి గ్రహించి ఇక నావిగా నీవే చూసుకో అన్నారు. అతను మొండిగా మీవద్దనే అవి వుండవలెనంటే ఆశ్రమములోని ఒక భక్తుడు తాను చూసుకొంటానన్నాడు.

8. కొంత కాలము తరువాత కారణాంతరములచేత ఆవు దూడలను పశుపతి అయ్యర్ అన్న పశుసంపదగల బ్రాహ్మణునికి ఒప్పజెప్పటం జరిగింది. ఆయన ఇల్లు అరుణాచలము ఊరిలో.

9. ఒక రోజు స్వామి ఆశీస్సులను పొందుటకు ఆ మాతా వత్సలను ఆశ్రమమునకు తోడుకొని వచ్చినాడు ఆ బ్రాహ్మణుడు. స్వామి దర్శనము అనంతరము ఆ దూడ దూరమైనా ఆ దారిని గుర్తుపెట్టుకొని రోజూ స్వామి దర్శనానికి వచ్చేది.

10. ప్రొద్దుట నుండి సాయంకాలము వరకు స్వామి సన్నిధిలోనే గడిపి సాయంకాలము తన గూడు చేరేది. దానికి రమణులే లక్ష్మి అని పేరు పెట్టుకొన్నారు.

11. ఆ ఆవు ప్రతిరోజూ స్వామి ఆసీనులైన ఆసనమునకు ప్రదక్షిణలు చేసేది. ఇది ఆ గోవునకు నిత్య కార్యము. స్వామి ఎంతో ప్రేమతో తన సన్నిధిలో వున్నపుడు ఆయనకు భక్తులిచ్చిన పండు ఫలము ఎంతో ప్రేమతో లక్ష్మికి తినిపించేవారు.

12. ఆశ్రమములో సరియగు 12 గం.లకు భోజనమునకు ఎలుగెత్తి పిలిచేవారు. ఆ తరువాత రాను రానూ గంట కొట్టుట మొదలైనది. స్వామి భక్తుల నడుమ ఎంతో వారితో సంభాషణలలో నిమగ్నమైన సమయములో ఈ ఆవు అక్కడ పిలుపు వినిపించగానే స్వామి ఎదుటికి వచ్చి నిలిచేది.

13. స్వామి కూడా వెంటనే 'ఓహో భోజన సమయమైనది, లక్ష్మి పిలుచుచున్నది' అని మది తలచి వెంటనే బయలుదేరేవారు ఆ సమయములో లక్ష్మిని చూసినంతనే! లక్ష్మి పెద్దయ్యింది. ఆశ్రమము పెరిగిపోయింది. ఆశ్రమములో గోశాల నిర్మిస్తే లక్ష్మి స్వామి వద్దకు వచ్చి ఆయనను తోడుకొనిపోయేవరకు మొండిగా ఆయన వద్దనే కూర్చుని ఆయనను పిలుచుకొనిపోయి, ఆయన గోశాలలో అడుగుపెట్టిన తరువాత తానూ అడుగుపెట్టినది. అది గోవు యొక్క గొప్పదనము.

14. మరియొక విచిత్రమైన విషయమేమిటంటే ఆ యావు మూడు ఈతలను రమణులవారి జన్మతిధి యందే కన్నది. వారి అనుబంధము మాటల కందనిది. ఆ రోజు 18 జూన్ 1948 (సర్వధారి ఆణి మాసము అనగా జ్యేష్ఠమాసము, శుక్ల పక్ష ద్వాదశి, విశాఖా నక్షత్రములో) వ సంవత్సరము శుక్రవారము అంటే లక్ష్మివారము పగలు 11.30కి (కొందరు గురువారాన్ని ఆ విధంగా పిలుచుకొంటారు) లక్ష్మీ సమానమై, 9 కాన్పులను గలిగిన ఆ గోమాత, స్వామివారు తన చేతితో ఆవును నిమిరి, తమ చెంపను ఆవు చెంపకు తాకించి, ఆవు గుండెపైన తన అరచేయిని కొద్దిసేపు, సన్యాస దీక్ష ఇస్తున్నారా అన్నట్లు, వుంచి 'అమ్మా ఇక వెళ్ళనా?' అని సెలవు తీసుకొని సమావేశ సదనము చేరునంతలో బ్రహ్మైక్యమును పొందినది.

15. స్వామి ఒక సన్యాసిని ఎటువంటి సత్కారాలతో సమాధి చేస్తారో ఆ గోవుకు ఆ మర్యాదతో అంతిమ సంస్కారమును నెరపమని సెలవిచ్చినారు. ఆవు

గొప్పదనమంటే అది. (చెరుకు రామమోహనరావు – అచ్చంగా తెలుగు మాసపత్రిక అక్టోబర్ 2015)

16. ఈ చరణంలో మనసు (ఆవు) తన మూలమైన ఆత్మలో (రమణులలో) విశ్రమించాలనే అభిలాష.



## 57

**అణురూపు నిన్నునే మిన్ను రూపుం జేర**
**భావోర్ము లెపుడాగు నరుణాచలా!**

**తాత్పర్యము**

ఓ అరుణాచలా! నీవు అంతటా వ్యాపించి ఉన్నావు. అణువు రూపంలో నువ్వు ఉన్నావు. నీతో నేను ఎలా ఐక్యం కాగలను? నా మనస్సులోని ఎడతెగని ఆలోచనల అలలు అణగిపోవటానికి నీ పొందు కావాలి. ఎప్పుడు అది నాకు లభిస్తుంది?

**విశేషాలు**

అరుణాచలుని దయవల్ల మాత్రమే మనస్సు నిశ్చలమవుతుంది. ఆలోచనలు నశిస్తాయి. దీనికి ముందుగా భగవంతుని ధ్యానం చేయాలి.

'వాయునానీయతే మేఘః పునస్తేనైవనీయతే
మనసా కల్ప్యతే బంధో, మోక్షస్తే నైవ కల్ప్యతే' (వివేక చూడామణి)

'వాయువుచే తీసుకురాబడిన మేఘాలు మరలా దానిచేతనే ఎగురగొట్టబడి పోతున్నాయి. అట్లే మనసుచే కల్పించబడిన బంధము తొలగుటకు మనసే యత్నించాలి. మనసు వల్లనే మోక్షము కూడా కల్పించబడుచున్నది. ఈ నేపథ్యంలో రమణుల మాటలను పరిశీలించాలి.

సూర్యుడు లేకపోతే చంద్రుడు వెన్నెల వెదజల్లడు. అలాగే ఆత్మ లేకుండా మనస్సు ఉండజాలదు. మనస్సు లేకుండా జగత్తు ఉండజాలదు. ఆత్మ సాక్షాత్కారమైన జ్ఞాని ఈ సత్యాన్ని గ్రహించి ప్రపంచంలో జరిగే వాటన్నింటిని చూస్తుంటాడు. మూడు అవస్థలూ (అంటే మేల్కొనడం, కలగనడం, గాఢనిద్ర)

ఆత్మ అనే తెరపై వస్తూ పోతూ ఉండే దృశ్యాలన్నమాట. సినిమా తెర వంటిదే ఆత్మ కూడా. ఆ తెరమీద జలపాతం దృశ్యం వచ్చినంత మాత్రాన తెర తడిసిపోదు. అలాగే మంటలు చెలరేగుతున్న దృశ్యం వచ్చినప్పుడు తెర తగలబడిపోదు. ఈ స్థితిని అందుకోవడానికి మనిషికి ఎంతో తపన ఉండాలి, కృషి ఉండాలి అని రమణులు చెప్పారు.

శ్రీరమణులు కొత్తగా ఏ సిద్ధాంతాన్నీ ప్రతిపాదించలేదు. కాని ఆత్మ సాక్షాత్కారానికి ఒక మార్గం చూపారు. మనస్సంటూ వేరే ఏదీ లేదు. ఆలోచనల సమూహమే మనస్సని అంటారు. అన్నిటికన్నా మొదటి ఆలోచన 'నేను' అనేది. ఆ ఆలోచన ఎక్కడి నుంచి వస్తోందో ఆరా తీస్తే అది తన మూలమైన చైతన్యంలో ఇంకిపోతుంది. నిత్యమైన అభ్యాసం వల్ల ఆ చైతన్యంలో ఉండగలిగే స్థితి సిద్ధిస్తుంది. దీనినే ఆత్మనిష్ఠ అంటారు. జగత్తు వలెనే జీవుడు, ఈశ్వరుడు అనేవి కూడా మనోకల్పితాలే అంటారు శ్రీ భగవాన్. (పింగళి సూర్యసుందరం)

ఈ మనస్సు నిశ్చలతకు మనం కూడా దైవాన్ని ప్రార్థిద్దాం.



## 58

**సూత్ర జ్ఞానము లేని పామరు నా మాయా**

**జ్ఞానము గోసి కావరుణాచల!**

**తాత్పర్యం**

అరుణాచలా! ఏ శాస్త్రాన్ని చదవని పామరుడిని నేను. నా అజ్ఞానాన్ని మొదలంటా నరికివేయి. నన్ను నీ అనుగ్రహముతో రక్షించు.

**విశేషాలు**

శరణాగతతత్వం ఇందులో కనిపిస్తుంది.

1. ఎదురుగా కూర్చున్న శిష్యుణ్ణి గురువు ఒక్కసారి పరమ ప్రేమతో అలా చూస్తాడు. అంతే! శిష్యుడికి జ్ఞానబోధ జరుగుతుంది.
2. తత్త్వం తెలుసుకోవాలని పాల్ బ్రాంటన్ అనే ఒక విదేశీయుడు భగవాన్ రమణుల దగ్గరికి వచ్చారు.

3. రోజూ రమణుల సమక్షంలో కూర్చునేవారు.
4. రమణులు మౌనస్వామి. ఎప్పుడో తప్ప నోరు విప్పేవారు కారు. అక్కడ ఒక ఆసనంలో కూర్చుని తనలో తాను రమిస్తుండేవారు.
5. పాల్ బ్రాంటన్ రోజూ రావడం, అక్కడ కూర్చోవడం, రమణులు ఏమీ మాట్లాడకపోవడం. ఇలా చాలాకాలం జరిగింది.
6. ఆయన విసిగిపోయి ఇక వెళ్ళిపోదామని నిర్ణయించుకుని తన సామాను సర్దుకుని ఇక గురువుగారికి చివరగా ఓ నమస్కారం పెట్టడానికి వచ్చి కూర్చున్నాడు.
7. రమణులు తీక్షణంగా ఆయనకేసి చూశారు.
8. అంతే! అజ్ఞానపు చీకట్లు విచ్చిపోయాయి బ్రాంటన్‌కు.
9. భారతీయ తత్త్వవైభవాన్ని ప్రపంచానికి అందించడానికి ఎన్ని పుస్తకాలు రాశాడో ఆయన! అదీ నయన దీక్ష. గురువు తన కంటిచూపుతో పాల్ బ్రాంటన్‌ను అనుగ్రహించాడు.
10. ఎందరో మహాత్ములు కేవలం తమ దృష్టిచేత అనుగ్రహిస్తారు.
11. నేనొకసారి విశాఖపట్టణ నివాసి అయిన మా దగ్గరి బంధువుతో కలిసి అరుణాచలం కొండమీదికెళ్ళా. కొంతమంది విదేశీయులు నూలుచీరలు కట్టుకుని బొట్లు పెట్టుకుని కొండమీద తిరుగుతూ కనిపించారు. మా బంధువు అది చూసి 'మీరు చాలా సుదూర దేశాలనుంచి వచ్చారు. ఇక్కడ ఎలా అనిపిస్తున్నది' అంటూ కరచాలనం కోసం చెయ్యి చాపారు.
12. వాళ్ళు దానికి ప్రతిగా "ఇంతటి మహాపురుషుడు (రమణులు) తిరుగాడిన భూమిని సేవించడానికి కావలసిన వాఙ్మయాన్ని పునాదిగా పొందిన కర్మభూమి భారతదేశంలో పుట్టిన మీకు చేతులెత్తి నమస్కరిస్తాం" అన్నారు. అదీ ఈ దేశ వైభవం.
13. జీవశాస్త్రంలో ఏముందో కానీ, వేదాంతశాస్త్రంలో చెప్పేదేమిటంటే – ఒక నదిలో చేపగుడ్లు పెట్టినప్పుడు అవి ముందు తేలుతూ వెళ్ళిపోతుంటాయి. చేప వాటి వెనకో ముందో వెడుతూ 'అవి పిల్లలు కావాలి' అని ప్రేమతో వాటికేసి చూస్తుందట. ఆ చూపులకే అవి పొదగబడి పిల్లలవుతాయి.

చూపులచేత పోషించి ఆత్మశక్తిని, ఆత్మానుభవాన్ని ఇవ్వగలిగిన దక్షత వున్న గురువు చూపు కనుక నయనదీక్ష. దానికి మీనాక్షీ పరదేవత సంకేతం. (శ్రీ చాగంటివారు)

ఇంత నయనదీక్షా దక్షత ఉన్న గురువు రమణులు పై పంక్తులలో 'అజ్ఞానిని' అని శివునితో చెప్పటంలో మనలాంటివారికి వినయాన్ని నేర్పుతున్నారు.



## 59

**మక్కి మక్కి కరగి నే నిన్ను శరణంద**

**నగ్నుడవై నిల్చితరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! నీ పట్ల తీవ్రమైన ప్రేమతో నా హృదయం కరిగింది. నాలోని అహం తాత్పర్యం మాయమై నిన్ను శరణు పొందాను. నీతో కలిసిపోవాలనే కోరిక నాకు కలుగగా, చివరికి నీ నగ్న సౌందర్యాన్ని చూసాను.

**విశేషాలు**

స్వార్థరహితమయిన ప్రేమ భక్తితో భగవంతుని వెదకితే అతనితో ఐక్యం కలుగుతుంది. చివరికి నీ నగ్న సౌందర్యాన్ని చూసాను అనుటలో భావమిది.

దేవునికి నామరూపాలు కల్పించే మనస్సు భక్తుని మనస్సుతో ఐక్యమైన తరువాత ఇక భగవంతునికి నామమూ, రూప ఆచ్ఛాదనలు ఉండవు. దీనినే 'నగ్నత' అని రమణులు ఈ చరణంలో పేర్కొన్నారు.

'శ్రీరమణ భగవానులకు కాళ్లనొప్పులు అధికంగా ఉండటంవల్ల తైలం రుద్ది కాళ్లొత్తేవారు సేవకులు. మిగతా చొరవగల భక్తులంతా అరగంట చొప్పున వంతులు పడి కాళ్లొత్తటం ప్రారంభించి సమయాతిక్రమణ చేసేవారు.

సేవకులను సహితం "రండీ, పొండీ" అనే తప్ప "రా, పో" అని పిలుచుటకే ఒప్పుకోని భగవానులిందుకు సహించగలరా? ఖండించి వలదనుట వారి పని కాదు. అందువల్ల ఛలోక్తిగా "మీరంతా కాస్త ఆగండి. నేనున్నూ కాస్సేపు కాళ్లు వొత్తుకుంటాను. నాకు మాత్రం ఆ పుణ్యం కొంచెం రావద్దూ?" అని వారి చేతులు

తొలగించి తామే తమ కాళ్లు వత్తుకోవటం ప్రారంభించారు. నాకు చాలా విచిత్రంగా వుండటమే కాకుండా ఏ నరాల్లోనైనా శ్రీవారి పాదాలంటి నమస్కరిద్దామన్న కోరిక వుంటే దీంతో పూర్తిగా నశించిపోయింది. శ్రీవారి మాటలే చిత్రంగా వుంటవి.

ఆ పుణ్యం కొంచెం వారికీ కావాలట! రవంత సూక్ష్మతగలవారికి ఇంతకంటే హెచ్చరిక ఏం గావాలి! ఆ రోజుల్లోనే ఇక్కడ నివాసంగా వుంటున్న రిటైర్డ్ జడ్జి, కురువృద్ధుడు ప్రతాపరాయ దేశాయీ అనేవారు భగవానుని సమీపించి "స్వామీ! నాకు కూడా గురుపాద సేవలో భాగస్వామినవ్వాలని ఉందని" అన్నారు. "ఓహో! సరిసరి. 'ఆత్మావై గురుః' అన్నారు. ఆత్మసేవ చేసుకుంటే గురుసేవ చేసినట్లే. డబ్బైయేళ్లు దాటినవి. మీరా నాకు సేవ చేసేది. చాలు చాలు. ఇకనైనా ఆత్మసేవ చేసుకోండి. "పల్కకుండా వూరికే వుంటే అంతే చాలు" అన్నారు భగవాన్. సరిగా విచారిస్తే ఇంతకన్నా ఉపదేశం ఏముంటుంది? పల్కకుండా వూరికే వుంటే చాలట. అట్లా ఉండటం భగవానునికే సహజం కాని మనకు సాధ్యమా? ఎంత తపించినా ఆ స్థితి రాలేదే. శ్రీవారి కరుణ మీద ఆధారపడటం కంటే మనకు వేరే చేయగలదే మున్నది?' (సూరి నాగమ్మగారి శ్రీరమణాశ్రమ లేఖలు నుండి)

ఈ సంఘటనలో రమణులు భగవంతుని పట్ల ప్రేమ, సేవ ఎలా ఉండాలో చెప్పారు. తద్వారా దేవునికి నామరూపాలు కల్పించే మనస్సు భక్తుని మనస్సుతో ఐక్యమవుతుంది. తరువాత ఇక భగవంతుని నామ, రూప ఆచ్ఛాదనలతో చూసే దృష్టి పోతుంది.



## 60

**నేస్తముండని నాకు నీ ఆశ జూపి నన్**

**మోసగింపక బ్రోవు మరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! ఓ పరమశివా! మొదట్లో నాకు ఒక నేస్తం అంటూ ఎవరూ లేరు. కాని నా మనస్సులో నీ పట్ల ప్రేమతో నిండిపోయేట్టు చేసావు. నాకు నేస్తమయ్యావు. నీతో కలిసిపోవాలన్న ఆశని కలిగించావు. ఇప్పుడు నీ దయతో నీ దగ్గరకు చేరాను. ఇక నన్ను నీవు మోసగించకు. నాపై దయ చూపి నన్ను రక్షించు.

**విశేషాలు**

1. శివుని దయ లేనిదే ఆయన గురించి ఆలోచించటం కూడా అసాధ్యం.
2. వైష్ణవులకు తిరుప్పావై ఎలాంటిదో శైవులకు మాణిక్య వాచకర్ రచించిన తిరువెంబావై పాశురాలు అలాంటివి. ఆ పాశురాల్లోని ఒక తిరువాచకంలో "ఆయన అనుగ్రహం వల్లనే ఆయన చరణాలను ఆరాధిస్తాం" అని మాణిక్య వాచకర్ అంటారు. రమణులు కూడా ఈ 60 మొదట్లో ఇదే భావాన్ని ('ఆశ చూపి') తెలియచేసారు.
3. "పిచ్చివాని వంటిపై ఉన్న తుండుగుడ్డ ఎప్పుడు జారిపోయినదో అని అతనికి ఎట్లు తెలియదో, అలా దేహము ముక్తునకు జారిపోతుంది" అని ముక్త పురుషుడు శరీరము విడచు విధానాన్ని భగవాన్ రమణులు ఉపమించారు.
4. ఇటువంటి ముక్తస్థితిని పొందటానికి జీవులకు భగవంతునిపై అచంచలమైన దృఢనిష్ఠ ఉండాలని రమణులు ఈ చరణంలో అంతర్గతంగా చేసిన బోధ.



## 61

**నవసి చెడు ఫలము నందేమి ఫల మేరి**
**పక్వత లోగొను మరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! బాగా పండిపోయి, కుళ్ళిపోయిన పండు తినటానికి పనికి రాదు కదా! అలాగే నేను కూడా బాగా పండిపోతే నీ నామాన్ని జపించే శక్తిని కూడా కోల్పోతానేమో! నిన్ను తలుచుకొనే కనీసపాటి మానసిక స్వస్థత కోల్పోతానేమో! నేనిప్పుడు సరియైన పక్వదశలో ఉన్నాను. నన్నిప్పుడే నువ్వు స్వీకరించు, ఆదరించు.

**విశేషాలు**

1. ఒకసారి రమణులు మౌనం గురించి మాట్లాడుతూ 'మౌనం అంటే మాట్లాడక పోవడం కాదు, మాట్లాడాలని అనిపించకపోవడం' అన్నారు. ఇది పక్వదశ. ఇది సాధకుడైన తనకున్నదని రమణులు ఈ చరణంలో 'పక్వత' అను పదంలో తెలియచేసారు.

2. మహాత్మాగాంధీగారి హత్య జరిగిన రోజుల్లో ఒక మతి భ్రమించిన వ్యక్తి 'రమణ మహర్షి' వద్దకు వచ్చి "గాంధీని చంపిన గాడ్సే అందరికీ తెలిసాడు. నేను నిన్ను చంపి కీర్తి సంపాదిస్తాను" అన్నాడు ఉగ్రంగా. భగవాన్ "చంపు నాయనా! నాకీ దేహ బాధ తప్పుతుంది" అన్నారు శాంతి వదనంతో. ఇంతలో ఆశ్రమవాసులు ఆ వ్యక్తిని అటకాయించి, దూరంగా తీసుకు వెళ్లాలని ప్రయత్నం చేశారు. భగవాన్ వారించి అతన్ని తనవద్దే ఉంచుకుని తనతో భోజనానికి తీసుకువెళ్లారు. రెండు రోజులు అతను ఆశ్రమంలో వున్నాక ఆ వ్యక్తి తాలూకువాళ్ళు వెతుక్కుంటూ వచ్చారు.

3. జరిగిన విషయం తెలుసుకుని "మన్నించండి. అతనికి మనస్థిమితం లేదు. ఏదయినా తరుణోపాయం ఉపదేశించండి" అని మహర్షిని వేడుకున్నారు. "గాయత్రి చేయించండి" అన్నారు భగవాన్.

4. కొన్ని నెలల తర్వాత చంపుతానన్న వ్యక్తి తిరిగి వచ్చాడు. "పరిస్థితి చాలా మెరుగయ్యిందని, సాధారణ జీవితంలోకి తనని గాయత్రీ మంత్రం తీసుకు వచ్చిందని ధన్యవాదాలు చెప్పుకోటానికి వచ్చానని" చెప్పి భగవాన్ ఆశీర్వచనం తీసుకున్నాడు. (ఈ సంఘటన 'రమణవాణి'లో ప్రచురింప బడింది)

5. ఈ కథలో "చంపు నాయనా! నాకీ దేహ బాధ తప్పుతుంది" అనే వచనం ఈ చరణంలోని 'పక్వ' వచనం. ఈ పక్వత రకరకాల స్థితులలో మనకు కూడా కలిగించాలని స్వామిని ప్రార్థిద్దాం.



## 62

**నొప్పింపకను నిన్ను నొసగి నన్ గొనలేదె**
**యంతకుడవు నాకు నరుణాచలా!**

**తాత్పర్యము**

నేనే విధంగానూ బాధ పడకుండానే నీవు నాకు దక్కావు. నీవు నా అహాన్ని ధ్వంసం చేశావు అరుణాచలా! ఈ చరణానికి రెండు అర్థాలున్నాయి.

**విశేషాలు**

1) నేను నీలో ఐక్యమైనప్పుడు నా అస్తిత్వాన్ని కోల్పోయాను, నా అహానికి హంతకుడవు నీవు అరుణాచలా!

2) నేను నిన్ను అతి తేలికగా పొందగలిగాను అరుణాచలా! నీ అంతట నీవే నాకు స్వాధీనమైనావు, నేను నీకు తిరిగి ఏమివ్వగలను? ఏ విధంగానూ పనికిరాని నన్ను స్వీకరించి నీతో ఐక్యమనే అమూల్యమైన సొత్తును నాకు అనుగ్రహించావు. ఇది నీకే విధంగా పనికివచ్చే బేరం? ఇటువంటి వ్యవహారాన్ని నీవు ఒప్పుకోవటానికి కారణమేమిటి? అంధుడు కాక మరెవ్వరైనా ఈ విధంగా మోసపోతాడా?

నిందాస్తుతికి ఈ రమణుల చరణాలు ఉదాహరణగా చెప్పవచ్చు. "శంకరా! నాకు నిన్ను నీవే అర్పించుకున్నావు! కాని ప్రతిగా నీకు దక్కిందేమిటి? ఎందుకూ పనికిరాని ఈ నిర్భాగ్యపు నేను, మనిద్దరిలో గడసరి ఎవరు చెప్పు?" అని తమ తిరువాచకంలో మాణిక్య వాచకర్ ఈ నిందాస్తుతిని ఉపయోగిస్తారు.



## 63

**చూచి చింతించి మేను దాకించి పక్వము**
**చేసి నీవేలి బ్రోవరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! నా అహం నశించే విధంగా చక్షు, భావ, స్పర్శ దీక్షలను నాకు అనుగ్రహించి నన్ను పరిపక్వం చేసి, నన్ను రక్షించు. నీ భావాలతో, నీ స్పర్శతో, నీ చూపుతో నన్ను పరిపక్వం చేయి అరుణాచలా! నేను సిద్ధమవగానే నన్ను నీ దానిగా చేసికో అరుణాచలా!

**విశేషాలు**

**దీక్ష మూడు విధాలు:**

చక్షు, భావ, స్పర్శ దీక్షలు. అనగా దృష్టి ద్వారా, తాత్పర్యం ద్వారా, స్పర్శ ద్వారా గురువు దీక్ష ఇవ్వటం.

1. దృష్టి దీక్ష 2. స్పర్శ దీక్ష 3. మానస దీక్ష

తన గురువు దివ్యదృష్టి ద్వారా శిష్యునికి దీక్షనిచ్చుటను దృక్‌దీక్ష అంటారు. తాబేలు తన బిడ్డపై చూపు ప్రసరించగానే బిడ్డ శక్తివంతమవుతుంది. అలాగే గురువు అనుగ్రహ వీక్షణంతో శిష్యుడు శక్తివంతుడగును.

గురువు తన శిష్యునికి హస్తస్పర్శ ద్వారా ఇచ్చు దీక్షను స్పర్శదీక్ష అంటారు. తన స్పర్శతో ఇనుమును స్వర్ణంగా మార్చు పరసువేదిలా, గురువు తన అమృత స్పర్శతో శిష్యుడిని ఆశీర్వదిస్తాడు.

గురువు తన సంకల్పము ద్వారా ఇచ్చు దీక్షను మానసదీక్ష అంటారు. క్రౌంచపక్షి ఆహారం కోసం తన పిల్లలను వదిలి దూరంగా వెళుతుంది. అక్కడ తన పిల్లలను స్మృతిలోకి తెచ్చుకోగానే పిల్లలకు కడుపు నిండుతుంది.

ఈ మూడు విధాలలో ఏదో ఒక విధంగా తనను పక్వం చేయమనే జీవుని వేదనను రమణులు ఈ చరణంలో తెలియచేసారు.



## 64

**మాయా విషము పట్టి తలకెక్కి చెడుమున్నె**

**కరుణ పట్టొసగి బ్రోవరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! 'మాయ ' అనే విషసర్పము నన్ను కాటువేసింది. దాని విషం నా మెదడుకి ఎక్కి దానివల్ల చెడటానికి ముందే నన్ను కాపాడి అనుగ్రహించు.

**విశేషాలు**

1. ఒకసారి కొందరు సంస్కృత విద్వాంసులు ఉపనిషత్తుల గురించి, శాస్త్రాల గురించి శ్రీ భగవాన్‌తో చర్చిస్తున్నారు. వాళ్లంతా ఎంతో విద్యావంతులనీ, అటువంటి విషయాలు శ్రీభగవాన్‌తో చర్చించగలవారనీ, తనకి ఆ అదృష్టం లేదే అని నారాయణ అయ్యర్ అనే భక్తుడు ఎంతో చింతింపసాగాడు.

2. విద్వాంసులంతా సెలవు తీసుకున్న తరువాత శ్రీ భగవాన్ అతని వైపు తిరిగి "ఈ విద్వత్తూ, శాస్త్రగ్రంథాలని అప్పగించగలగడం వృధా. సత్యాన్ని

తెలుసుకోవడానికి ఈ అవస్థనంతా పడాల్సిన అవసరం లేదు. చదివితే సత్యం తెలుస్తుందా? ఊరికే ఉండు. అదే సత్యం. నిశ్చలంగా ఉండు. అదే భగవంతుడు" అన్నారు.

3. కాసేపయిన తరువాత శ్రీ భగవాన్ వైఖరిలో, మాటలో ఏదో మార్పు వచ్చింది.

4. నారాయణ అయ్యర్ని "నువ్వు గడ్డం గీసుకుంటావా?" అని అడిగారు.

5. ఈ ప్రశ్నకు విస్తుపోతూనే అయ్యర్ అవునని సమాధానం చెప్పాడు. శ్రీ భగవాన్ "గడ్డం గీసుకోవడానికి అద్దం ఉపయోగిస్తావు కదా! అద్దంలో చూసుకుంటూ నీ ముఖం మీద ఉన్న గడ్డాన్ని గీసుకుంటావే గానీ అద్దంలో ఉన్న ప్రతిబింబాన్ని కాదు కదా! అన్ని మతగ్రంథాలూ సాక్షాత్కారానికి మనకు దారి చూపేవే. వాటిలో చెప్పినవాటిని అభ్యసించాలి, సాధించాలి. కేవలం పుస్తకాల పరిచయం, వాటి గురించి చర్చలూ అద్దంలోని ప్రతిబింబానికి గడ్డం గీయడం లాంటివే" అన్నారు. ఈ మాటలతో నారాయణ అయ్యర్‌కి కొండంత బలం వచ్చింది.

6. పుస్తకాల్లోనే అంతా ఉందనుకోవటం ఒక మాయ. పుస్తకాలను, ఉపన్యాసాలను దారి చూపటానికి ఉపయోగించుకోవాలి. అదే దారి అనుకోకూడదు. ఈ మాయను దాటి అసలయిన సత్యం రమణుల అనుగ్రహం వల్లనే ప్రాప్తిస్తుంది



## 65.

**కను కృపన్ మాయాంతముగ కృప గనవేని**
**గను నీ కెవరు చెప్పుటరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! ఓ పరమశివా! దయతో నా వైపు చూచి, నా అజ్ఞానాన్ని (అవిద్యని) పోగొట్టు. నీవు తప్ప నాకు వేరే దిక్కు లేరు. ఈ దీనుని గురించి నీకు చెప్పేవాళ్ళు కూడా ఎవ్వరూ లేరు.

**విశేషాలు**

అరుణాచలేశ్వరుని ఒక తల్లిలాగా, తనను బిడ్డలా రమణులు ఈ చరణంలో చెబుతున్నారు. బిడ్డని తల్లి ఎంత సహజ ప్రేమతో కాపాడుతుందో, అలా తనను కాపాడాలని జీవుని ఆవేదన. ఆ ఆవేదనకు నివేదన ఈ చరణం.

“భగవంతుని స్వశక్తి వల్లనే సృష్టి జరిగింది. జగత్తు అంతా మాయ అంటాం. అసలు మాయే మాయ కదా! దానిని ఎవరైనా వెలుపలినుండి కదా చూడాలి. అటువంటప్పుడు మాయలోని తారతమ్యాలను ఎలా గుర్తించగలం?

జగత్తు ఒక దృగ్విషయం. ఈ దృశ్యమాన జగత్తు ఏ మార్పు చెందనట్టి ఒక ఏకైక సత్య వస్తువు యొక్క సత్తాపై ఆధారపడి ఉన్నది. జగద్వ్యవహారంలో మునిగి ఉన్నావు కాబట్టి ఈ జగత్తు నీకు సత్యంగానే గోచరిస్తుంది. జగత్తుకు అతీతంగా పో. అపుడది మాయమై, సత్యమొక్కటే నిలుస్తుంది.

మనస్సు బహిర్ముఖమై ఉన్నప్పుడు జగత్తు యొక్క ఉనికి, బాహ్యమైన వస్తువుగానే గోచరిస్తుంది. అట్టి సమయంలో మనస్సు ఆత్మలో తన అనన్యాత్మకతను పోగొట్టుకుంటుంది అని రమణులు మాయను గురించి చెప్పారు.

జగత్తుకు అతీతంగా మాయను చూసే శక్తిని ఇమ్మని జీవుని ఆవేదనను రమణులు ఈ చరణంలో చెప్పారు.

భగవాన్ రమణులు projectorలోని lamp ఆత్మప్రకాశం అయితే, film వాసనామయ  చిత్తమని, ప్రాణం projectorలోని motor అని, తెర జగత్తు అని, చూసే ప్రేక్షకుడు ఆనందంలో మునగటం భ్రాంతి అని మరో చోట నిర్ణయం చేశారు.



## 66

**పిచ్చి వీడ నిను బోల్ పిచ్చి జేసితె దయన్**
**పిచ్చిని మాన్పు మందరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! ఈ ప్రపంచం పట్ల నాకు ఉన్న పిచ్చిని విడిచి, నీవంటే విపరీతమైన పిచ్చి ఎక్కించుకొన్నాను. ఈ పిచ్చి కూడా పోవాలంటే, ఏదో మందును నీవే ఇవ్వాలి.

**విశేషాలు**

రమణులు కోరుతున్నది అద్వైత స్థితి. "జీవునికి, దేవునికి తేడా లేని అద్వైత స్థితిలో పిచ్చి, ఇష్టము, అయిష్టము, ఇలాంటివి ఉండవని – ఆ స్థితి అనే మందును అనుగ్రహించమని తాత్పర్యం. విషయ కర్మ – (ఇంద్రియాల పట్ల ప్రేమ) ఈశ్వర కర్మగా (ఈశ్వరుని పట్ల ప్రేమ) మారాలి. అది అద్వైత స్థితికి మొదటి మెట్టు.

"ఏ మమకారమూ లేనివాని చరణాల పట్ల మమకారం కలిగి ఉండు, ఈ మమకారముంటే ఇతర మమకారముల నుండి విముక్తి లభిస్తుంద"ని తిరుక్కురల్‌లో తిరువళ్ళువర్ చెప్పిన తాత్పర్యం రమణుల భావానికి దగ్గరగా వుంది.



## 67

**నిర్భీతి నిను జేరు నిర్భీతి నను జేర**

**భీతి నీకేలకో అరుణాచలా!**

**తాత్పర్యము**

ఓ అరుణాచలా! నువ్వు నిర్భయుడివి. భయం లేనివాడివి! నేను ఏ భయమూ లేకుండా నీలో కలవాలని నీ దగ్గరకు వచ్చాను. అన్ని భయాలనూ నేనే వదులుకొన్నప్పుడు నీకు మాత్రం భయమెందుకు?

**విశేషాలు**

ఈ చరణంలోని మొదటి మాటకి (తమిళంలో భీతి యిల్) కొంతమంది 'భయముతో ' అని కూడ అర్థం చెబుతున్నారు. ఈ ప్రపంచపు జీవితం పట్ల నాకు భయముంది. ఆ భయంతో నీ శరణు కోరుదామని నేను ఇష్టపడుతున్నాను. ఎందుకయ్యా! సంకోచపడతావ్? నా భయాలని పోగొట్టి నన్ను నీలో కలుపు

కోవటం నీ బాధ్యత" అని ఇంకో అర్థసమన్వయం వస్తున్నది. ఇది కూడా రమణీయంగా ఉంది.

ద్వంద్వం (రెండు అను తాత్పర్యం) ఉన్నచోట భయం ఉంటుంది. జీవుడూ, దేవుడు ఒకటే అనుకొన్నప్పుడు ఇక భయమేముంది? భయమనే మాటకి ఆస్కారం ఏముంది? నేను ఏ భయమూ లేకుండా నీలో కలవాలని నీ దగ్గరకు వచ్చాను అనుటలో జీవుని ధీమా ఇది. రమణులు బోధించిన 'నేనెవరిని?' అని తెలుసుకోవడం వల్ల భయం పోతుంది.

అరుణాచలం రావటానికి ముందు మధురైలో జరిగిన సంఘటనను వివరిస్తూ "ఆనాడు మృత్యుభయం మాయమయ్యింది. ఆ క్షణం నుండీ అవిచ్ఛిన్నంగా ఆత్మలో లీనమైపోయాను' అన్నారు శ్రీరమణులు. ఇది భక్తులకు కూడ అనుగ్రహించటమే ఈ చరణ రచన.



## 68

**అల్పజ్ఞాన మదేది సుజ్ఞాన మేదయా**
**ఐక్యమంద కరుణింపరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! ఏది నిజమైన జ్ఞానము? ఏది అల్పజ్ఞానము? నాకు తెలియదు. నువ్వే అన్ని భ్రమలనూ తొలగించి దయతో నాకు నీ సత్యజ్ఞానము బోధించు!

**విశేషాలు**

జీవితమున ప్రతి క్షణము విలువైనదే. ఏ క్షణమున ప్రాణము పోతుందో మనకు తెలియదు. ముక్త పురుషులు శరీరము ఉండగనే శరీరాన్ని పంచభూతాలకు అప్పచెబుతారు. వారు ఎప్పుడైనా శరీరము విడచుటకు సిద్ధముగా ఉంటారు. అనగా శరీరము ఉండగనే శరీరమును విడచినవాడు ముక్తుడు.

సామాన్యులమైన మనం – దేహభ్రాంతితో అజ్ఞానులమైన మనం – మృత్యువు సమీపించు సమయమునకు శరీరము వదులుటకు సిద్ధముగా ఉండము.

కనుక శరీరమే మనను విడచిపెడుతుంది. శరీరముపై మమకారము వీడలేదు కనుక మరల శరీరమును ధరించాలి. జన్మ ఎత్తాలి.

భగవాన్ రమణులు ఇక్కడ చక్కటి పోలిక చెప్పారు.

"పిచ్చివాని శరీరముపై ఉన్న తుండుగుడ్డ ఎప్పుడు జారిపోయినదో అని అతనికి ఎట్లు తెలియదో, ఆ విధంగా ముక్త పురుషులకు శరీరం జారిపోతుంది. ఈ సత్యజ్ఞానాన్ని (దేహభ్రాంతి లేని జ్ఞానం) మనకు అనుగ్రహించమని రమణులు ఈ చరణంలో స్వామికి విన్నవిస్తున్నారు.



## 69

**భూ గంధమగు మది పూర్ణగంధము గొన**
**పూర్ణగంధ మొసగు మరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! ఈ భూమి గంధంతో (ప్రాపంచిక విషయవాసనలలతో) నా మనస్సు నిండిపోయింది. అటువంటి నా మనస్సును వాసనారహితంగా చేయవలసినది. నీలో సంపూర్ణంగా కలిసే అదృష్టాన్ని ఇవ్వు (పూర్ణగంధము ఇవ్వు) అప్పుడే నేను పూర్ణుడగుదును.

**వాసనలు**

సంస్కార సంబంధమైన గుణాలు, లక్షణాలు, చిత్తవృత్తులను వాసనలంటారు.

ఇవి మూడు విధాలు (వాసనాత్రయం):

1. లోక వాసనలు, 2. శాస్త్ర వాసనలు, 3. దేహ వాసనలు.

2. లోకంలో గుర్తింపు పొందాలనుకోవడం, అధికులుగా ఉండాలని కోరుకోవడం, ఏది చేసినా లోకాన్ని దృష్టిలో పెట్టుకొనే చేయడం లోకవాసన.

3. గ్రంథపఠనం, ఆయా విషయాలలో ప్రజ్ఞ సంపాదించాలనుకోవడం, శాస్త్ర జ్ఞానాన్ని కలిగి ఉండటం శాస్త్రవాసన.

4. దేహాన్ని శుభ్రంగా, ఆకర్షణీయంగా ఉంచుకోవడం, తీర్థయాత్రలు చేయడం,

ఉపవాసాలు చేయడం, యోగాభ్యాసం మొదలైన సాధనల ద్వారా ఐహిక ఆముష్మికాలను సాధించాలనుకోవడం దేహవాసన.

5. ఒకసారి బెజవాడ రమ్మని పెద్దన్నగారి వద్దనుంచి సూరి నాగమ్మగారికి జాబు వచ్చింది. భగవాన్ గోశాల వైపు నుంచి తిరిగి వచ్చేటప్పుడు దగ్గరగా వెళ్ళి "వాళ్ళు రమ్మంటున్నారు. వెడితే మళ్ళీ ఆ గొడవల్లో పడతానేమోనని జంకుగా వున్నదే?" అని నాగమ్మ అన్నారు. భగవాన్ చిరునవ్వుతో "అంతా వచ్చి మనలో పడితే మనమెక్కడ పోయి పడేది" అంటూ నడక సాగించారు. ఆమెకు "మనలో జగమున్నది గాని జగత్తులో మనము లేము" అన్న అద్వైతభావమే స్ఫురించినది.

6. "మనలో జగమున్నది గాని జగత్తులో మనము లేము" అను రమణుల బోధలో వాసనలను విడవమనే బోధ అంతర్గతంగా ఉన్నది.



## 70

**పేరు దలపగనే పట్టి లాగితివి నీ**

**మహిమ కనుదు రెవరరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! నీ పేరు తలుచుకొన్న మరుక్షణమే నీ దగ్గరకు నన్ను రప్పించుకొన్నావు. నీ మహిమను ఎవరు తనివితీరా వర్ణించగలరు?

**విశేషాలు**

తన అపారమైన దయతో అరుణాచలుడు శ్రీ భగవాన్‌ను చిన్నవయస్సులోనే ఆకర్షించి రప్పించుకొన్నారు. ఎవరో అరుణాచలమని ఒక మాటన్నారట. శ్రీ భగవాన్ మోహంతో అరుణాచలానికి ప్రయాణమయ్యారు. 'స్మరణాత్ అరుణాచలమ్' కదా!

మనస్సుకు పరిమితమైనవాడు జీవుడు, మనో మూలంలోనికి వెళ్ళినవాడు దేవుడు. మనో మూలంలోనికి వెళ్ళినవారి దేహమే దేవాలయమౌతుందన్నారు

రమణ మహర్షి. అరుణాచలుని మీద మనసు పడి, తన మనో మూలంలోనికి వెళ్ళినవారు కనుకనే రమణులు దేవుడయ్యారు.

మనస్సు బయటికి వెళితే బంధం, లోపలికి వెళితే మోక్షం. రమణుల ఆకర్షణ మనస్సు లోపలికి వెళ్ళిన స్థితిలోనుంచి పుట్టినది. సాధారణమైన మన ఆకర్షణల వంటిది కాదు.



## 71

**పోగ భూతము పోని భూతమై పట్టినన్**
**భూతగ్రస్తుని జేసితరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! ఈ లోకమనే (అహమను) పిశాచము నన్ను వశపరచుకొంది. ఆ పిశాచాన్ని నా నుండి పారిపోయేట్టు చేసావు. బాగానే ఉంది కాని ఆ స్థానంలో నీ కౌగిటిలో నన్ను పిశాచిలా బంధించావు. నన్ను ఒక భూతంలా చేసావు. ఇది నీ అనుగ్రహం.

**విశేషాలు**

అహంకారమను పిశాచాన్ని వదలగొట్టి దేవుడు ఆ స్థానంలోకి వచ్చాడో ఇక ఆ భక్తుడు – ఒక చిన్నపిల్లవానిలాగా, ఉన్మత్తునిలా లోకానికి కనబడతాడు. (బాల ఉన్మత్త పిశాచవత్) జ్ఞానులైనవారు 'బాలోన్మత్త పిశాచవత్', చిన్నపిల్లలవలె ప్రవర్తిస్తారనీ, కొన్నిసార్లు పిచ్చి పట్టిన వారివలె, పిశాచాలవలె సంచరిస్తారని శాస్త్రాలు చెబుతున్నాయి.

"కదాయోగీ కదాభోగీ కదానగ్నః పిశాచవత్ దత్తాత్రేయో హరిః స్సాక్షాత్ భుక్తి ముక్తి ప్రదాయకః బాలోన్మత్త పిశాచిభిః క్వచిద్ యుక్త పరీక్షితః త్యాగీ భోగీ మహాయోగీ నిత్యానందో నిరంజనః" అని దత్తాత్రేయ వజ్రకవచం.

దత్తాత్రేయ ఉపనిషత్ కూడా దత్తాత్రేయుని 'బాలోన్మత్త పిశాచ వేషాయ' అని పిలిచింది.

యూనివర్సిటీలో పెద్ద చదువులు ముగించి ఒక యువకుడు రమణ మహర్షిని చూడవచ్చాడు. అతని అభిమాన పాఠ్య విషయం సైన్సు.

అతడన్నాడు "విశ్వ పరమార్థాన్ని శోధించే సైంటిస్టుకు అజ్ఞానమనే మొండిగోడ ఎదురౌతుంది. ఇటు పరమాణు పరిశోధనలో ఏవో నిగూఢ విషయాలూ – ఎలక్ట్రాన్స్, ప్రోటాన్స్, పాసిట్రాన్స్ న్యూట్రాన్స్ – వాని ఉనికీ, వర్తించు రీతులూ తెలియవస్తాయి. అవి యూహకేగాని జ్ఞానేంద్రియాల కందవు. ఇక సకలానికీ మూలమైన ఏకైక వస్తువు అతీంద్రియమని వేరే చెప్పవలెనా? అటు, బృహత్పదార్థాల పరిశోధనలో పలువురు సృష్టికుపాదానకారణమనే 'నెబులే'ను (తారాధూళిని) మించినదీ లేదు. సర్వవిషయ మూలమైన కాలదేశముల రహస్యము భేదించనూ అలవిగా లేదు. దీని పరిష్కారమేమి?"

మహర్షి వివరించారు. "ఎఱిగెడు తనను ఎఱుగక యితరము నెఱుగుట యజ్ఞానమేగాని జ్ఞానమగునా? జ్ఞాన ఇతరముల కాధారమైన తనను ఎఱింగినచో జ్ఞానాజ్ఞానములు నశించును." భగవాన్ శ్రీ రమణులు తమిళమున నిబంధించిన 'ఉళ్ళదు నార్పదు'కు ('ఉన్నది నలువది'కి) 'మహాయోగము' సరియగు భాష్యము. ఉన్న సద్వస్తువును గూర్చిన యీ నలువది పద్యముల ప్రబంధము అసంశయముగ శ్రీ రమణోపనిషత్తు. వేదశీర్షములగు ఉపనిషత్తులకు నూతనముగ ఘటించిన మకుటమణి.

'నేను (అహంత) జచ్చి, తాను (సత్) వెలుగగ, తానే మిగిలియుండు వస్తువు (శుద్ధచిత్)' నారూఢిగ తెలియబలుకుటే సర్వవేదాంతసిద్ధాంతసారము. ఆ వస్తువు సదాసిద్ధము, దాని ఎఱుకకు ఋజుమార్గము ఆత్మవిచారమే యని రమణులు చెప్పిన "ఊళ్ళదునార్పదు" నిర్ణయము. (మహా యోగము పుస్తకమునుండి ఆంధ్రానువాదము: రామచంద్ర కౌండిన్య)

ఈ విచారణలో లోకానికి ఉన్మత్తునిలా కనబడే పిచ్చి పట్టాలంటే రమణుల అనుగ్రహం తప్పనిసరి.



## 72

**మృదులతన్ నే ప్రాపు లేక వాడగనీక**
**పట్టుకొమ్మయి కావు మరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! ఏ ఆధారమూ లేక లత నిలువలేదు. నేను ఆ లేత లత వంటిదానిని. బలమైన చెట్టు చుట్టూ లత అల్లుకొంటుంది. అలా నాకు కూడా నీ అండ కావాలి. అలా నాకు రక్షణగా నిలిచి నన్ను ఎల్లవేళలలోను రక్షించు.

**విశేషాలు**

శంకర భగవత్పాదులు కూడా ఇదే అంశాన్ని మరికొంత వివరణతో శివానందలహరిలో చెప్పారు.

ఆనన్దామృత పూరితా హరపదాంభోజాలవాలోద్యతా
స్థైర్యోపఘ్నముపేత్య భక్తి లతికా శాఖోపశాఖాన్వితా
ఉచ్చైర్మానస కాయమాన పటలీమాక్రమ్య నిష్కల్మషా
నిత్యాభీష్ట ఫలప్రదా భవతు మే సత్కర్మ సంవర్ధితా (49)

(భక్తి అను లత ఆనందము అను అమృతమయ జలములతో పోషింపబడి, శివుని పాదపద్మములు అనెడి పందిరి రాటపైనుండి ఎగబ్రాకి, స్థైర్యము అనెడి పందిరిపై గల కర్రలను ఆధారముగా చేసుకుంటుంది. ఆ తరువాత చిలవలు పలవలుగా, శాఖోపశాఖలుగా అల్లుకొంటూ ఉన్నతమైన మనస్సు అను పందిళ్ళ సమూహమును ఆవరించుకొంటుంది. పుణ్యకర్మలచే వృద్ధి పొందుతూ, చివరికి ఆ లత – శాశ్వతమైన మోక్షము అను ఫలమును ఇచ్చుగాక.)

ఆధునికులలో కొమ్మూరి వేణుగోపాలరావుగారు 'నేను' అను ఒక రచనలో ఈ రమణుల లతను ఒక పాత్రగా కల్పించి, రమణుల ప్రస్తావనతో – లతకు ఆధారాన్ని మనోహరంగా నిరూపించారు. ఆ రచనలోని చివరి వాక్యాలు ఇవి.

"రాత్రి రెండు దాటుతూన్నది. నిద్రపట్టటం లేదు. ఏదో తెలీని ఆనందం. ప్రపంచమంతా చాలా సుందరంగా, కొత్త కాంతులతో గోచరిస్తూన్నట్లు అనుభూతి. నాకు తెలిసినంతలో జీవన్ముక్తి పొందిన అతి కొద్దిమందిలో రమణమహర్షి ఒకరు.

ఆయన స్టేట్ ఆఫ్ మైండ్ – ఎలాంటి స్థితిలోనైనా యీ సృష్టి చాలా సుందరంగా కనిపించెడిది.

"లతా!" అని పిలిచాను.

తను కూడా నిద్ర పోలేదనుకుంటాను. "అమ్మా" అంటూ వచ్చింది.

"లతా! ఓ మనిషి బతకటానికి డబ్బు కావాలి. నిజమే. కాని కాపురముండ టానికి అవసరానికి పదింతలు మించిన యిల్లా? నాకే చిరాకనిపిస్తోంది. వేరే నిరాడంబరంగా, ఎంతవరకూ అవసరమో అంతవరకే చాలనిపించే యింట్లోకి వెళ్ళిపోదామనుకుంటున్నాను."

"మీ యిష్టమమ్మా!"

"అప్పుడు నువ్వు.."

"మీరెక్కడుంటే అక్కడే ఉంటానమ్మా, మిమ్మల్ని విడిచి ఉండలేనమ్మా!"

"నిన్ను మాత్రం నేనెలా వదులుకోగలను లతా!"

ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి. ఎక్కడో అరుదుగా ఓ మనిషికి యింకో మనిషి యిచ్చే అపూర్వమైన విలువ ఆ చూపుల్లో నిబిడీకృతమై వుంది.

"లతా! నాకు స్నానం చెయ్యాలని వుంది."

"ఇప్పుడా అమ్మా!"

"అవునిప్పుడే!"

నన్నర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తూన్నట్లుగా కళ్ళలోకి చూసింది.

ఓ అరగంటసేపు టబ్‌లో పడుకుని హాయిగా స్నానం చేశాను. షవర్ త్రిప్పుకుని తలారా కూడా స్నానం చేశాను. తర్వాత టవల్ చుట్టుకుని బాత్‌రూమ్ లోంచి బయటికొచ్చాను.

లత తడిసి విడిపోయి వున్న నా కురుల్ని తుడుస్తోంది.

"అమ్మా! మీరు చాలా కొత్తగా యింకా యింకా అపురూపంగా బంగారు కాంతులీనుతూ కనిపిస్తున్నారమ్మా."

ఒక్క క్షణం ఆలోచిస్తూ వుండిపోయాను.

ఆ క్షణం.. కొన్ని కోట్ల వజ్రాల విలువ గలది.

"లతా! అద్దం తీసుకురా" అన్నాను.

"అమ్మా మీరద్దం చూసుకోరుగా" అంది తటపటాయిస్తూ.

"ఫర్వాలేదు. తీసుకొనిరా."

లోపలికెళ్ళి ఓ నిమిషం తర్వాత తగు మాత్రం పెద్దదిగా, విశాలంగా వున్న అద్దం తీసుకొచ్చింది.

చేతుల్లోకి తీసుకొని నా ముఖాన్ని చూసుకున్నాను.

ఒక్క క్షణం..

నాకిప్పుడు ఏ భయమూ వెయ్యటం లేదు.

చాలా రోజుల తర్వాత తనివితీరా చూసుకుంటూన్న నా ముఖం.

నిశితంగా, లోతుల్లోకి, లోయల్లోకి పోయి గమనిస్తున్నాను.

ఎక్సరేలోంచి చూసినట్లు చూస్తున్నాను.

ఆ ముఖం..

లోపల దాగివున్న స్కల్‌ని ప్రదర్శించటం లేదు.

అంతేకాదు.

ఎంతో నిర్మలంగా, అందంగా, వెలుగులు చిమ్ముతూ, సౌందర్య రేఖలు చుట్టూ తిరుగుతూ వుండగా, మునుపెన్నడూ లేనంత కాంతివంతంగా అపూర్వ దృశ్యంగా గోచరించింది."



## 73

**పొడిచే మయికపర్చి నా బోధ హరియించి**
**నీ బోధ కనుపించితరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! నీ దయ అను మత్తుమందుతో నాకు మత్తు ఎక్కించావు. నా అహంకారాన్ని నశింపచేసావు. నా ప్రాపంచిక బంధాలన్నిటినీ తొలగించావు. నీ ఆత్మానుభవాన్ని నాకు కలుగచేసావు.

**విశేషాలు**

రమణులు ఇలా వ్రాస్తే - రమణ భక్తులు ఒకరు ఈ మత్తుమందును రమణులకే అన్వయించారు.

తెనాలి దగ్గర పెద్దపాలెం వాస్తవ్యులు కృష్ణయ్య అనునతను తను రచించిన 'ధనుర్దాసు చరిత్ర' అనే పద్యకావ్యాన్ని రమణాశ్రమమునకు వచ్చి శ్రీ రమణులకు అంకితమిస్తూ ఇలా వ్రాసారు.

"బహుమతులన్నిటిలోనికి కన్యనివ్వటం ఉత్తమమైనది కాబట్టి ఈ కావ్య కన్యకను పెండ్లియాడమని భగవాన్ రమణులకు సమర్పించుచున్నాను. నాకు తెలుసు, మీరింతకుముందే ముక్తికాంతను పెండ్లాడినారు. దయచేసి ఈ కావ్య కన్యకను కూడా స్వీకరించి తప్పులు దిద్ది, ఈమె బలహీనతలను క్షమించి బాగా చూచుకోండి.

నా వైష్ణవ కన్యకకు భగవాన్‌తో ఈ వివాహం జరగడం వాళ్ళ అద్వైతానికీ విశిష్టాద్వైతానికి పెండ్లి జరిగినట్లయింది. మీరు నా అల్లుడైనప్పటికీ మా ఇంటికి రండని అడుగలేను. ఎందుకంటే మిమ్మల్ని చూడడానికి ఎంతోమంది రాజులు, గొప్పవారు, సాధకులు ఎప్పుడూ వస్తూనే ఉంటారు కదా" అని వీడుకోలును అంతే చమత్కారంగానే అడిగారు -

"చూసినవారందరూ పరవశించేలాగా, ఈ నీ రూపంలో ఏ మాయలు దాచావ్?

అందరి శ్రమను పోగొట్టేలా, ఈ గాలిలో ఏ శక్తిని పొందుపరిచావ్?

అన్ని రోగాలను అణచివేయగల్గేలా, ఇక్కడి నీటిలో ఏ మందు కలిపావ్?

వచ్చినవాళ్ళు తిరిగి వెళ్ళుటకు అయిష్టపడేలా ఏ మత్తుమందు ఈ చుట్టుపక్కలా వెదజల్లావ్?

పురుషోత్తమా! మాలాంటి సామాన్యులకు రకరకాల కోరికలు కలుగుతుంటాయి. కొన్ని సఫలమౌతాయి, కొన్ని కావు. నా అన్ని కోరికలు ఇక్కడ తీరాయి. అందులో ఒకటి, ధనుర్దాసు చరిత్రను పద్యకావ్యముగా వ్రాయాలని, రెండు, బంధుమిత్ర సపరివారంగా వచ్చి నా కావ్యకన్యక చేతిని మీకందివ్వాలని, మూడవది, ఈ పెండ్లి విందును మీతో కలిసి తృప్తిగా ఆరగించాలని నాల్గవది,

ఇక్కడ కొన్ని రోజులుండి మీ దర్శనంతో నా కనులకు విందు చేయాలని.మీ కృపవలన నా ఈ కోరికలన్నీ తీరాయి.

పురుషోత్తమా! నీ గొప్పతనాన్ని నీవు మాత్రమే తెలుసుకోగలవు, మేమెంత కాలం ఇక్కడ ఉన్నా, తిరిగి వెళ్ళుటకు మా పాదాలు కదలవు. నేనేమి చేయగలను?ఓ పావనుడా! నేను వెళ్ళడానికి మీ అనుమతిని దయచేసి ఇవ్వండి.”



## 74

**పోకరాకలు లేని సమరంగ దివి జూపు**

**మా కృపా పోరాట మరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! రాకపోకలు అంటూ ఏమీ లేని చిదాకాశంలో నిరంతరం జరిగే పోరాటంలో నీ దయ మాకు విజయాన్ని కలిగిస్తుంది

**వివరణ**

సర్వానికి ఆధారమైన, ఆకాశంలా నిర్లేపం ఐన చిత్తుని (శుద్ధ బ్రహ్మ స్వరూపము) చిదాకాశం అంటారు.

చిదాకాశం (శుద్ధ బ్రహ్మస్వరూపము) ఆత్మ స్వరూపం. మనసు అదుపులో ఉంటే నానాకార దృష్టి పోయి ఏకాకార దృష్టి కలుగుతుంది.

శరీరము నేను అనుకొనే అజ్ఞాన తాత్పర్యం ఉన్నంతవరకు రాకపోకలు (పుట్టుక, చావు) తప్పవు. ‘నేను సర్వానికి ఆధారమైన, ఆకాశంలా నిర్లేపం ఐన చిత్తుని. శుద్ధ బ్రహ్మస్వరూపాన్ని’ అనే భావన వస్తే స్థిరమయితే, అజ్ఞానానికి, బ్రహ్మ భావనకి మధ్య జరిగే పోరాటం ఆగిపోతుంది.

ఆ ‘శుద్ధ బ్రహ్మస్వరూపాన్ని’ అనే భావన కలగాలంటే అరుణాచలేశ్వరుని దయ తప్పనిసరని రమణులు ఈ చరణంలో వివరించి దానికోసం ప్రార్థించారు. మానవులు అమృతానుభవం పొందడానికే మానవజన్మ ప్రసాదింపబడినదని రమణులు చెప్పేవారు. ఈ బోధని సార్థకం చేసుకొందాం.



## 75

**భౌతికమౌ మేని పట్టార్చి ఎపుడు నీ**
**మహిమ గన కరుణింపరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! ఈ దేహాత్మ బుద్ధిని వదిలించు. ఎప్పుడూ నీ సత్స్వరూపాన్ని చూసి ఆనందించేటట్లు నన్ను అనుగ్రహించు.

**వివరణ**

పంచ భూతాత్మకమైన ఈ శరీరం పట్ల మమకారం పోయి, స్వామి తేజస్సులో విలీనమయ్యే అదృష్టాన్ని అనుగ్రహించమని రమణులు కోరుతున్నారు.

'తెర లేకుండా బొమ్మలు లేవని' తెలుసుకుంటే, 'చూచేవాడు లేకుండా చూడబడేది లేదు' అని తెలుసుకుంటే ఎవరూ భ్రమ చెందరు.

జ్ఞానికి బొమ్మలూ, తెర రెండూ ఆత్మేనని తెలుసు.

జ్ఞానికి దేహాత్మ బుద్ధీ ఉంటుంది. కాకపోతే, ఇదంతా ఆత్మే, బ్రహ్మమే అనుకుంటాడు. నొప్పి ఉంటే ఉండనీ, అది కూడా ఆత్మలో భాగమే. ఆత్మ పరిపూర్ణమని భావిస్తాడు.

మనకు కావలసిందల్లా, ఆత్మసాక్షాత్కారం కాలేదన్న భావాన్ని తొలగించు కోవటమే. మనమెప్పుడూ ఆత్మే. ఎటొచ్చీ మనం ఆ విషయాన్ని గ్రహించం.

మనస్సణగితే, ప్రపంచమూ అణగిపోతుంది. అంతటికీ మూలకారణం మనస్సే. అది అణగితే సహజస్థితి ప్రకటితమవుతుంది.

ఆత్మ ఎప్పుడూ 'అహం–అహం' అంటూనే ఉంటుంది. అది స్వయంప్రకాశం. మనం దానిలోనే ఉన్నాం. అందులోనే ఉంటూ దానికోసం వెతకటం దేనికి?

'దృష్టిని జ్ఞానంలో నిమగ్నం చేస్తే ప్రపంచమంతా బ్రహ్మంగా గోచరిస్తుం'దని మన పూర్వీకులు ఎప్పుడో చెప్పారు. ఈ శరీరం పట్ల మమకారాన్ని తొలగించుకొంటే ('నేను ఈ దేహాన్ని' అను భావాన్ని) సత్యం యొక్క (భగవంతుని) దివ్యతేజస్సుని చూసే అర్హత లభిస్తుంది. రమణులు ఈ చరణంలో చెప్పినది ఇదే.



## 76

**మలమందు నీ వియ్య మలగుటయో కృపా?**

**మలమందువై వెలుగరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! నీ దయ నా దేహ భ్రమలన్నిటినీ తీసివేసింది. అయినా మళ్ళీ నా అవిద్యాస్థితిని (మోహాన్ని) ఎట్లా పొందగలను? లౌకిక మమకారాలనే అజ్ఞానాన్ని పోగొట్టడానికే కదా అరుణగిరిగా నువ్వు వెలిసావు?

**విశేషాలు**

"ఒక వ్యక్తి తన నిజ స్వతాత్పర్యం ఏమిటో తెలుసుకునే వరకు వేసిన ప్రశ్న వేయకుండా ఏదో ఒకటి అడుగుతూనే ఉంటాడు. అస్వాభావికమైనవన్నీ స్వభావమనుకుని భ్రమపడతాడు. ఈ భ్రమ మనిషికి కప్పిన తెర తొలిగిపోయే వరకు స్వతాత్పర్యం అంటే ఏమిటో బోధపడదు. భ్రమ తొలగటం అంటే మనసు అదుపులో ఉండటం అంటే నానాకార దృష్టి పోయి ఏకాకార దృష్టి కలగడం. అది తెలిసినప్పుడు భ్రమ తొలగి అంతా స్వాభావికమే అవుతుందని భగవాన్ రమణులు ఒకసారి చెప్పారు.

ఈ భ్రమ పోవాలంటే అరుణగిరి దర్శన, ప్రదక్షిణ పాత్ర చాలా ఉన్నదని రమణులు – "లౌకిక మమకారాలనే అజ్ఞానాన్ని పోగొట్టడానికే కదా అరుణగిరిగా నువ్వు వెలిసావు?" అని రమణులు ఈ చరణంలో మనకు చెప్పకుండానే చెప్పారు.



## 77

**మానము గొని చేరు వారి మానము బాపి**

**నిరభిమానత వెలుగరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! నేను అను అభిమానముతో నీ దగ్గరకు వచ్చిన భక్తుల అహంకారాన్ని పోగొట్టు. వారి హృదయాలలో వైరాగ్యస్థితిని కలిగించి నిరభిమానముగా ప్రకాశించు.

**విశేషాలు**

"నిద్రపోయే ముందు, నిద్రనుండి మేల్కొన్న వెంటనే 'నేనెవరు' అని ప్రశ్నించుకోవాలి. ఈ రెండు సమయాల్లో అఖండ విశుద్ధ ప్రజ్ఞ ఒక్క తృటికాలం పాటు ఉంటుంది. ఇవి ధ్యానానికి ఉత్తమ సమయాలు. మనస్సు అప్పుడు పరిశుద్ధంగా ఉంటుంది.

'నేనెవరు' అనే విచారణతో మనస్సు అణుగుతుంది. ఈ 'నేను' అనే ఆలోచన మనసులో విచారించే ఇతర ఆలోచనలను అణగదొక్కి చివరకు మనసే తన ఉనికిని కూడా కోల్పోయి అణిగిపోతుంది. 'నేను' అనే ఆలోచన అన్ని ఆలోచనలను నశింపచేసి, తాను నశిస్తుంది" అని రమణులు చెప్పారు. ఈ శక్తిని కలిగించమని ఈ చరణంలో రమణులు అరుణాచలేశ్వరుని కోరారు.



## 78

**మించగా వేడెడు కించిజ్ఞుడను నను**
**వంచింపకను బ్రోవు మరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! నన్ను మించినవారి ముందు నేను అల్పుడను. నన్ను మించినవాడివి నువ్వు. కనుక నీ ముందు నేను అల్పుడను. ఇదిగో ఇవాళ, రేపు అంటూ మాటలతో నన్ను మోసము చేయక వెంటనే కాపాడవయ్యా!

**విశేషాలు**

"ఓ అరుణాచలా! నేనొక మూర్ఖుణ్ణి. కొంతమాత్రమే తెలిసినవాడిని. భరించలేని బాధలు నన్ను పీడిస్తున్నప్పుడు, వాటిని తట్టుకోలేని సమయాల్లో మాత్రమే ఓడిపోయి నీ పాదాల దగ్గరకు చేరతాను. ఇతర సమయాలలో, నిన్ను గర్వంతో తలచుకోను. నా బుద్ధిని మన్నించి నన్ను కాపాడుము. అనుగ్రహానికి వాయిదాలు వేసి మోసం చేయకు"మని ఇంకో అంతరార్థం.



## 79

**నావికుడుండక పెనుగాలి నలయు నా**

**వను గాక కాచి బ్రోవరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! ప్రవీణుడైన నావికుడు లేని ఓడ పెనుతుఫానులో చిక్కుకొని గమ్యం లేకుండా కొట్టుకొనిపోతుంది. ఈ సంసార సాగరములో నా జీవితము కూడా అటువంటి నావ. దారి తెన్నూ లేక కొట్టుకొనిపోతున్నాను. ఈ జీవన నావని ఒడ్డుకి చేర్చే నావికుడివి నువ్వే. నన్ను కాపాడు.

**విశేషాలు**

కావ్యకంఠ గణపతి ముని ప్రసిద్ధమైన 'శుక్లాంబరధర..' శ్లోకాన్ని రమణ మహర్షి పరంగా ఇలా వ్యాఖ్యానించారు.

"తెల్లని కౌపీనమును ధరించెను కనుక శుక్లాంబరధరుడు. సర్వవ్యాపకుడు కనుక విష్ణువు. చంద్రుని వలె శోభించు శరీరము కలవాడు కనుక శశివర్ణుడు. మనోబుద్ధ్యహంకారచిత్తములను నాల్గింటిని భుజించినవాడు కనుక చతుర్భుజుడు. చూసేవారికి ప్రసన్నవదనుడు. ధ్యానించువారికి సర్వవిఘ్న నాశకుడు."

ఈ వ్యాఖ్యానాన్ని విని రమణులు చిరునవ్వుతో కావ్యకంఠ గణపతి మునిని అభినందించారట. అటువంటి చిరునవ్వుల రమణులు తను స్వయంగా రచించిన ఈ 'అక్షర మణమాల' చరణంలో మనకోసం వకాల్తా పుచ్చుకొని దైవాన్ని ప్రార్థించారు. కాదు– దైవాన్ని ప్రార్థించవలసిన విధానాన్ని మనకు తెలిపారు.



## 80

**ముడిమూలముల్ గానమనుకొంటివి సరిగ**

**ముగియ భారము లేదో అరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! నేను అజ్ఞానిని, నా అజ్ఞానానికి ఇది చివర, ఇది మూలము అని తెలుసుకోలేకపోతున్నాను. నేను నా అజ్ఞానాన్ని నీవు నాకు తల్లివంటివాడివి.

కనుక అజ్ఞానమనే ఈ చిక్కుముడిని (గ్రంథిని) విడదీసే భారము నీమీద ఉంది కదా!

**విశేషాలు**

గ్రథనమంటే కూర్చటం. Compilation అలా కూర్చినదేదో అది గ్రంథం. ముడిపెట్టటమని కూడా అర్థమే. గ్రంథి అంటే ముడి. Knot లాక్షణికంగా చెబితే హృదయంలో కలిగే సంశయ విపర్యయాది వాసనలు. జన్మజన్మలనుంచి పేరుకొని ఉన్న ఈ సంస్కారాలకే impressions. Instincts గ్రంథులని పేరు. 'భిద్యతే హృదయ గ్రంథిః.' అలాటివన్నీ సమూలంగా తొలగిపోతేనే కారణ శరీరం భంగమవుతుంది అంటే అజ్ఞానం నిర్మూలనమవుతుంది. అజ్ఞానం తొలగితేనే జ్ఞానప్రాప్తి. (శ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు)

మానవ శరీరం – నరకం వంటి ఇల్లు. భ్రమతో శరీరమే తాననుకునేవాడు – నరకుడు. నరకుని జ్ఞానజ్యోతితో అణచినవాడు – నారాయణుడు, అనగా మనలోని చైతన్యం. చైతన్యానికి బాహ్యచిహ్నం దీపారాధన, దీపముల పంక్తి. ఇదే నరక చతుర్దశి, దీపావళి అని ఒక సందర్భంలో అన్నారు – భగవాన్ రమణ మహర్షి.

రమణ మహర్షి ఈ చరణంలో మనందరి అజ్ఞాన విముక్తి కోసం ప్రార్థన చేసారు.



## 81

**ముక్కిడి మును జూపు ముకురము గాక నన్**

**హెచ్చించి కౌగిలింప రుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! ఎవరికైనా ముక్కు కోసేస్తే అతను ఎంతో బాధపడతాడు. దానికి తోడు అతని ముందు అద్దాన్ని పెట్టి ముఖం చూసుకోమంటే ఇంకా బాధ పడతాడు కదా! అలాగే నా దోషాలని నాకు చూపించకు. చాలా బాధపడతాను. నా లోపాలను ఎత్తి చూపక బాధపెట్టక క్షమించి నన్ను కౌగిలించుకొని నీ సొంతం చేసుకో. నాపై దయ చూపు.



## 82

**సత్యాహమున మనో మృదు పుష్పశయ్యపై**
**మేన్గలయ కరుణింపరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! నా భౌతిక శరీరమనే మందిరంలో మనస్సు మెత్తని పూల పాన్పు వలె ఉన్నది. అహంకారం లేని ఆ మనస్సు అనే ఈ మెత్తని పాన్పుపై మనం కలిసిపోదాం. దయతో ఆ అనుగ్రహం చూపించు.

**విశేషాలు**

జీవాత్మ పరమాత్మతో కలవాలని పడే ఆవేదనను రమణులు ఈ చరణంలో ప్రకటించారు.

భగవంతునితో హృదయం ఏకం కావాలని ఇందులో ప్రబోధం.

భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యన్తే సర్వసంశయాః।
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥

(ఎగుడు, దిగుడులలో కూడా ఆత్మను సాక్షాత్కరించుకోవడం వల్ల అతని అజ్ఞానపు ముడి విడిపోతుంది. అన్ని సంశయాలు సమసిపోతాయి. అన్ని కర్మలు క్షయించిపోతాయి.) అను ముండకోపనిషత్తు వాక్యం ఇక్కడ స్మరణీయం.



## 83

**మీదు మీదుగ మ్రొక్కు భక్తుల జేరి**
**నీవందితే మేలిమి యరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! ఏ విధమైన అధికారమూ లేనివాళ్ళు, నిరుపేదలు, కపటం లేని అమాయకులు నీ భక్తులు. ఆ భక్తులను కలిసి కీర్తిప్రతిష్ఠలను పొందావు.

**విశేషాలు**

అరుణాచలేశ్వరుని భక్తులు కావటానికి ఎవరికయినా అర్హత ఉన్నదని రమణులు ఈ చరణంలో పేర్కొన్నారు.

ఒకసారి భగవాన్ రమణుల ఎడమ మోచేతి దగ్గర చిన్న బఠాణీగింజంత కురుపు కన్పించింది. శస్త్రచికిత్స చేస్తామన్నారు డాక్టర్లు. భగవాన్ రమణులు అంగీకరించలేదు. ‘‘కురుపు ఎదిగితే ఎదుగుతుంది? దాని పని అది చూసుకుంటుంది? మనమెందుకు దానిని కదల్చటం?” అన్నరాయన. అయినా డాక్టర్లు భగవాన్‌ను ఒప్పించి శస్త్రచికిత్సతో దానిని తీసేశారు. కాని అది మరల పెరిగింది. ఛటకావైద్యం కూడా చేసారు. లాభం లేకపోయింది. శస్త్రచికిత్స చేశారు. కొద్దిరోజులు నయమనిపించింది. రక్తం కారటం ఆరంభించింది. భక్తులు భయభ్రాంతులయ్యేవారు. వారిని నవ్వించేవారు రమణులు. “ఆభరణమయింది. ఎంత ఎర్రగా ఉన్నదో చూచారా? ఆ సూర్యరశ్మి దానిమీద పడి ధగధగ ప్రకాశిస్తున్నది చూడండి” అనేవారు.

రమణులు ఆ పుండును పట్టించుకునేవారు కాదు. ఎందరో ఆయనను ప్రార్థించేవారు. తమకు తామే దానిని నయం చేసుకోమని. “సరిపోయింది. శరీరం ఒకటి ఉన్నదని, ఆ శరీరానికి చేతులున్నవనీ, అందులో ఒక చేతికి వ్రణమని మీరంతా అంటుంటే విని, ఆ దృష్టితో చూస్తే తెలుస్తున్నది. కానీ, నాకేమీ తోచడం లేదు. ఎవరి కొరకు సంకల్పం తెచ్చుకుని (వ్యాధిని) నివారించుకోవాలి?” అన్నారు భగవానులు. (యంపి సాయినాథ్)

రమణుల సన్నిధిలోని భక్తులు అలా ఉండేవారు. రమణులు తన కీర్తి ప్రతిష్ఠలను తన భక్తుల ద్వారా వ్యాపింపచేయటానికి భక్తులకు సు‘వర్ణా’వకాశం ఇచ్చారు. తరింపచేస్తున్నారు. ఓం నమో భగవతే రమణాయ.



## 84

**మై మై దణచి కృపాంజనమున**

**నీ సత్య వశ మొనరించితివరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! నా అజ్ఞానమనే చీకటి సత్యానికి నన్ను దూరం చేసింది. నీ దయను నాపై చూపించు. నీ దయ అను అంజనం నా మోహమనే చీకట్లో నిన్ను దర్శింపచేసి నీ వశం చేసింది.

**విశేషాలు**

అంజనమంటే కాటుక అని సామాన్యార్థం. దూరంగా ఉన్న వస్తువులనో, వ్యక్తులనో ఉన్నచోటనే ఉండి చూడటానికి అవకాశం కలిగించే ఒక మంత్ర/ తంత్ర విద్య. మంత్ర తంత్రాలు తెలిసినవాళ్ళు వేసే ఈ అంజనం నాలుగు విధాలు. మొదటిది – భూతాంజనం, రెండవది – ధనాంజనం, మూడవది – దేవతాంజనం, నాలుగవది – చోరాంజనం.

భూతాంజనం అంటే ఎవరికైనా ఏదో ఒక భూతం ఆవేశించినదని భావించినప్పుడు అది ఏ భూతమో తెలుసుకోవడానికి వేసే అంజనం. ఇలాగే మిగతా అంజనాల ప్రయోజనాలను సైతం అర్థం చేసుకొనవచ్చు. రమణులు ఇక్కడ దయను అంజనంతో పోల్చారు. ఈ దయ అను అంజనం సత్యాన్ని (అరుణాచలేశ్వరుడిని) దర్శింపచేస్తుందని తాత్పర్యం.

**తదేవం నిష్కళం బ్రహ్మ నిర్వికల్పం నిరంజనం**
**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా బ్రహ్మ సంపద్యతే ధ్రువమ్** (అమృతబిందూపనిషత్ – 8వ శ్లోకం)

"ఆ బ్రహ్మము – నిష్కళముగాను, నిర్వికల్పముగానూ, నిరంజనముగాను అనగా శాంతమైనది, మనస్సునకు కార్యము లేనిది ఉన్నది – ఆ బ్రహ్మమే నేను అని తెలుసుకొనిన యెడల సత్యముగా బ్రహ్మమే యగుచున్నాడు."

ఈ ఉపనిషత్తులోని నిరంజన పదాన్ని రమణులు ఈ చరణంలో ప్రయోగించారు. 'అంజనం' అంటే ఆనందతాత్పర్యం. ఆనందతాత్పర్యం రహితం అయిపోయింది పరబ్రహ్మస్థితిలో. ఆ స్థితి మనందరికి రావాలని మహర్షి ఆకాంక్ష.



## 85

**మొగ్గ (బోడి) పఱిపి నను బట్ట బయట నీవు**
**నట్టాడు టేలొకో అరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! నా నుండి అన్నిటినీ పోగొట్టావు. నా అహంకార మమకారాలను బోడి చేసావు (పోగొట్టావు) ఆనందమయమగు నీ ఉనికితో నా హృదయాన్ని నింపావు. నా హృదయాన్ని నీ ఆటస్థలంగా చేసుకున్నావు.

**విశేషాలు**

శిరోముండనం అహం యొక్క నాశనాన్ని సూచిస్తుంది. అహంభావము లేని హృదయం ప్రభువు విరహించే రంగస్థలంగా మారుతుంది. శివుని యొక్క నృత్యం సంపూర్తిగా ఆనందం యొక్క వ్యక్తీకరణ. చిదాకాశంలో నటరాజు ఆనందం యొక్క నృత్యం చేస్తాడు. అనగా సర్వము కోల్పోయిన హృదయంలో ఇది జరుగుతుందని రమణులు ఈ చరణంలో సూచిస్తున్నారు



## 86

**మోహము ద్రిప్పి నీ మోహ మొనర్చి నా**
**మోహము తీరదా అరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! భౌతికమైన కోర్కెలను నా హృదయంలోంచి తీసివేసి, ఆ మోహాన్ని తప్పించి నీపై వ్యామోహాన్ని నాలో పెంచావు. నీపై ఉన్న ఈ వ్యామోహాన్ని కూడా తీసివేసేయ్!

**విశేషాలు**

నీపై ఉన్న ఈ వ్యామోహాన్ని కూడా తీసివేసేయ్! అను వాక్యాన్ని కొంచెం పరిశీలిద్దాం. “నీవు – అనే తాత్పర్యం ఉన్నంత కాలం సాధకునికి నిజమైన జ్ఞానం రాదు. భగవంతుడు వేరు, తాను వేరు అను ద్వయీ తాత్పర్యం కూడా పోవాలి. అద్వైతం రావాలి. తాను భగవంతుడు ఒకరే అను తాత్పర్యం రావాలంటే భగవంతునిపై కోరిక ఉండే స్థితి పోవాలి. మమేకమై పోవాలి. ఈ ఉన్నత స్థితి కొరకు మనం ప్రార్థించాలని రమణ మహర్షి ఈ చరణంలో బోధిస్తున్నారు.



## 87

**మౌనియై రాయిగా నలరకయున్నచో**
**మౌనమిది యగునొ అరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! కటికరాయి వలె ఉన్న మౌనస్థితి నిజమైన మౌనము కాదు. అది ఆదర్శనీయము కాదు.

**విశేషాలు**

మనసు నిజముగానే మౌనమవటానికి హృదయమనే పద్మం పూర్తిగా వికసింపవలసిన అవసరము ఉన్నదని రమణులు ఈ చరణంలో ప్రబోధిస్తున్నారు. మనస్సుని మౌనముగా చేయటమే అసలైన మౌనం. అనగా అహంకారం నశించి, కోరికల ఆలోచనలు లేని మౌనమని తాత్పర్యం.

ఎవరైనా ఎక్కడికైనా వెళ్ళదలిస్తే శ్రీ భగవానుల వద్దకు వచ్చి “వెళ్ళవచ్చునా?” అని అనుమతి తీసుకునేవారు. “నేను మద్రాసు వెళుచున్నాను లేక ఇంకెక్కడికో ప్రయాణం చేయవచ్చునా?” అని అడుగగా భగవానులు ఒక్కొక్కసారి “సరే” అని మరికొన్ని సందర్భాలలో మౌనంగా ఉండిపోయేవారు. భగవాన్ అంగీకరించారని ఎంతో సంతోషంగా భక్తులు ప్రయాణమయ్యేడివారు.

ఎవరైనా నిజంగా ఆయన అనుమతి తీసుకోవాలనే ఉద్దేశంతో ఆయన వద్దకేగి ఏమైనా అడిగితే రమణులు తమ అంగీకారాన్ని మౌనంగా ప్రకటించేవారు.

మౌనం ఆధ్యాత్మిక సాధనకు మార్గం అయితే, జపాలు, తపాలు, కీర్తనల మాటేమిటి? ఇవన్నీ దైవంపై మనసు కేంద్రీకృతం చేయడానికి ఉద్దేశించినవే! అయితే దైవత్వాన్ని మనస్ఫూర్తిగా అనుభవించడానికి మౌనం కన్నా మహత్తరమైన సాధన లేదని చెబుతుంది రమణుల జీవితం.

జపం చేస్తున్నామనుకోండి. పెదవులు మంత్రాన్ని పలుకుతుంటాయి. చేతిలో జపమాల తిరుగుతుంటుంది. మనసు జప సంఖ్యపైకి మళ్లుతుంది. చివరగా సంకల్పం పక్కదారి పడుతుంది. సాధన సమర్థవంతంగా సాగాలంటే జపం ఆగిపోవాలి. జపమాల తిప్పడం మరచిపోవాలి. మనసులో మౌనం ఆవహించాలి.

అప్పుడు ధ్యానం ఉన్నతస్థితికి చేరుకుంటుంది. మంత్రసాధనలో ఉన్నతమైనది మౌనసాధన. మౌనం శక్తిమంతమైనది, ప్రశాంతమైనది. ఇదే మహర్షి మనకు అందించిన రమణీయ మౌనం! (– వివిఎస్సార్ మూర్తి)



## 88

### ఎవరు నా నోటిలో మన్నును గొట్టి నా
### బ్రతుకు హరించిన దరుణాచలా!

**తాత్పర్యం**

అరుణాచలా! నా నోటిలో మట్టికొట్టి నా జీవితాన్ని హరించినది ఎవరు? నువ్వే కదా!

**విశేషాలు**

నోటిలో మట్టి ఉంటే ఇంక దేనిపట్ల రుచి రాదు. అలాగే నా నోట్లో మట్టి కొట్టావంటే లోపల ఉన్న అర్థం ఇది.

లౌకిక విషయాల పట్ల జీవునికి విముఖత, రుచి కలుగకుండా అరుణా చలేశ్వరుడు చేసాడని తాత్పర్యం. భక్తుని పట్ల అనుగ్రహం కలిగితే అతనికంటూ ప్రత్యేకమైన జీవితాన్ని భగవంతుడు ఉంచడు. వ్యక్తిగత చైతన్యాన్ని ధ్వంసం చేసి విశ్వచైతన్యములో అతనికి అభిరుచి కలిగిస్తాడు. దీనినే రమణులు ఈ చరణంలో పేర్కొన్నారు.

శివానందలహరి అంతా సమయము లేకపోవుటవలన పారాయణము చేసుకోవడము కుదరనివారికి, నిత్యపారాయణ కోసమని 10 అతిముఖ్య శ్లోకములను భగవాన్ శ్రీ రమణ మహర్షి తెలిపారు. అలా భగవాన్ రమణులు ఎంపిక చేసిన 10 శ్లోకములలో ఒక శ్లోకమిది.

ఇందులో ఈ చరణంలో పేర్కొన్న మట్టి ప్రస్తావన కనబడుట గమనార్హం.

ఘటో వా మృత్పిణ్డోఽప్యణురపి చ ధూమోఽగ్నిరచలః
పటో వా తన్తుర్వా పరిహరతి కిం ఘోరశమనమ్
వృధా కణ్ఠక్షోభం వహసి తరసా తర్కవచసా
పదాంభోజం శంభోర్భజ పరమసౌఖ్యం వ్రజ సుధీః (6)

'కనబడుచున్న ఆ వస్తువు కుండయా? లేక మట్టియా? లేక అణువులా?' వంటి తర్క వాదములు.

"దూరముగా ఆ కొండపై పొగ కనిపించున్నది కాబట్టి అచట నిప్పు వుండి తీరవలెను" వంటి హేతువాదములు "దీనిని వస్త్రముగా చూడవలెనా? లేక దారముల సమూహముగా చూడవలెనా?" వంటి శుష్క వాదములను తీవ్రస్థాయిలో చేయుటవలన కేవలము వ్యర్థముగా కంఠశోష తప్ప ఎంత మాత్రము ప్రయోజనము లేదు. అట్టి అనవసర వాదములు మనలను ఘోరమగు మరణమునుండి ఏమైనా రక్షించగలవా? అందువల్ల, ఓ బుద్ధిమంతుడా! వాటి బదులు పరమశివుని పాద కమలములను పూజించుచూ పరమ సౌఖ్యములను పొందుము. (గొర్తి సుబ్రహ్మణ్యం గారి అనువాదం)



## 89

**ఎవరు గనుక నాడు మదిని మైక పరచి**

**కొల్లగొనిన దెవ రరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! దగ్గరగా ఉన్నవారికి కూడా తెలియకుండా నా మనస్సుని మైకంలో ముంచి దోచేసి వశం చేసుకున్నావ్! ఈ దోపిడీ గురించి నీకూ, నాకూ మాత్రమే తెలుసు.

**విశేషాలు**

భగవంతునిపై తనకు విశేషమైన భక్తి ఉన్నదని భక్తుడు వ్యంగ్యంగా ఈ చరణంలో తెలియచేస్తున్నారు. మనస్సులో అరుణాచలేశ్వరుడు తప్ప వేరొకరు లేనంత గాఢమైన భక్తి ఉన్నదని భక్తుని మాట.

ఈ అరుణాచలేశ్వరుడు సాక్షాత్ జ్యోతిర్లింగ స్వరూపమని, గిరి ప్రదక్షిణం చేస్తే సాక్షాత్ ఆ శివునికి ప్రదక్షిణం చేసినట్టేనని రమణ మహర్షి పదేపదే ప్రస్తావించారు. అరుణాచలాన్ని తలచుకుంటే అన్ని బంధనాలు తెంచుకుని స్వేచ్ఛా

జీవులమవుతాం. రమణ మహర్షి ఈ ప్రాంతాన్ని హార్ట్ ఆఫ్ ఎర్త్ (భూ హృదయం)గా అభివర్ణించారు. ఈ చరణంలో హృదయంలో నిండిన ఆ అరుణాచలేశ్వరుడిని ఉన్నతంగా భావించారు.



## 90

**రమణు డనుచు నంటి రోషము గొనక నన్**

**రమియింపచేయ రమ్మరుణాచలా!**

**తాత్పర్యము**

ఓ అరుణాచలా! నా ప్రియుడవు నీవే! నీ ప్రియురాలిని నేనే. నిన్ను రమణుడని ప్రేమతో పిలుస్తున్నాను. గొప్పవారిలో అతి గొప్పవాడివి నువ్వు. అటువంటి నిన్ను నా ప్రియుడవని పిలుస్తూ సాహసం చేస్తున్నాను. అటువంటి నా చనువుకు రోషపడక నన్ను సంతోషపెట్టు.

**విశేషాలు**

తెలుగు సాహిత్యంతో కొద్దో గొప్పో పరిచయమున్నవారికి చలంగారి పేరు పరిచయమే. ఆయన చివరి రోజుల్లో రమణ మహర్షి భక్తులయ్యారు. గిరిప్రదక్షిణం చేస్తున్న రమణ మహర్షి దారికి ఒక రోజు అడ్డంపడి "స్వామీ మీ కరుణ కావాలి" అని ప్రాధేయపడేవాడు. ప్రతీ రోజూ అదే అడిగేవాడట.

ఒకనాడు రమణ మహర్షి "అదిదా ఎప్పుడూ ఉండాది" అని జవాబిచ్చారు. సూర్యుని వెలుగు సూర్యుడు ఉన్నంతసేపు ఎప్పుడూ ఉంటుంది. నువ్వు తలుపులు మూసివేసుకొన్నావ్. సూర్యుని వెలుగు కావాలంటే తలుపులు తెరువు అని దీనిలో తాత్పర్యం.

ఆ తలుపులు తెరిచే ప్రయత్నమే ఈ 90లో రమణ మహర్షి చేసారు. దేవుడిని తనలో కలుపుకోవటానికి సులభమైన మార్గమయిన ప్రేయసీ ప్రియ భావాన్ని ఈ చరణంలో చేసారు.



## 91

**రేయింబవలు లేని బట్టబయటి ఇంట**

**రమియింపగా రమ్ము అరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! రాత్రిగాని, పగలుగాని లేని, అవధి లేని చిదాకాశంలో, నిత్యానందంలో మనమిద్దరమూ కలిసి పోదాము, రా!

**విశేషాలు**

మనం గాఢనిద్ర నుంచి మేల్కొన్న తర్వాత. 'నాకు ప్రపంచమే తెలియలేదు. నా ఇల్లు కూడా మరచిపోయాను' అంటాం.

కలలు కూడా లేని గాఢనిద్రలో మనసు తన మూలంలో విశ్రమించడం దీనికి కారణం. 'ఆత్మవిచారం' (నేను ఎవరు) అనే మార్గాన్ని అభ్యసించి మేల్కొని ఉండగా కూడా ఆ స్థితిని అందుకోవచ్చని రమణులు బోధించారు.

చిదాకాశమంటే సర్వాధారమునూ, ఆకాశం వలెనే నిర్లేపం ఐన చిత్తు (శుద్ధ బ్రహ్మం), మరోమాటలో చెప్పుకోవాలంటే హృదయాకాశం.

రాత్రి, పగలు అనేవి శరీరానికి సంబంధించినవి. హృదయానికి రాత్రి గాని, పగలు గాని ఉండవు. మనస్సు నశిస్తే నిత్యమైన సుఖశాంతులు లభిస్తాయి. మనస్సును నశింపచేయుమని రమణులు ఈ కీర్తనలో మన తరఫున అరుణాచలేశ్వరుని ప్రార్థిస్తున్నారు.

పెదవులపై ఉన్న మౌనం, మనసు పొరలదాకా చేరుకోవటానికి ప్రయత్నించి రమణులు ఈ చరణంలో చెప్పిన అద్వైత మార్గాన్ని అందుకోవటానికి ప్రయత్నిద్దాం.



## 92

**లక్ష్యముంచి యనుగ్రహాస్త్రము వైచి నన్**

**గబళించి తుసురుతో వరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! లక్ష్యశుద్ధితో, గురి చూసి నీ దయ అను అస్త్రాన్ని నా మీద ప్రయోగించి నన్ను ప్రాణాలతో కబళించావు.

**విశేషాలు**

'ప్రాణాలతో కబళించావు' అను వాక్యములోని అంతరార్థం ఇది. ప్రాణ శబ్దం ఇక్కడ అహంకారానికి ప్రతీక. జీవుని అహంకారాన్ని, అస్తిత్వాన్ని అరుణాచలేశ్వరుడు గ్రహించాడని అంతరార్థం.

అరుణాచలేశ్వరుని దయను ఇక్కడ రమణులు పొగుడుతున్నారు.

'ప్రణవో ధనుః శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్య ముచ్యతే అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్.'

ప్రణవమే ధనస్సు. ఆత్మ ప్రాణము. బ్రహ్మ లక్ష్యము. సాధకుడు తన్మయుడై, అప్రమత్తుడై శరముతో కొట్టినట్లు దానిని కొట్టవలెను. (అగ్ని మహాపురాణమున యమనియమ నిరూపణమను మూడు వందల డెబ్బది రెండవ అధ్యాయము 27వ శ్లోకం) అను విషయము ఈ చరణ పఠనంలో జ్ఞప్తికి వస్తున్నది.



## 93

**లాభమీ విహపర లాభహీనుని జేరి**
**లాభ మే మందితీ వరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! నాపై నువ్వు దయ చూపించడం నాకు లాభం. కాని దేనికి కొరగాని నన్ను అనుగ్రహించటం వల్ల నీకు ఏ లాభముంది?

**విశేషాలు**

అరుణాచలేశ్వరుని గొప్పతనాన్ని ఈ చరణంలో రమణులు చెబుతున్నారు. లోకంలో 'నాకు ఇది చెయ్యి, నీకు నేను ఇది చేస్తాను' అను రీతిలో మానవ సంబంధాలు ఉన్నాయని మనందరికి తెలుసు.

ఈ పరస్పర లాభాపేక్ష స్వార్థపూరితమైనదని, దైవము నిస్స్వార్థతకు ప్రతిరూపమని రమణుల ప్రతిపాదన ఈ చరణంలో కనిపిస్తున్నది. ఆ దైవీ గుణమయిన నిస్స్వార్థస్థాయికి మనము కూడా చేరటానికి ప్రయత్నించాలని సందేశం.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన

నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి (అర్జునా! నాకు ఈ మూడు లోకాలలో చేయవలసిన పని లేదు. ఇంతకు ముందు పొందకుండా ఉన్నది, ముందు పొందవలసినది ఏమీ లేదు. అయిననూ కర్మలలో వర్తిస్తాను.) అను భగవద్గీతా శ్లోకం (3-22) ఇక్కడ స్మరించదగినది.

ఆయన పొందదగినది ఏదీ లేనప్పటికి భక్తులపై వాత్సల్యంతో వారిని పొందుతుంటాడు. (అనుగ్రహం చూపించి లీనం చేసుకుంటాడు)

WHAT CAN I GIVE THEE?

Thou gav'st Thyself, Thou gained'st me

Which did the better bargain drive?

Bliss found I in infinity;

But what didst Thou from me derive?

0 diva, Perundurars God,

My mind Thou tookest for Thy shrine:

My very bodys Thine abode:

What can I give Thee, Lord, of mine?

(BkE-KingsburyF & Phillips GE-Hymns-of-Tamil-Saivite-Saints-Oxford University press page no 117)

ప్రముఖ శైవకవి మాణిక్య వాచకర్ కూడా రమణులు ఈ చరణంలో చెప్పిన భావాన్ని తనదైన శైలిలో పై విధంగా చెప్పాడు.



## 94

**రమ్మని యనలేదె వచ్చి నా వంతివ్వ**
**వెఱకు నీ తల విధి యరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! రమ్మంటూ నువ్వే నన్ను పిలిచావు. నేను వచ్చిన తరువాత ఇక నా అవసరాలు, యోగక్షేమాలు చూచుకోవటం నీకు ఇబ్బంది అయినా నీ బాధ్యత, ధర్మం.

**విశేషాలు**

విడవటం దాకా పురుష ప్రయత్నమైతే చివరకా సర్వాత్మ భావాన్ని చూరగొనటం భగవత్ప్రసాదం. ఈ భావాన్నే మనకీ అధ్యాయం కడపటి శ్లోకం బయటపెడుతున్నది. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ। అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః' (భగవద్గీత 18- 66). దీనిలో 'శరణం వ్రజ' అన్నంత వరకూ మన ప్రయత్నానికి చెప్పిన మాట.

'మోక్షయిష్యామి' అనేది ఈశ్వరానుగ్రహాన్ని సూచించే మాట. పోతే 'మా శుచః' అనేది శాస్త్ర పరిసమాప్తికి నిదర్శనం. 'అశోచ్యా నన్వశోచ స్త్వమ్' శోకమనే సమస్యతో గదా ఆరంభమయింది గీతాశాస్త్రం. కనుకనే శోక నివృత్తిని సూచన చేయటంతో మరలా సమాప్తమవుతున్నది.

'బహూనామ్ జన్మనామంతే - జ్ఞానవాన్ మాం ప్రపద్యతే వాసుదేవ స్సర్వమితి'. ఈ సర్వమూ వాసుదేవుడని ఒకే ఒక తత్త్వంగా దర్శించటమే శరణాగతి అంటే, అలా దర్శించాలంటే అనేకమనేది ఇక మనసుకు రాగూడదు. అనేకమంటే ఏమిటి, ప్రపంచమంతా పరచుకొని ఉన్న నామరూపక్రియలే. వాటన్నిటినీ సాధకుడు నిర్మొహమాటంగా పరిత్యజించాలి. 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య' అంటే ఇదే అర్థం. ( బ్రహ్మశ్రీ యల్లంరాజు శ్రీనివాసరావుగారు)

రమణుల చరణంలో కూడా ఇదే అంతర్ధ్వని.



## 95

**రమ్మనిలో దూరి నీ జీవమిడునాడె**

**నా జీవమును బాసితరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! నన్ను రమ్మని పిలిచావు. నా హృదయంలోకి ప్రవేశించావు. నీ స్వరూపాన్ని నాకు ప్రసాదించావు. నా జీవాన్ని నేను కోల్పోయాను. (నా ప్రత్యేక అస్తిత్వాన్ని కోల్పోయాను. నా అహంకారం పోయిందని తాత్పర్యం.)

**విశేషాలు**

ఆత్మజ్ఞానమనే ఆనందమయ స్థితిని ఆయనను నమ్ముకొన్నవారికి అరుణాచలుడు అనుగ్రహిస్తాడని ఈ చరణ సందేశం.

“ఆత్మస్వరూపం తెలియదనటం ‘నేనెవరో నాకు తెలియదు’ అనటం వంటిది. ఆత్మస్వరూపమే నీవు. నీవే ఆత్మ. భగవత్సాక్షాత్కారమన్నా, ఆత్మసాక్షాత్కారమన్నా ఒక్కటే. ఈ ఆత్మని ఎలా తెలుసుకోవాలి అని అడగటం ఎలా ఉందంటే ‘రమణాశ్రమంలో ఉంటూ, రమణాశ్రమం చేరుకోవటానికి మార్గాలేమిటి? వాటిలో అన్నిటి కన్నా మంచిదేమిటి?’ అన్నట్లుంది. నీవు చేయవలసిందల్లా, ఈ శరీరమే నేను అనే భావాన్ని, ఇతర బాహ్యవిషయాలను, ఆలోచనలను విడనాడటమే. ఈ ప్రపంచాన్ని, మిగిలినవాటిని నీవు గ్రహించటానికి మూలకారణం అహంకారం. దాని మూలం కనుక్కొంటే అది లేదని, నువ్వు చూసే ఈ సృష్టి కూడా లేదని తెలుస్తుంది” అని రమణుల బోధ.

ఈ ఆత్మజ్ఞానాన్ని ఈ చరణంలో రమణులు ప్రస్తావించారు.



## 96

**విడచిన కష్టమౌ విడక నిన్నుసురును**

**విడువ ననుగ్రహింపరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! నా జీవితపు ఆఖరి క్షణాలలో నిన్ను మరిచిపోయే కష్టాన్ని నాకు ఇవ్వకు. నా జీవితపు ఆఖరి క్షణాలలో నీ స్మరణ విడిచిపోని అదృష్టాన్ని అనుగ్రహించు.

**విశేషాలు**

ఆఖరి క్షణాలలో శివుని మరిచిపోతే మళ్ళీ జన్మదుఃఖము పొందాలి. అనేక జన్మలు ఎత్తాలి. కనుక రమణులు చివరి నిమిషాలలో స్వామి గుర్తుకు వచ్చే అదృష్టాన్ని అనుగ్రహించమని వేడుకొన్నారు.

శ్రీ రమణుల చివరి నిమిషాలలో స్వామి స్మరణ జరిగినట్లుగా భక్తుల సాక్ష్యముంది. రమణులు భౌతిక శరీరాన్ని విడిచిపెట్టిన 1950 ఏప్రిల్ 14న సాయంత్రం 8 గం–47 ని.లకు భక్తులు వారు వ్రాసిన – అక్షరమణ మాలని – అరుణాచలశివా – అంటూ పాడారు. అరుణాచలుని దివ్యనామం చెవులలో మారుమ్రోగుతున్నట్లుగా వారి కళ్లలో ఆనందబాష్పాలు రాలాయి. రమణులు భౌతిక శరీరాన్ని విడిచిపెట్టారు.

విట్టిడిర్ కష్టమాం విట్టిడ దునైయుయిర్
విట్టిడ అరుళ్‌పురి అరుణాచలా!!

'అక్షరమణమాల'లో రమణులు స్వయంగా రచించిన ఈ 96వ తమిళ శ్లోకాన్ని కంఠస్థం చేసుకొని ప్రతి రోజూ చదువుకొంటే, మళ్ళీ జన్మదుఃఖము రాదని పెద్దలు చెబుతారు.

అన్నిటికీ అతీతుడై జడత్వముతో ఉన్న 'జడభరతుడు' కూడా మరణ సమయంలో దైవనామస్మరణ చేయక ఆ లేడినే తలుస్తూ ప్రాణాలు విడిచాడు. కనుక లేడి జన్మ ఎత్తాడని భాగవతం చెబుతుంది.

యం యం వాపి స్మరన్ తాత్పర్యం, త్యజత్యంతే కళేవరం,
తం తమేవైతి కౌంతేయ, సదా తద్భావభావితః

(మరణ సమయంలో శరీరాన్ని వదిలేటప్పుడు ఎవరు ఏయే భావాలను స్మరిస్తారో, ఆయా భావాల సంస్కారబలంతో ఆయా రూపాలనే మరుజన్మలో జీవులు పొందుతున్నారు. 8–6)

అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేవరమ్।
యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥

(అంత్యకాలమున కూడా నన్నే స్మరించుచు దేహత్యాగము చేసెడివాడు తక్షణమే నన్ను పొందుచున్నాడు. ఈ విషయమున ఎట్టి సందేహము లేదు 08–05) అను భగవద్గీత శ్లోకాలు ఈ సందర్భంలో స్మరణీయాలు.



## 97

**ఇల్లు విడువ లాగి లో నింటిలో జొచ్చి**
**యొగి నీదు యిలు జూపి తరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! నన్ను నా ఇంటినుండి ముందుగా బయటికి లాగావు. తరువాత హృదయమనే ఇంట్లో ఉండేటట్లు చేసావు. తరువాత కైవల్య స్థానమయిన మోక్షమనే నీ ఇల్లుని చూపావు.

**విశేషాలు**

శ్రీ భగవాన్ చాలా చిన్న వయస్సులో ఇల్లు విడిచి తిరువణ్ణామలై చేరారు. దీనిని నన్ను నా ఇంటినుండి ముందుగా బయటికి లాగావు అని ఈ చరణంలో పేర్కొన్నారు.

రమణులు అరుణాచలంలో ధ్యానంలో పరవశించారు. అలా హృదయంలో ఉంటూ తాము ఆత్మతో కలిసినట్టు తెలుసుకొన్నారు. దీనిని 'హృదయమనే ఇంట్లో ఉండేటట్లు చేసావు' అన్నారు. ఇలా ఉన్నవాడికి మోక్షం తప్పదనే ధ్వని 'కైవల్య స్థానమయిన మోక్షమనే నీ ఇల్లుని చూపావు' అను వాక్యంలో ఉంది.

నేను అనే అహంకారం నుండి ఆత్మ వరకు సాగే జీవుని ప్రయాణం ఈ చరణంలో ఉంది.



## 98

**వెలిపుచ్చితి న్నీదు సేత కినియక నీ**
**కృప వెలిబుచ్చి కావరుణాచలా!**

**తాత్పర్యం**

ఓ అరుణాచలా! ఈ స్తోత్రం ద్వారా నీ లీలలు లోకానికి బహిరంగ పరిచాను. “నా లీలలను తెలియచేసేటంత సమర్థత ఉన్నదా?” అని నా మీద కోపము తెచ్చుకోకు. నీ దయ అనేది ఎంత చల్లగా ఉంటుందో మాకు తెలియచేసి ఎప్పుడూ నన్ను రక్షించు.

**విశేషాలు**

ఒక రోజు పొద్దున్న ఒక భక్తుడు కొబ్బరిచెట్టు నుంచి కొబ్బరికాయలను కిందకి దించుచుండగా, శ్రీ భగవానులు గోశాల నుండి వచ్చుచూ, ఆ భక్తుని చూచి, కొబ్బరికాయలు కోయుటకు తాను వెదురుకడ్డీని ఉపయోగించుచున్నాడా లేక లోహపుకడ్డీని ఉపయోగించుచున్నాడా అని ప్రశ్నించారు.

ఆ భక్తుడు తాను లోహపుకడ్డీనే వాడుతున్నానని జవాబు ఇచ్చాడు. అది విన్న శ్రీ భగవానులు, “వెదురుకడ్డీతో కొబ్బరికాయలు కోస్తే ఆ చెట్టుకు దెబ్బ తగలదు. ఇలా లోహపుకడ్డీని వాడటం వలన వృక్షము గాయపడును” అని పలికి, జవాబు కోసం ఎదురుచూడకుండా అచటి నుండి వెళ్ళిపోయారు.

ఆ భక్తుడు కడ్డీని మార్చక, లోహపు దానితోనే పనిని కొనసాగించాడు. ఒక వారం గడిచాక, ఆ భక్తుడు అదే పని చేయుచుండగా ఒక కొబ్బరికాయ అతని ముఖం మీదపడి ముక్కుకు బాగా దెబ్బ తగిలింది.

ఈ వార్త శ్రీ రమణులకు చెప్పగా, వారు ఆ భక్తుని పట్ల జాలి ప్రకటిస్తూ, “దెబ్బ తగిలితే కలిగే బాధ అతనికి ఇప్పుడు బాగా అర్థం అవుతుంది. తాను వుపయోగించే లోహపు కడ్డీ తగిలినప్పుడు ఆ చెట్టు ఎంత బాధపడి ఉంటుందో పాపం!! చెప్పను కూడా చెప్పదు!!” అని అన్నారు. దయను ఇలా సందర్శించిన రమణులు ఈ చరణంలో దయా ప్రార్థన చేసారు.



## 99

**వేదాంతమున వేరు లేక వెలింగెడు**

**వేద పదము బ్రోవు మరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! అన్ని వేదాంతాల బోధనాసారము ఒకటే. తేడా లేక ప్రకాశించేది ఒకటే. అదే సత్యం. (జ్ఞానం) ఆ నిత్య సత్య జ్ఞానాన్ని, వేదస్వరూపాన్ని నాకు అనుగ్రహించు.

**వివరణం**

అరుణాచలా! గ్రంథాలు అనేకం చదవటం వల్ల సత్యజ్ఞానము రాదు. ఆ సత్యజ్ఞానము దేవుని దయతో మాత్రమే లభిస్తుంది. కనుక రమణులు మన తరఫున మనకొరకు, అరుణాచలుని ఈ చరణంలో సత్యజ్ఞానము కొరకు ప్రార్థించారు.

"పిచ్చివాని వంటిపై తుండుగుడ్డ ఎప్పుడు జారిపోయిందో అతనికి ఎట్లు తెలియదో, అట్లు దేహము జారిపోవును ముక్తునకు" అన్నారు రమణులు ఒకసారి. దేహభావన లేనివాని ఒంటి మీద తుండుగుడ్డ ఎప్పుడు జారిపోయినా అతనికి ఏమీ పనిలేదు. దేహభ్రాంతి లేని ముక్తుడు అలా ఉంటాడన్న సత్యజ్ఞానము మన మనస్సుకు పట్టించటం భగవంతుని కరుణతోనే సాధ్యమని రమణులు ఈ చరణంలో ప్రబోధించారు.

❖ ❖ ❖

## 100

**నింద నాశీస్సుగా గొని దయాపాత్రుగ**

**జేసి విడక కావుమరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! నేను పైకి నిందలుగా కనబడే పలుకులని ఈ అరుణాచల మణమాలలో నేను పలికి ఉంటాను. ఈ నిందలని పొగడ్తలుగా భావించు. నన్ను నీ వానిగా భావించి, నీ అనుగ్రహానికి పాత్రుని చేయి.

**వివరణం**

ఓ అరుణాచలా! పరమశివా! ఏలుకొన్న నువ్వు ఇప్పుడు నన్ను వదిలివేస్తే, భక్తుడిని వదిలివేసాడని లోకము నిన్ను నిందిస్తుంది కదా! ఈ నిందనుంచి నిన్ను నువ్వే కాపాడుకో. నిన్నే తలుచుకొనేటట్లు నన్నెందుకు చేసావు? నువ్వే నీగురించి తలచుకొనేటట్టు చేసావు. నీ సాంగత్యంలోని మధురిమ చూసిన నేను నిన్ను వదలలేను. నిన్నెవరు వదిలిపెడతారు? అందరూ నిన్ను అంటిపెట్టుకొనే ఉంటారు. (05వ చరణం) - ఇలాంటి కొన్ని భావాలను ఈ అరుణాచల మణమాలలో మనం గమనించాం. ఈ నిందలను పొగడ్తలుగా గ్రహించమని రమణులు స్వామికి ఈ చరణంలో నివేదిస్తున్నారు.

నీటిలో వున్న తామర వికసించడానికి కారణమైన సూర్యుడే, నీటిని వదలిన తామర వాడిపోవడానికి కారణమవుతాడు. ఆచార్య భక్తి ఉన్న శిష్యుడి జ్ఞానము అభివృద్ధి చెందడానికి కారణమైన విష్ణుమూర్తి, ఆచార్య భక్తి లేని శిష్యుడిని జ్ఞాన శూన్యునిగా చేస్తాడు. ఇది నిందగా కనిపించే పొగడ్త.

దీనిని సమన్వయం చేసుకొంటే నింద తొలగిపోతుంది. ఇక్కడ విష్ణుమూర్తి యొక్క అఘటనా ఘటనా సామర్థ్యము ప్రబోధాత్మకముగా చెప్పారు. ఇలా రమణుల వంటి మహాత్ములు చేసిన నింద వెనుక ప్రబోధాన్ని అర్థం చేసుకోవాలి.



## 101

**నీట హిమముగ ప్రేమ కారు నీలో నన్**

**ప్రేమగ కరగి బ్రోవరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! ఒక మంచుగడ్డ నీటిలో పడితే కరిగిపోతుంది. తన రూపాన్ని కోల్పోతుంది. అలాగే, ప్రేమమూర్తివైన నీలో నన్ను కరిగిపోనీ. ఆ అదృష్టం నాకు కలిగించి రక్షించు.

**వివరణం**

రమణులు ఇక్కడ ప్రయోగించిన మంచుగడ్డ చక్కటి పోలిక. మంచుగడ్డకి

ఒక రూపమున్నట్టు కనబడుతుంది. కాని మనం ఆలోచిస్తే మంచుగడ్డకి మూలరూపం నీరు.

ప్రపంచమంతా నిండి ఉన్న పరమాత్మలో ఉన్న అంశం జీవునిలో ఉన్న మనస్సు.

నేను ఎవరు అనే ధ్యానం చేయగా చేయగా మనస్సు పరమాత్మలో లీనమవుతుంది. రమణుల చరణంలోని తాత్పర్యం ఇదే.

శ్రీ రమణ మహర్షితో దీర్ఘకాల ఆశ్రమ బాంధవ్యం ఉన్న ఓ వైద్యుని స్మృతులలో నుంచి కొన్ని విషయాలను ఈ సందర్భంలో స్మరించుకొందాం.

“ఓ రోజు (1948 డిసెంబరులో) శ్రీ భగవాన్ చేతిని మర్దన చేస్తూంటే మోచేతికి కాస్త పైభాగంలో ఉన్న కణితిని గమనించాను. 1949 జూలై నాటికి ఆ భాగమంతా పచ్చిపుండు అయింది. “నయం కావాలన్న సంకల్పం మీకు వుండాలి. సంకల్పించుకోండి” అని ప్రాధేయపడ్డాను. వారు చిరునవ్వు నవ్వి మౌనంగా ఉండిపోయారు. నేను మళ్లీ అర్థించాను. అప్పుడు వారు, “ఇక్కడ మనస్సంటూ ఏమీ లేదు. కాబట్టి సంకల్పించే ప్రసక్తే లేదు” అన్నారు.

భగవాన్ శ్రీ రమణ మహర్షికి దేహంగానీ, దాని రోగాలు కానీ పట్టవు. పుండుకు కట్టు కడుతున్నప్పుడు నొప్పి అనివార్యం. కానీ వారు ఏ బాధనీ కనబరచలేదు. పెపైచ్చు ఆ కట్టు కట్టడానికి కుడిచేతితో సహాయం చేసేవారు. ఆ పుండు ఇంకెవరిదో అయినట్టు!

వారి పుండుకు కట్టు కట్టే ముందు ఆ ప్రాంతాన్ని స్పిరిట్‌తో శుభ్రం చెయ్యాల్సి వచ్చేది. ఓసారి ఆ స్పిరిట్ చేతి మీదకు వచ్చింది. వెంటనే వారు, ‘స్పిరిట్ స్నానం అయింది నాకు’ అన్నారు. అందరికీ అటువంటి స్పిరిట్ స్నానం అవసరమని కూడా అన్నారు. ఆ మాటల అంతరార్థమేమిటో తెలియక, వివరించి చెప్పమని కోరాను. వారు చిరునవ్వుతో ఇట్లా చెప్పారు. “చేపలు ఎప్పుడూ నీటిలోనే వుంటాయి. బయటికి వస్తే బ్రతకలేవు. అట్లాగే మనం ఎప్పుడూ స్పిరిట్లోనే, అంటే శుద్ధచైతన్యంలోనే ఉంటాం, ఉండాలి. ప్రయత్నపూర్వకంగా శుద్ధచైతన్యంలో, అంటే ఆత్మలోనే ఉండాలి.”

ఈ మాటలవల్ల వారెప్పుడూ సహజ సమాధిలోనే ఉంటారని నమ్మకం కలిగింది నాకు. శ్రీ భగవాన్ తరచు చిన్న చిన్న విషయాలలో కూడా ప్రగాఢమైన బోధనలు చేసేవారు. ఆ బోధనలకు మనపై గట్టి పట్టు ఉండేది.

1949లో ఒకసారి శ్రీ భగవాన్, 'మనం సంతోషంగా ఉన్నప్పుడు కన్నీరు ఆవలి కొననుంచీ, విచారంగా ఉన్నప్పుడు లోపలి కొననుంచీ వస్తుంది' అని చెప్పారు. అది నిజమే.

మహా నిర్వాణ దినంనాడు 1950 ఏప్రిల్ 14న వారి గదిలో నేనూ వున్నాను. వారి కోరిక మీద వారు కాళ్లు చాచుకుని కూర్చోవడానికి ఏర్పాటుచేశాం. వారు కళ్లు మూసుకున్నారు. శ్వాస నెమ్మదిగా సాగుతోంది. బయట భక్తులు 'అరుణాచల శివస్తోత్రం' పాడుతున్నారు. ఒక్కసారి కళ్లు తెరిచి, ఆ పాట వస్తున్న వైపు చూసి, మళ్లీ కళ్లు మూసుకున్నారు. వారి కళ్ల 'ఔటర్ కాన్తస్' నుంచి కన్నీరు కారింది. అంటే పరమాత్మనిలో ఐక్యమయ్యేటప్పుడు కలిగే ఆనందానికి ఆ కన్నీరు బాహ్య రూపం అనుకున్నాను. దేహాన్ని ఎంతో ప్రశాంతంగా విడిచారు.

శ్రీ భగవాన్ రమణ మహర్షి అదే రోజు సాయంత్రం 8 గం. 47 ని.లకు శివైక్యం పొందారు.

తన బాధ గురించి దుఃఖిస్తున్నవారి పట్ల కరుణ ఉండేది శ్రీ భగవాన్‌కి. ఆయనెప్పుడూ అసలు సత్యాన్నీ, తన బోధనలో ప్రధానాంశమైన 'మనం దేహం కాదు' అనే మాటను జ్ఞాపకం చేస్తుండేవారు. తనదైన రీతిలో ఒక మాట అడిగేవారు కూడా. "భోజనానంతరం విస్తరిని ఉంచుకుంటామా?" అని. (రమణాశ్రమ వైద్యులు ఎం.అనంతనారాయణరావు స్మృతుల నుంచి.)

మంచు వంటి స్వచ్ఛమైన రూపం, మనస్సు, బోధ రమణులది. ఓం నమో భగవతే రమణాయ.



## 102

**అరుణాద్రి యన నే కృపావల బడితి త**
**ప్పునె నీ కృపావల యరుణాచలా!**

**తాత్పర్యము**

అరుణాచలా! నిన్ను ఒక్కసారి తలచుకొన్నాను. వెంటనే నీ దయ అనే వలలో చిక్కుకొన్నాను. ఈ దయ అనే వలలో చిక్కుకున్నవానికి ఇక బయటకు వెళ్ళే అవకాశం లేదు.

**విశేషాలు**

అరుణాచలేశ్వరుని దయను వలతో పోల్చుట ఈ చరణంలోని విశేషం.

జాలరివాని వలలో పడిన చేపకు బయటికి వెళ్లే అవకాశం లేదు, అతడు విముక్తి ప్రసాదిస్తే తప్ప. అరుణాచలుని దయ అనే వలలో పడిన భక్తునికి కూడా విముక్తి లేదు. అతడు నేను అనే జ్ఞాన విచారణ శక్తి ప్రసాదిస్తే తప్ప.

“వైరాగ్యం కొరకు విషయవాంఛలతో మొండిగా యుద్ధం పనికిరాదు.

వలలో చిక్కిన పక్షి తన్నుకొంటే ఆ వల ఇంకా బిగిసిపోతుంది. అలాగే విషయేచ్ఛ కూడా. కావున వాటిపై దృష్టి ఉంచకూడదు. ‘ఇది కాదు’ (నేతి) అనే స్మరణ వలనగానీ, విచార మార్గంలో ఇవి (ఆలోచనలు) ఎవరికి ఉదయిస్తున్నాయి’ అనే విచారణ చేసి వాటిని నిర్మూలించు. వాటి కొమ్మలు, పిందెలు, పువ్వులు వాటంతట అవే పడిపోతాయి” (రమణలీల 237 పేజీ) అని రమణులు ఒకసారి ఉపదేశం చేసారు.

ఇది ఆలోచనీయం.

ప్రాణాన్ని నిరోధిస్తే మనసు లయం అవుతుంది. మనోవృత్తిని నిరోధిస్తే మనసు వినాశం అవుతుంది. ప్రాణ నిరోధంతో లయమైన మనసు, మళ్ళీ పని చేస్తూ వుంటుంది. మనసులోని వాసనల నాశనమే నిజమైన నాశనం. (లయ వినాశనే ఉభయ రోదనే – లయ గతం పునర్భవతినోమృతం ఉపదేశసారం 13వ శ్లోకం)

చూచేవాడు, చూసేది, చూడబడేది కలిస్తే త్రిపుటి అంటారు. జ్ఞాని అంటే కళ్ళున్న గుడ్డివాడు. అంటే కళ్ళు ఉన్నా బయటి ప్రపంచజ్ఞానం లేనివాడు. అంటే త్రిపుటిరాహిత్యం పొందినవాడు. ఇంగ్లీష్‌లో నెవెర్ మైండ్ అంటారు. అంటే పట్టించుకోక పోవటమే. దీన్నే మనవాళ్ళు ‘నైవ మానసం’ అన్నారు. పట్టించుకోవటాన్ని విషయం అంటారు. పట్టించుకోకపోతే ఏమీ వుండదు.

వలలో చిక్కిన పక్షి ప్రాణవాయువును నిరోధించినట్లు మనం కూడా చేస్తే మనసులోని చాంచల్యం పోతుంది. దీనినే 'జాల పక్షి వద్రోధ సాధనం' అన్నారు రమణ మహర్షి (వాయు రోధనా లీయతే మనః జాల పక్షి వద్రోధ సాధనమ్ ఉపదేశసారం 11).

ఉపదేశసారంలో చెప్పిన వల విషయాన్ని ఈ చరణంలో దయతో పోల్చి మనలను అనుగ్రహించారు.



## 103

**చింతింప కృప పడ సాలీడు వలె కట్టి**
**చెరపెట్టి భక్షించి తరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! నా అదృష్టంకొద్దీ నా గురించి నువ్వు ఆలోచించావు. నా చుట్టూ వలపన్నావు. ఆ వలలోకి నన్ను లాక్కొచ్చావు. తన వలలో పడిన తరువాత సాలీడు తన గూటిలో ఉన్న కీటకాన్ని ఎలా మింగుతుందో, నన్ను కూడా మింగేశావు. (నాలోని అహంకారాన్ని మింగేసావు అని తాత్పర్యం.)

**విశేషాలు**

శివానుగ్రహానికి నోచుకొన్నవారికి అహంకారం ఉండదని ఈ చరణంలోని ఆంతర్యం.

శ్రీ కాళహస్తిలోని 'శ్రీ' అనే అక్షరం సాలీడుకు సంబంధించినది.

తామ్రపర్ణీ నదీతీరంలో పూర్వం కరబుడు ఉండేవాడు. ఇతడు చీరల అల్లికలో దిట్ట. శివభక్తుడైన ఇతడు దుష్ట సహవాసం చేత చెడిపోయాడు. వైదిక కర్మలను విస్మరించి అనారోగ్యానికి గురై మరణించి తరువాతి జన్మలో సాలీడుగా దక్షిణ కైలాసంలో శ్రీ కాళహస్తిలో జన్మించాడు. ఆ కాళహస్తిలోని వాయులింగేశ్వరునికి కైలాసంలో ఉన్నట్లు వేదికలు, భవనాలు అల్లుతుండేవాడు. దాని భక్తిని శివుడు పరీక్షించాలనుకొన్నాడు.

ఆ సాలీడు అల్లికలను అగ్నికి ఆహుతి ఇచ్చాడు. అది చూసిన సాలీడు భరించలేక అగ్నిలో దూకింది. శివుడు ఆ సాలీడుకి మోక్షాన్ని ప్రసాదించాడు.

సాలీడు తననుండి నూలు వెలికితీసి, మరల దానిని తనలోకే తీసుకొనును. అట్లే మనస్సు కూడా తననుండే జగత్తును కల్పించి, తనయందే లయము చేసుకుంటుంది. ఈ సత్యాన్ని చెప్పిన రమణుల ప్రబోధం ఈ సందర్భంలో స్మరణీయం.



## 104

**ప్రేమతో నీ నామ మాలించు భక్త భ**
**క్తుల భక్తుగా బ్రోవు మరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! నీ పేరును ప్రేమతో వినే భక్తుల యొక్క భక్తులకు నేను దాసుడనయేటట్టు నా మీద దయ చూపించు.

**విశేషాలు**

1. శ్రీ వేంకటేశ్వర సుప్రభాతంలో రమణ మహర్షి ఈ చరణంలో చెప్పిన దాసదాస ప్రసక్తి ఇలా కనిపిస్తుంది.

   సూర్యేందు భౌమబుధవాక్పతి కావ్యసౌరి
   ర్భాను కేతు దివి షత్సరిషత్ప్రధానాః
   త్వద్దాస దాస చరమావధిదాస దాసాః
   శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥ (శ్రీ మాన్ మణవాళ మహాముని శిష్యులు శ్రీమాన్ ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్యస్వామి రచించిన శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం 18వ శ్లోకం)

   సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువు అను దేవసభలోని ప్రధానులు (నవగ్రహములు) నీ దాసులకు దాసులలో చివరిలో ఉన్న దాసులకు దాసులై ఉన్నారు. సంపదతో కూడిన వేంకటాచలపతీ! నీకు సుప్రభాతము అగుగాక!

2. త్వద్భృత్యభృత్య పరిచారక భృత్యభృత్య
   భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ (ముకుందమాల 27)

నీ దాసులకు దాసుడను. నీకు పరిచర్యలు చేసే సేవకుల పరంపరలో అందరికీ భృత్యుడనై. చరమ భృత్యునిగా నన్ను భావించి స్వీకరించు తండ్రీ!'

3. శివ భక్తులైన అరవై మూడు నయనార్లలో ఒకరైన అప్పర్ – ఈ దాస్యభక్తి క్రమాన్ని రమణుల స్థాయిలో అద్భుతంగా వర్ణించారు. దానిని ఇక్కడ స్మరించుకొందాం.

'At first she heard His name. She heard about His form and complexion. Then she heard about His beloved place of residence. As a result she became mad about Him. That very day she left her mother and father. She gave up the practices of the world at large. She forgot herself. She lost her name. The maid placed her head at the Feet of her Lord'



## 105

**నను బోలు దీనులనిం పొంద కాచుచు**
**చిరంజీవివై బ్రోవు అరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! నీ మీద భక్తి కలిగిన దీనుడిని నేను. నావంటి దీనులపై నీపై అనుగ్రహము కురిపించి ఎప్పుడూ కాపాడమని ప్రార్థన.

**విశేషాలు**

శ్రీ రమణులు ఈ చరణంలో కేవలం తనకొరకు కాక తనవంటి భక్తులందరి పైనా స్వామి దయ కలగాలని కోరుకోవటం ఉత్తమమయిన భావన.

లోకమంతా ఉపకార్యోపకారక సంబంధంతోనే జీవిస్తున్నదని బృహదారణ్యకం చాటుతున్నది. మధు బ్రాహ్మణమనే ఘట్టమంతా ఇదే. పరస్పరం తోడ్పడటం మూలాన జీవయాత్ర సాగుతున్నది.

సాపేక్షమేగాని Relative నిరపేక్షమైనదేదీ లేదు లోకంలో. నిరపేక్షమైనదొక పరమాత్మ తత్త్వమే. అలాంటి తత్త్వమున్నదని మనకు ఈ సాపేక్ష ప్రపంచమే సూచిస్తున్నదంటారు మహర్షులు. (బ్రహ్మశ్రీ యల్లంరాజు శ్రీనివాసరావుగారు).

సహనావవతు – కలసి (గురువు, శిష్యులు) – రక్షింప బడుదుము గాక!

సహనౌభునక్తు – కలసి అనుభవింతుము లేక పోషించుము గాక!

సహ వీర్యం కరవావహై – కలసి పరాక్రమ శక్తిని ఉపయోగింతుముగాక!

తేజస్వినా వధీతమస్తు – తేజోవంతులైన జ్ఞానము అధ్యయనము చేయుదము.

మావిద్విషావహై – మనము ద్వేషరహితులమై ఉందుము గాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః – ఆధి భౌతిక, ఆధ్యాత్మిక, ఆధిదైవికమైన శాంతులను మనము పొందుదుము గాక! (తైత్తిరియోపనిషత్తు)

ఈ భావనా పరిమళం ఈ రమణుల చరణంలో వ్యాపించింది.

అన్నమయ్య కూడా 'కొంత కొంతవారి మెచ్చవయ్యా' (07–264) అని తనతోపాటు మిగతా భక్తులను రక్షించమని వేంకటేశుని వేడుకొన్నాడు. తనతో పాటు అందరూ బాగుపడాలని కోరుకోవటం ఉత్తమోత్తముల మార్గం. నమో భగవతే శ్రీ రమణాయ.



## 106

**ఎముక లరుగు దాసు మృదు వాక్కు విను చెవిన్**
**గొనుము నా యల్పోక్తులరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! గొప్పవారైన భక్తులు తమ ఎముకలు కూడా కరుగు విధముగా నీ గురించి మధురమైన భావనలతో స్తోత్రాలు పాడుతుంటారు. వాటిని విని ఆనందించటానికి నీ చెవులు అలవాటు పడ్డాయి. నా అరుణాచల మణమాల చరణాలు వాటితో పోలిస్తే అల్పమైనవి. కాని గొప్పవారైన భక్తుల స్తోత్రాలను విని ఎంత ఆనందిస్తున్నావో, అలాగే నా అల్పమైన వాక్కులు కూడా విని ఆనందించి, నాపై దయ చూపించు.

**విశేషాలు**

1. 'ఎముకలు కూడా కరుగు విధము' అనునది గొప్ప అభివ్యక్తి. పాడుతుండగా అంతటి భక్త్యావేశ పారవశ్యమున్నదని ఈ అభివ్యక్తి చెబుతోంది. ఎముకలు

కొరికే చలివంటి ప్రయోగాలు విన్నాం. రెండు ఎముకల మధ్య రాపిడి ఏర్పడి ఎముకలు అరిగిపోతాయని, అందువల్ల కీళ్లనొప్పులు వస్తాయని తెలుసు. కాని 'ఎముకలు కూడా కరుగు విధము' ఎప్పుడూ వినని అపూర్వ రమణీయ ప్రయోగం.

2. మహాకవులు తామెంత రచనా సమర్థులైనప్పటికి, వినయంగా తమకేమి తెలియదని, అజ్ఞానులమని, చిన్నవారమని అంతా ఆ దేవుని దయ అని చెబుతుంటారు.

3. సౌందర్యలహరి చివరి శ్లోకంలో శంకరభగవత్పాదులు తమ వినయాన్ని ఇలా ఆవిష్కరించారు.

ప్రదీపజ్వాలాభిర్దివసకర నీరాజనవిధిః
సుధాసూతేశ్చంద్రోపల జలలవైరర్ఘ్యరచనా
స్వకీయై రంభోభిస్సలిలనిధి సౌహిత్య కరణం
త్వదీయాభిర్వాగ్భిస్తవ జనని వాచాం స్తుతిరియం

(అమ్మా! దీపకాంతులతో సూర్యునికి నీరాజనమిచ్చినట్లు, చంద్రకాంత శిలా జలముచే చంద్రునికి అర్ఘ్యమిచ్చినట్లు, జలములతో సముద్రుని తృప్తి పరచినట్లుగా నేను నువ్వు ఇచ్చిన నీ వాక్కులచేత నిన్ను స్తుతించి నీకు సంతోషం కలిగించాలనుకొంటున్నాను. బిడ్డ పలుకులు ఎలా ఉన్నా తల్లికి ఆనందమే కదా!)

4. ఇదే ధోరణిలో మహా మహిమాన్వితులైన శక్తిసంపన్నులైన శ్రీ రమణులు ఈ చరణాన్ని వినయంతో రచించారు.

5. అరుణాచల ప్రదక్షిణంలో మొట్టమొదట దక్షిణ దిక్కున యమలింగం కనబడుతుంది.

దక్షిణ దిక్కున ఉన్న యమధర్మరాజు అనుగ్రహం చేత ఆయువు పెరుగుతుందని చెబుతారు.

ఈ యమ లింగమునకు ఇంకో ప్రత్యేకత ఉంది. ఎముకలు విరిగిపోయిన వాళ్ళు, ఎముకలు అరిగి బాధపడుతున్నవాళ్ళు అరుణాచలంలోని ఈ

యమలింగ దర్శనం చేస్తే ఆ ఎముకలు చాలా తొందరగా అంటుకుంటాయి. శ్రీ రమణుల భక్తులలో చాలామందికి ఆ అనుభవాలు జరిగాయి.



## 107

**క్షమగల గిరి యల్ప వాక్కు సద్వాక్కుగ**
**గొని కావు మరి నీ యిష్ట మరుణాచలా!**

**తాత్పర్యము**

ఓ అరుణాచలమా! నీ రూపమే ఓర్పు, ఈ అరుణాచల మణమాలలోని నా దోషపు వాక్కులను గొప్పవిగా స్తుతులుగా స్వీకరించు. నన్ను మన్నించి కాపాడు. ఇది నా ప్రార్థన ఆ పైన నీ చిత్తం. నా భాగ్యం.!

**విశేషాలు**

శాక్తేయులు ఈ అరుణాచలాన్ని శ్రీచక్ర మేరువుగా దర్శిస్తారు. ఆది శంకరులు మేరుగిరిగా వర్ణించారు. వైష్ణవులు సుదర్శన చక్రమని ఈ అరుణగిరిని నమ్ముతారు.

అరుణాచలానికీ, రమణ మహర్షికీ మధ్య విడదీయరాని బంధం ఉంది. “అరుణాచలాన్ని పాషాణాలు, ముళ్ళపొదలతో కూడిన మామూలు పర్వతంగా భావించవద్దు. ఇది పరమేశ్వరుని ప్రతిరూపం. అరుణం అంటే శక్తి – పార్వతి, ప్రకృతి, అచలం అంటే నిశ్చలాత్మ, శివుడు, పురుషుడు. ప్రకృతీ పురుషుల సమ్మేళనం. సగుణ నిర్గుణా ఏకత్వ రూపం ఇది!” అని ఆయన అనేవారు.

హిమాలయాల కన్నా పురాతనం!

పురాతత్వ శాస్త్రవేత్తలు కూడా అరుణగిరి గొప్పతనాన్ని శాస్త్రీయంగా నిరూపించారు. సృష్టికి పూర్వమే అరుణగిరి ఉందనీ, సూర్యుడి నుంచి విడివడిన భూమి అగ్నిమయంగా ఉన్న దశ నుంచి ప్రకృతిలో సహజ సిద్ధమైన మార్పులు పొందుతూ చల్లబడి ఏర్పడిన తొలి పాషాణమయ స్థానం అనీ, ఇది ఆసియా ఖండంలో భాగం కాదనీ, అప్పటి మహాసముద్రంలో మునిగిన లెమోరియా ఖండంలో భాగమనీ, హిమాలయాల కన్నా పురాతనమైన పర్వతమనీ ధ్రువపరిచారు. దీనికి సంబంధించి–

గంగా చ మూలభాగస్థా
యమునా గగనస్థితా!
సోమోద్భవ శిరోభాగే
సేవంతే శోణ పర్వతః!!

అని స్కాంద పురాణం స్పష్టంగా చెబుతోంది.

సాధారణంగా పర్వతాలు చెట్లూ, పుట్టలతో పచ్చగా ఉంటాయి. కాని అరుణగిరి ఆ పేరులోనే ఉన్న వర్ణంతో ప్రకాశిస్తూ ఉంటుంది. “అరుణగిరి అగ్నితత్త్వానికి సంకేతం. ఇది ధరిత్రికి హృదయం వంటిది. సత్య స్వరూపం, జ్ఞాన తేజస్సు, శ్రేష్ఠతమం” అని ఋగ్వేదం కీర్తించింది. (ఏ. సీతారామారావు అరుణాచలం. శివమయాచలం! ఆంధ్రజ్యోతి దినపత్రిక 13-02-2018 సౌజన్యం)

అరుణాచలాన్ని శివపార్వతుల సమ్మేళనంగా భావించిన రమణులు ఈ చరణంలో భక్తునికి కావలసిన వినయాన్ని మనకు నేర్పారు.



## 108

**మాలను దయచేసి యరుణాచలా రమణ**
**నా మాలదాల్చి బ్రో వరుణాచలా!**

**తాత్పర్యం**

అరుణాచలా! అక్షర సుగంధభరితమైన, ప్రేమతో కూర్చిన ఈ ‘అక్షరమణ మాల’ను నీకు సమర్పిస్తున్నాను. దయతో ఈ మాలను నువ్వు స్వీకరించి, ధరించి నీ దయ అను దివ్యమాలని నాకు ప్రసాదించి నన్ను ఎప్పుడూ రక్షించు.

**విశేషాలు**

మనం మొట్టమొదట చెప్పుకొన్నట్లుగా మధురభక్తి సంప్రదాయంలో ఈ ‘అక్షరమణమాల’ వ్రాయబడింది. రమణులు తానొక వధువుగా, అరుణాచలేశ్వరుని వరునిగా భావించారు. వివాహములో వధూవరులు దండలు మార్చుకోవటం వుంటుంది కదా! ఈ దండల మార్పిడి ఘట్టాన్ని ఈ చివరి చరణంలో అందంగా రమణులు ఆవిష్కరించారు.

కలియుగ దైవమైన వేంకటేశ్వరునికి చేసే పుష్పమాలల సేవ మనకు తెలుసు.

శ్రీవారి పాదాలపై అలంకరించే ఒక్కొక్క మూరగల రెండు పుష్పమాలలను 'తిరువడి దండలు' అని, శ్రీవారి కిరీటం మీదుగా రెండు భుజాల వరకు అలంకరించబడే 8 మూరలకు గల పూలమాలలను 'శిఖామణి' అని, శ్రీవారి భుజాలనుండి ఇరువైపులా పాదాలవరకు వ్రేలాడుతున్నట్లు అలంకరించే పొడవాటి మాలలను 'సాలగ్రామమాల' అని, శ్రీవారి మెడలో రెండు పొరలుగా భుజాలమీదకి అలంకరించబడే మూడున్నర మూరల పుష్పహారాన్ని 'కంఠసరి' అని అంటారు.

శ్రీవారి వక్షస్థలంలో ఉన్న శ్రీదేవి, భూదేవులకు ఒక్కటిన్నర మూరల పుష్పమాలికలను అలంకరిస్తారు. ఒక్కొక్కటి ఒక్కొక్క మూర ఉన్న రెండు దండలను శంఖచక్రాలకు అలంకరిస్తారు.

శ్రీవారి నందక ఖడ్గానికి అలంకరించే రెండు మూరల పుష్పమాలికను 'కఠారిసరం' అంటారు.

రెండు మోచేతుల క్రిందనుండి పాదాల వరకు హారాలుగా వ్రేలాడదీసే మూడు పుష్పమాలలను 'తావళములు' అంటారు.

పూలు స్వచ్ఛమైన ప్రేమకు ప్రతీకలు. పూలమాలలను మార్చుకోవటం వధూవరుల పరస్పర ప్రేమలను పంచుకోవటానికి ప్రతీక.

జీవాత్మ (రమణులు), పరమాత్మలు (అరుణాచలేశ్వరుడు) పరస్పరము పూలమాలలు మార్చుకొన్న ఘట్టాన్ని వర్ణించటం ద్వారా తమలో ప్రేమల మార్పిడినే కాదు, తమ ఐక్యతను కూడా ఫలితాంశంగా రమణులు వర్ణించి, గ్రంథాన్ని మంగళాంతం చేసారు.

**మంగళ మరుణాచలమునకు**

**మంగళము భక్తశ్రేణికి**

**మంగళ మక్షరమణమాలకును**

**తాత్పర్యం**

అందంగా పుస్తకాన్ని రచించిన శ్రీ రమణులకి మంగళం.

అరుణాచలానికి మంగళం

భక్తితో చదివిన పాఠకులకి మంగళం

మంగళం మహత్

అరుణాచల శివ – అరుణాచల శివ

అరుణాచల శివ – అరుణాచలా!

అరుణాచలా శివ – అరుణాచల శివ

అరుణాచల శివ – అరుణాచలా!

ఓ నమో భగవతే రమణాయ!



# అరుణాచల అక్షర మణమాల

**(108 చరణాలు ఒక చోట చదువుకోవటానికి వీలుగా)**

సాక్షాదరుణగిరీశ్వరవరార్హమగు, నక్షరమణమాల నమరించుటకును
కరుణాకరుండగు గణపతి యొసగి, కర మభయకరము, కాపాడుగాక
అరుణాచలశివ – అరుణాచలశివ – అరుణాచలశివ – అరుణాచలా

1. అరుణాచల మనుచు స్మరియించువారల, యహము నిర్మూలింపు మరుణాచలా!
2. అళగు సుందరముల వలె జేరి నేను నీ, వుంద మభిన్నమై యరుణాచలా!
3. లో దూరి లాగి నీ లోగుహను జేఅగా, నమరించి తేమొకో యరుణాచలా!
4. ఎవరికిగా నన్ను నేలితి, విడిచిన, నఖిలము నిందించు నరుణాచలా!
5. ఈ నింద తప్పు, నిన్నేటికి దలపించి, తిక విడువా రెవరరుణాచలా!
6. కనిన జనని కన్న ఘనదయాదాయకా, ఇదియా యనుగ్రహ మరుణాచలా!
7. ని న్నేమార్చి యరుగనీక యుల్లముపైని, నుఱుదిగా నుండుమా యరుణాచలా!
8. ఊరూరు తిరుగక యుల్లము నిను గని, యణగ నీ ద్యుతి జూపు మరుణాచలా!
9. నను జెఱచి యిపుడు నను గలియక విడు, టిది మగతన మొక్కొ యరుణాచలా!
10. ఏటి కీ నిదుర న న్నితరులు లాగగ, నిది నీకు న్యాయమా యరుణాచలా!
11. పంచేంద్రియ ఖలులు మదిలోన దూరుచో, మదిని నీ వుండవో యరుణాచలా!
12. ఒకడవొ నిను మాయ మొనరించి వచ్చువా, రెవ, రిది నీ జాల మరుణాచలా!
13. ఓంకార వాక్యార్థ యుత్తమసమహీన, నిన్నెవరెఱుగువా రరుణాచలా!
14. అవ్వబోలె నొసగి నాకు నీ కరుణ, నన్నేలుట నీభార మరుణాచలా!

15. కన్నుకు గన్నయి కన్నులేక కను నిన్, గనువారెవరు, గను మరుణాచలా!

16. కాంత మినుమువలె గవిసి నన్ విడువక, కలసి నాతో నుండు మరుణాచలా!

17. గిరిరూపమైనట్టి కరుణాసముద్రమా, కృప చేసి నన్నేలు మరుణాచలా!

18. క్రింద మీదెటను జెన్నొందు కిరణమణి, నా క్రిందుగతి మాపు మరుణాచలా!

19. కుట్ర యంతయు గోసి గుణముగ బాలించు, గురురూపమై వెలుగరుణాచలా!

20. కూచి వాల్గన్నుల కోత బడక కృప, చేసి నన్ జేరి కావరుణాచలా!

21. వంచకా వేడియున్ గొంచెమున్ గరగవే, అభయ మంచేలుమా అరుణాచలా!

22. అడుగ కిచ్చెడు నీదు నకళంకమగు కీర్తి, హాని సేయక బ్రోవు మరుణాచలా!

23. హస్తామలక నీదు సద్రసమున సుఖో, న్మాద మొందగ నేలు మరుణాచలా!

24. వల నుంచి భక్తుల పరిమార్చు నిను గట్టు, కొని యెట్లు జీవింతు నరుణాచలా!

25. కోపరహితగుణ గుఱిగాగ నను గొను, కొఱ యేమి చేసితి నరుణాచలా!

26. గౌతమ పూజిత కరుణా ఘననఘమా కడగంట నేలుమా యరుణాచలా!

27. సకలము కబళించు కరకాంతియిన మనో, జలజ మలర్పుమా అరుణాచలా!

28. తిండిని నిన్జేరి తిని తిననా నేను, శాంతమై పోవుదు నరుణాచలా!

29. మది చల్లపడ భద్రకరముంచి యమృతనోర్, తెఱు మనుగ్రహచంద్ర మరుణాచలా!

30. వన్నెను జెఱచి నిర్వాణ మొనర్చి కృ, పా వన్నె నిడి బ్రోవు మరుణాచలా!

31. సుఖసముద్రము పొంగ వాక్ మనము లడంగ, నూరక నమరు మం దరుణాచలా!

32. వంచింతు వేల నన్ శోధింపకిక నీదు, జ్యోతిరూపము జూపు మరుణాచలా!

33. పదవిద్య గఱపి యీ భూమి మైకము వీడి, రూపగు విద్య జూపరుణాచలా!

34. చేరకున్నను మేను నీరుగ గరగి క, న్నీటేరయి నశింతు నరుణాచలా!

35. ఛీ యని ద్రోసిన జేయు కర్మ తపన, గా కేది మనుమార్గ మరుణాచలా!

36. చెప్పక చెప్పి నీవు మౌనత నుండని, యూరక యుందువే యరుణాచలా!

37. సోమరినైతిని మిన్నని సుఖనిద్ర, కన్న వేఱేది గతి యరుణాచలా!

38. శౌర్యము జూపితి శమియించెనని మాయ, శమియింపకున్నావు అరుణాచలా!

39. కుక్కకు న్నీచమే, నేనే గుఱుతుగొని, వెదకి నింజేరుదు నరుణాచలా!

40. జ్ఞానము లేక నీయాశ దైన్యము బాప, జ్ఞానము దెల్పి బ్రో వరుణాచలా!

41. తేటివలెను నీవు వికసింపలేదని, యెదుట నిలుతువేల యరుణాచలా!

42. తత్త్వ మెఱుగజాల నంతయై నిలుతువే, యిది యేమి తత్త్వమో యరుణాచలా!

43. తా నేను దా నను తత్త్వ మిద్దానిని, తానుగా జూపింతు వరుణాచలా!

44. త్రిప్పి యహంతను నెప్పుడు లోదృష్టి, గన దెలియు ననునదే యరుణాచలా!

45. తీరముండని యెద వెదకియు నిన్ను నే, దిరిగి పొందితి బ్రోవు మరుణాచలా!

46. సత్య జ్ఞానము లేని యీ జన్మఫలమేమి, యొప్పగ రావేల యరుణాచలా!

47. శుద్ధవాఙ్మనయుతులం దోచు నీ నిజా, హంత గల్పి నను బ్రోవరుణాచలా!

48. దైవమనుచు నిన్ను దరి జేరగా నన్ను, పూర్ణనాశ మొనర్చి తరుణాచలా!

49. వెదుకక గనిన సచ్ఛ్రీయనుగ్రహనిధీ, మది తెగుల్ తీర్చి బ్రోవరుణాచలా!

50. ధైర్యము పరుగిడు నీ నిజాహ, మరయదే నే నాశమైతి బ్రోవరుణాచలా!

51. తాకి కృపాకరము నను గలియకున్న, నిజము నశింతు బ్రోవరుణాచలా!

52. దోషరహిత నీవు నాతో నైక్యమయి, నిత్యానందమయ మొనర్పు మరుణాచలా!

53. నగకు నెడము కాదు నిన్వెదికిన నన్ను, గను కృపానగ వేసి యరుణాచలా!

54. నాన లేదె వెదుక నేనయి నీ వొంటి, స్థాణువై నిలిచితి వరుణాచలా!

55. నీ జ్వాల గాల్చి నన్ నీఱు సేసెదు మున్నె, నీ కృప వర్షింపు మరుణాచలా!

56. నీవు నే ననగ నిత్యానందమయముగ, నిలుచు స్థితి కరుణింపరుణాచలా!

57. అణురూపు నిన్ను నే మిన్ను రూపుం జేర, భావోర్మిలెపుడాగు నరుణాచలా!

58. సూత్రజ్ఞానము లేని పామరు నామాయా, జ్ఞానము గోసి కావరుణాచలా!

59. మక్కి మక్కి కరగి నే నిన్ను శరణంద నగ్నుడవై నిల్చితరుణాచలా!

60. నేస్తముండని నాకు నీయాశ జూపి నన్, మోసగింపక బ్రోవు మరుణాచలా!

61. నవసి చెడు ఫలము నందేమి ఫలమేరి, పక్వత లోగొను మరుణాచలా!

62. నొప్పింపకను నిన్ను నొసగి నన్ గొనలేదె, యంతకుడవు నాకు నరుణాచలా!

63. చూచి చింతించి మేనుం దాకి పక్వము, చేసి నీ వేలి బ్రోవరుణాచలా!

64. మాయా విషము పట్టి తలకెక్కి చెడుమున్నె, కరుణ పట్టొసగి బ్రోవరుణాచలా!

65. కను కృపన్ మాయాంతముగ గృప గననేని, గను నీకెవరు చెప్పుటరుణాచలా!

66. పిచ్చి వీడ నిను బోల్ పిచ్చి జేసితె దయన్, పిచ్చిని మాన్పు మం దరుణాచలా!

67. నిర్భీతి నిను జేరు నిర్భీతు నను జేర, భీతి నీకేలొకో యరుణాచలా!

68. అల్పజ్ఞానమదేది, సుజ్ఞానమేదయా, ఐక్యమంద కరుణింపరుణాచలా!

69. భూ గంధమగు మది పూర్ణగంధము గొన, బూర్ణ గంధ మొసంగు మరుణాచలా!

70. పేరు దలపగనే పట్టి లాగితివి, నీ మహిమ కనుదు రెవరరుణాచలా!

71. పోగ భూతము పోని భూతమై పట్టి నన్, భూతగ్రస్తుని జేసితరుణాచలా!

72. మృదులతన్ నే బ్రాపు లేక వాడగనీక, పట్టుకొమ్మయి కావు మరుణాచలా!

73. పొడిచే మయికపర్చి నా బోధ హరియించి, నీ బోధ గనుపించి తరుణాచలా!

74. పోక రాకలు లేని సమరంగ దివి జూపుమా, కృపా పోరాట మరుణాచలా!

75. భౌతికమౌ మేని పట్టార్చి యెపుడు, నీ మహిమ గన గరుణింపరుణాచలా!

76. మలమందు నీవియ్య మలమగుటయో కృపా, మలమందువై వెలుగరుణాచలా!

77. మానము గొని చేరువారి మానము బాపి, నిరభిమానత వెలుగరుణాచలా!

78. మించగా వేడెదు కించిజ్ఞుడను నను, వంచింపకను బ్రోవు మరుణాచలా!

79. నావికుడుండక పెనుగాలి నలయు, నావను గాక కాచిబ్రో వరుణాచలా!

80. ముడిమూలముల్ గాన మునుకొంటవి సరిగ, ముగియ భారము లేదొ యరుణాచలా!

81. ముక్కిడి మును జూపు ముకురము గాక నన్, హెచ్చించి కౌగిలిం పరుణాచలా!

82. సత్యాహమున మనోమృదు పుష్పశయ్యపై, మేనల్గయ గరుణిం పరుణాచలా!

83. మీదు మీదుగ మ్రొక్కు భక్తుల జేరి, నీవందితే మేలిమి యరుణాచలా!

84. మైమై దణచి కృపాంజనమున నీ సత్యవశ, మొనరించితి వరుణాచలా!

85. మొగ్గ పటిపి నను బట్టబయట నీవు, నట్టాడు టేలొకో యరుణాచలా!

86. మోహము ద్రప్పి నీ మోహమొనర్చి, నా మోహము తీరదా యరుణాచలా!

87. మౌనియై రాయిగా నలరక యున్నచో, మౌనమిది యగునో యరుణాచలా!

88. ఎవరు నా నోటిలో మన్నును గొట్టి, నా బ్రతుకు హరించిన దరుణాచలా!

89. ఎవరు గనక నాదు మదిని మైకపరిచి, కొల్లగొనిన దెవరరుణాచలా!

90. రమణుడనుచు నంటి రోషము గొనక నన్, రమియింపజేయ రమ్మరుణాచలా!

91. రేయింబవలు లేని బట్టబయటి యింట రమియింపగా రమ్ము అరుణాచలా!

92. లక్ష్యముంచి యనుగ్రహాస్త్రము వైచి నన్ గబళించి తుసురుతో నరుణాచలా!

93. లాభమీ విహపర లాభహీనుని జేరి లాభమేమందితీ వరుణాచలా!

94. రమ్మని యనలేదె వచ్చి నావం తివ్వ వెఱకు నీ తలవిధి యరుణాచలా!

95. రమ్మని లోదూరి నీ జీవ మిడునాడె నా జీవమును బాసి తరుణాచలా!

96. విడిచిన గష్టమౌ విడక నిన్నుసురును విడువ ననుగ్రహింపరుణాచలా!

97. ఇల్లు విడువ లాగి లోనింటిలో జొచ్చి యొగి నీదు నిలు జూపి తరుణాచలా!

98. వెలిపుచ్చితి న్నీదుసేత కినియక నీ కృప వెలిబుచ్చి కావరుణాచలా!

99. వేదాంతమున వేఱులేక వెలింగెడు వేదపదమ బ్రోవు మరుణాచలా!

100. నింద నాశీస్సుగా గొని దయాపాత్రుగ జేసి వీడక కావు మరుణాచలా!

101. నీట హిమముగ ప్రేమకారు నీలో నన్ ప్రేమగ కరగి బ్రోవరుణాచలా!

102. అరుణాద్రి యన నే కృపావల బడితి దప్పునె నీ కృపావల యరుణాచలా!

103. చింతింప కృపపడ సాలీడు వలె గట్టి చెఱపెట్టి భక్షించి తరుణాచలా!

104. ప్రేమతో నీ నామమాలించు భక్త భక్తుల భక్తుగా బ్రోవు మరుణాచలా!

105. ననుబోలు దీనుల నింపొంద కాచుచు జిరంజీవివై బ్రోవు మరుణాచలా!

106. ఎముకలరుగు దాసు మృదువాక్కు విను చెవిన్ గొనుమ నా యల్పోక్తు లరుణాచలా!

107. క్షమగల గిరి, యల్పవాక్కు సద్వాక్కుగ గొని కావు మఱి యిష్ట మరుణాచలా!

108. మాలను దయచేసి యరుణాచలరమణ నా మాల దాల్చి బ్రోవరుణాచలా!

అరుణాచలశివ – అరుణాచలశివ – అరుణాచలశివ – అరుణాచలా!
మంగళమరుణాచలమునకు – మంగళము భక్తశ్రేణికి
మంగళమక్షరమణమాలకును – జయ! జయ!! జయ!!! జయ!!!!
అరుణాచలశివ – అరుణాచలశివ – అరుణాచలశివ – అరుణాచలా!
అరుణాచలశివ – అరుణాచలశివ – అరుణాచలశివ – అరుణాచలా!



# రమణులు తమిళంలో రచించిన అక్షర మణమాల (యథాతథంగా)

తరుణారుణమణి కిరణావలినిహర్, తరుమా క్షరమణ మహిళ్-మాలై
తెరుణాటియతిరు వటియార్ తెరుమరళ్, తెళియాప్పరవుటల్ పొరుళాహ
కరుణాకరముని రమణారియనువ, హైయినార్ సొలియటు గతియాహ
అరుణాచలమెన అహమేయఱివొట్, మళ్వార్ శివనుళహోల్వరే
అరుణాచలవరర్కేఱ్ఱ అక్షరమణమాలై శాఱ్ఱ
కరుణాకర గణపతియే కరమరుళికాప్పాయే
అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!
రుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!

1. అరుణాచల మెన అకమే నినైప్పవర్,
   అహత్తై వేరఱుప్పాయ్ అరుణాచల
2. అళకు సున్దరం పోల్ అకముం నీయుము-
   ఱ్ఱభిన్నమాయ్ ఇరుప్పోం అరుణాచల
3. అహం పుకున్తీర్తున్ అకగుకై శిఱయాయ్
   అమర్విత్తతెన్ కొళ్ అరుణాచల
4. ఆరుక్కా ఎనై ఆణ్టెనై అకట్టిటిల్
   అకిలం పళిత్తిటుం అరుణాచల
5. ఇప్పళి తప్పునై ఏన్ నినైప్పిత్తాయ్
   ఇనియార్ విటువార్ అరుణాచల
6. ఈన్టిటుం అన్నైయిర్ పెరితరుళ్ పురివోయ్,
   ఇతువో ఉనతరుళ్ అరుణాచల
7. ఉనయే మాఱ్ఱి ఓటాతుళత్తిన్మేల్ ఉఱుతియాయ్
   ఇరుప్పాయ్ అరుణాచల
8. ఊర్ శుఱ్ఱుళం విటాతునైక్కణ్టట్కట
   ఉన్నళకైక్కాట్టరుణాచల

9. ఎనెయళిత్తిప్పోతెనైక్కలవావిటిల్
ఇతువో ఆణ్మై అరుణాచల

10. ఏనిన్త ఉఱక్కం ఎనైప్పిఱరిళుక్క
ఇతువునక్కళకో అరుణాచల

11. ఐమ్పులక్కళ్వర్ అకత్తినిల్ పుకుమ్పో
తకత్తిల్ నీ ఇల్లయో అరుణాచల

12. ఒరువనాం ఉన్నై ఒళిత్తెవర్ వరువార్
ఉన్ శూతేయిత్ అరుణాచల

అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!

అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!

13. ఓంకరప్పొరుళ్ ఒప్పుయర్విల్లోయ్
ఉనైయారఱివార్ అరుణాచల

14. ఔవ్వైపోల్ ఎనక్కు ఉన్ అరుళై తన్నైనై
ఆళువతున్ కటన్ అరుణాచల

15. కణ్ణుక్కు కణ్ణాయ్ కణ్ణిన్ఱి కాణునై
కాణువతెవర్ పార్ అరుణాచల

16. కాన్తమిరుమ్పుపోల్ కవర్న్తెనై విటామల్
కలన్తెనోటిరుప్పాయ్ అరుణాచల

17. గిరివురువాకియ కిఱుపైక్కటలే (కృపైక్కటలే)
కృపైకూర్న్తరుళువాయ్ అరుణాచల

18. కీళ్మేల్కెంం కిళరొళిమణియెన్
కీళ్మైయెయ్ పాళ్ శెయ్యరుణాచల

19. కుఱ్ఱముఱ్ఱఱుత్తెనై గుణమాయ్ పణిత్తాళ్
గురువురువాయొళిర్ అరుణాచాల

20. కూర్వాట్ కణ్ణియర్ కొటుమయిల్ పటాతరుళ్
కూర్న్తెనై శేర్న్తరుళ్ అరుణాచల

21. క్చెయుం వ్చయాయ్ క్చొముం ఇఱన్కిలై
అచ్చలెన్ఱేయరుళ్ అరుణాచల

22. కేళాతళిక్కుమున్ కేటిల్ పుకళై
కేటుశెయ్యాతరుళ్ అరుణాచల
23. కయ్యినిర్ కనియున్ మెఱ్యసం కొణ్టు (ఉ)
వగై వెఱికొళవరుళ్ అరుణాచల
24. కొటియిట్టటియరై కొల్లునైక్కట్టి
కొణ్టెన్కన్ వాళే?వన్ అరుణాచల
అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!
అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!
25. కోపమిల్ గుణత్తోయ్ కుఱియాయెనైక్కొళ
కుఱయెన్ శెయ్తేన్ అరుణాచల
26. గౌతమర్ పోఱ్ఱుం కరుణైమా మలైయే
కటైక్కణిత్తాళ్వాయరుణాచలజి
27. సకలముం విళుంగ్ కతిరొళియినమన
జలజమలర్తీటరుణాచలజి
28. శాప్పాటున్నై శార్న్దుణవాయాన్
శాన్తమాయ్పోవెన్నరుణాచాలజి
29. చిత్తం కుళిర కతిర్ అస్తంవైతత్తముతవా
యైత్తిఱ అరుళ్మతియరుణాచల
30. శీలైయళిత్త్ నిర్వాణమాయ్ శెయ్తరుళ్
శీలైయళిత్తరుళ్ అరుణాచల
31. సుఖక్కటల్ పొం చొల్లుణర్వట్క
చుమ్మాపొరున్తిటన్గరుణాచలజి
32. శూతుశెయ్ తెన్నై శోదియాదినియున్
జోతియురుక్కాట్టరుణాచలజి
33. చెప్పటి విద్దైక్కఱిప్పటి మయక్కువి
ట్టురుప్పటు విద్దైక్కాట్టరుణాచల
34. శేరాయెనిన్మెయ్ నీరాయురుకి
కణ్ణీరాఱ్ఱళివేన్ అరుణాచల

35. చైయ్యనత్తళ్ళిర్ చెయ్వినై శుటుమలాల్
ఉయ్యాగై ఏతుఱై అరుణాచల

36. చొల్లాతు చొల్లి నీ చొల్లఱ నిల్లెన్రు
చుమ్మావిరున్తాయ్ అరుణాచల

అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!
అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!

37. శోమ్బియాయ్ చుమ్మా సుఖముణ్బుఱ్కటిల్
చొల్ వేఱెన్ గతి అరుణాచల

38. శౌరియం కాట్టినై శళక్కఱ్ఱుతెన్రే
చలియాతిరున్తాయ్ అరుణాచల

39. మలియిర్ కేటా నానెన్నుఱుతియాల్
నాటినిన్నుఱువేన్ అరుణాచల

40. నమిల్లాతువున్ ఆసయాల్ తళర్వఱ
జ్ఞానం తెఱిత్తరుళ్ అరుణాచల

41. తత్తువం తెరియాతత్తనైయుఱ్ఱాయ్
తత్తువం ఇతువెన్ అరుణాచల

42. తానే తానే తతువం ఇతనై
తానే కాట్టువాయ్ అరుణాచల

43. తిరుమ్బి అహంతనై దినమక కణ్కాణ్
తెరియుమెన్రనైనెన్ అరుణాచల

44. ధీరమిల్లకత్తిల్ తేటియున్తనయాన్
తిరుమ్బవుఱ్ఱేన్ అరుళ్ అరుణాచల

45. తుప్పఱివిల్లాతిప్పిఱప్పెన్ పయన్
ఒప్పిట వాయేన్ అరుణాచల

46. తూయ్ మన మొళియర్ తోయుమున్ మెయ్ అకం
తోయవేయరుళెన్ అరుణాచల

47. దైవమెన్రున్నై చారవేయెన్నై
చేరయొళిత్తాయ్ అరుణాచల

48. తేటాతుఱ్ఱునల్ తిరువరుళ్ నిధియక
తియక్కం తీర్తరుళ్ అరుణాచల
అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!
అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!

49. ధైరియమోటుమున్ మెయ్యకనాటయాన్
తట్టళిన్తేన్ అరుళ్ అరుణాచల

50. తొట్టరుళ్ కైమెయ్ కట్టిటాయెనిలియాన్
నష్టమావేనరుళ్ అరుణాచల

51. తోటమిల్ నీయకతోటొన్డ్రి యెన్ఱ్డాం
సన్తోటమొన్డ్రిటవరుళ్ అరుణాచల

52. నకైక్కిట మిలైనిన్ నాటియయెనై అరుళ్
నకైయిట్టాపార్ నీ అరుణాచల

53. నాణిలై నాటిట నానాయొన్డ్రిని
స్తాణువాయ్ నిన్డ్రనై అరుణాచల

54. నిన్నెరి ఎరిత్తెనై నీరాక్కిటుమున్
నిన్నరుళ్ మళైపొళి అరుణాచల

55. నీ నానఅప్పులి నిత్కళిమయమాయ్
నిన్డ్రిటుం నిలైయరుళ్ అరుణాచల

56. నున్నుఱువునైయాన్ విణ్ణుఱునణ్ణిట
ఎణ్ణలై ఇరుమెన్డ్రరుణాచల

57. నూలఱివఱియా పేదయనెన్డ్రన్
మాలఱివఱుత్తరుళ్ అరుణాచల

58. నెక్కునెక్కురుకియాన్ పూక్కిట ఉనై పుగ
నక్కనా నిన్డ్రనై అరుణాచల

59. నేసమిల్ ఎనక్కు ఉన్ ఆసయైక్కాట్టి
మోసం చెయ్యాతరుళ్ అరుణాచల

60. నైన్తళిక్కనియా నలనిలై పదత్తిల్
నాటియుత్ కొళ్ నలం అరుణాచల

అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!
అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!

61. నొన్తిటాతున్తనై తన్తైనైకొణ్టిలై
అన్తకన్ నియెనరుణాచాల

62. నోక్కియేక్కరుతిమెయ్ తాక్కియే పక్కువ
మాక్కి నీ ఆణ్టరుళ్ అరుణాచల

63. పఱ్ఱిమాల్ విటన్తలై ఉఱ్ఱిటుమునమరుళ్
పఱ్ఱిట అరుళ్ పురి అరుణాచల

64. పార్తరుళ్ మాలఱ పార్తిలైయెనినరుళ్
పారునక్కార్ శొల్వర్ అరుణాచల

65. పిత్తువిట్టునై నేర్ పిత్తనాక్కినైయరుళ్
పిత్తం తెళిమరున్తరుణాచల

66. భీతియిల్ ఉనైశార్ భీతియిలెనైశేర్
భీతియుఱ్రెనక్కేన్ అరుణాచల

67. పుల్లఱివేతుఱై నల్లఱివేతుఱై
పుల్లిటవేయరుళ్ అరుణాచల

68. పూమణమామనం పూరణమనం కొళ
పూరణమణమరుళ్ అరుణాచల

69. పెయర్నినైత్తిటవే పిటిత్తిళుత్తనెయున్
పెరుమై యారఱివార్ అరుణాచల

70. పేయ్తనం విట విటాపేయాయ్ పిటిత్తెనై
పేయనాక్కినెయెన్ అరుణాచల

71. పైమ్మిటియానాన్ పఱ్ఱిన్ఱి వాటామల్
పఱ్ఱుక్కొటాయ్కావరుణాచలజి

72. పొటియాన్ మయక్కి యెన్ బోధత్తైప్పఱిత్త్
ఉన్ బోధత్తైక్కాట్టినై అరుణాచల

అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!
అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!

73. పోక్కుంవరవుమిల్ పొతువెళియినిల్ అరుళ్
పోరాట్టం కాట్టరుణాచల
74. భౌతికమాముటల్ పఱ్ఱుఱ్ఱానాళుమున్
భవిశుకణ్టుఅవరుళ్ అరుణాచల
75. మలైమఱున్దిటని మలైత్తిటవోవరుళ్
మలైమఱున్దాయొళిర్ అరుణాచల
76. మానంకొణ్టుఱుపవర్ మానత్తైయళి
త్తభిమానమిల్లాతొళిర్ అరుణాచల
77. మ్చిటిల్ క్చిటున్ క్చొవతివనియాన్
వ్పయాతరుళ్ళై అరుణాచల
78. మీకామనిల్లామన్ మాకాఱ్ఱాలైకలం
ఆకామల్ కాత్తరుళ్ అరుణాచల
79. ముటియటికాణా ముటివిటుత్తనేర్
ముటివిట కటనిలై అరుణాచల
80. మూక్కిలన్ మున్కాట్టు ముకురమాకాతెనై
తూక్కియణైన్తరుళ్ అరుణాచల
81. మెయ్యకత్తిన్మనమెన్మలరణయిల్ నాం
మెయ్ కలన్దిటవరుళ్ అరుణాచల
82. మేన్మేల్ తాళ్ణిటుం మెల్లియర్ చేర్ను నీ
మేన్మయుఱ్ఱానైయెన్ అరుణాచల
83. మైమయనీత్తరుళ్ మెయ్యినాలునతుణ్
మైవసమాక్కినేన్ అరుణాచల
84. మొట్టయటిత్తెనై వెట్టవెళియినీ
నట్టమాటినైయెన్ అరుణాచల
అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!
అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!
85. మోకంతవిర్తున్ మోకమా వైత్తుమెన్
మోకంతీరాయెన్ అరుణాచల

86. మౌనియాయ్ కల్ పోల్ మలరాతిరున్తాల్
మౌనమితామో అరుణాచల

87. యెవనెన్ వాయిల్ మణ్ణినైయట్ట్రి
ఎన్నిళైపొళిత్తతరుణాచల

88. యారుమఱియాతెన్ మతియినై మరుట్టి
యెవర్ కొళై కొణ్టతరుణాచల

89. రమణనెన్ ఱురైత్తేన్ రోషం కొళ్ళతెనై
రమిత్తిట చెయ్యవా అరుణాచల

90. రాప్పకలిల్లా వెఱువెళివీట్టిల్
రమిత్తిటువోం వా అరుణాచల

91. లక్షియం వైత్తరుళస్తిరం విట్టెనై
భక్షిత్తాయ్ ప్రాణనోటరుణాచల

92. లాభనీయిహపర లాభమిలెనైయుఱ్ఱు
లాభమెన్నుఱ్ఱనై అరుణాచల

93. వరుంపటి శొల్లిలై వన్తెన్పటియళ
వరున్తిటుం తలైవిధియరుణాచల

94. వావెన్ఱకంపుక్కున్ వాళ్వరుళన్టేయెన్
వాళ్విళన్తేనరుళరుణాచలజి

95. విట్టిటిల్ కష్టమాం విట్టిటాతునైయుయిర్
విట్టిట అరుళ్పురియరుణాచల

96. వీటువిట్టీర్తుళ వీటుపుక్కుప్పైయ్యవున్
వీటుకాట్టినైయరుళ్ అరుణాచల

అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!
అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల శివ, అరుణాచల!

97. వెళివిట్టేనున్ శెయల్ వెఱుత్తిటాతున్నరుళ్
వెళివిట్టైనెక్కా అరుణాచల

98. వేదాన్తత్తై వేరఱవిళ్కుం
వేదప్పొరుళరుళ్ అరుణాచల

99. వైతలై వాళ్తా వైత్తరుళ్ కుటియా
వైత్తైనై విటాతరుళ్ అరుణాచల

100. అమ్పువిలాళిపోల్ అన్పురువునిలెనై
అన్పా కరైత్తరుళ్ అరుణాచల

101. అరుణయెన్టణ్ణియాన్ అరుళ్ కణ్ణిపట్టేనున్
అరుళ్వలై తప్పుమో అరుణాచల

102. చిన్తిత్తరుళ్పట చిలన్తిపోల్ కట్టి
చిఱయిట్టుణ్ణనై అరుణాచల

103. చిన్తిత్తరుళ్పట చిలన్తిపోల్ కట్టి
చిఱయిట్టుణ్ణనై అరుణాచల

104. అన్పోటున్ నామం కేళ్ అన్పర్తం అన్పర్
క్కన్పనాయిటవరుళ్ అరుణాచల

105. ఎన్పోలుం దీనరై ఇన్పుఱ కాత్తునీ
ఎన్నాళుం వాళ్నరుళ్ అరుణాచల

106. ఎన్పురుక్కన్పర్తం ఇన్సొర్కొళ్
శెవియుమెన్ పున్మొళి కొళవరుళరుణాచల

107. పొరుమయాం భూతర పున్సొలై నన్సొలా
పొరుత్తరుళిష్టం పిన్నరుణాచల

108. మాలయళిత్తరుణాచల రమణవెన్
మాలయణిన్తరుళ్ అరుణాచల

